# ముగ్ధప్రణయము.

## [ఒథెల్లో]

[ముగ్ధహృదయసంజనిత ప్రణయపరవశమ్మున ననురూపుఁడుకాని పతింగూడి నిష్కళంక ప్రేమతత్త్వము ప్రదర్శించి. తన కౌతనికకు కారణమై జగన్మాతను సంస్మరించుచు నసువులంబాసిన యప్రతిమాన పతివ్రతామతల్లియొక్క విషాదాంత చారిత్రము.]



గ్రంథకర్త:
కర్లపాలెము లక్ష్మీనరసింహారావు.

# ముగ్ధప్రణయము.

## [ఒథెల్లో]

ఇయ్యది,

జగద్విఖ్యాతుఁడగు షేక్స్పియరు కవీంద్రుఁ డాంగ్లమున రచించిన

సుప్రసిద్ధ 'ఒథెల్లో' నాటకమునకు రసభావానుగుణ్యముగ

కర్లపాలెము లక్ష్మీనరసింహారావుచే

రచింపఁబడిన యాంధ్రానువాదము.

ఇందలి తొలిపలుకు

మ. రా. శ్రీ రాయసము వేంకటశివుఁడు

M. A. L. T. గారిది.

మొదటి కూర్పు : 1200 ప్రతులు.

బెజవాడ : ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

క. కోదండరామయ్యగారిచే ముద్రింపఁబడియె.

1933

 — [వెల రు 0—12—0

# తొలిపలుకు.

షేక్స్పియరు మహాకవిప్రణీత మగు విషాదాంత నాటకములలో నెల్ల "ఒథెల్లో" పరిపూర్ణ మయిన దనియు, అందలి కథాసంవిధానము అత్యద్భుతమయిన దనియు సరసు లెంచుచున్నారు. ఇందలి ఇయాగోను మించిన దుష్టుని, డెసిడిమోనాను మించిన సుశీలను, ఆకవి చిత్రించి యుండలేదు. ఈ నాటకమున నొక్కొక్కపట్టున మనము దుఃఖవిహ్వాలుల మగుచుందుము. ఐనను, నాటకాంతమున తెరపడునపుడు, అదృశ్యులయినది మానవ పాత్రలే యనియు, సుస్థిర మగునది ప్రేమవిజయ మనియు మనము గ్రహించుచున్నాము.

ఇట్టి విదేశీయనాటకముయొక్క రుచిరతను సర్వతోముఖముగ భాషాంతరమునఁ గొనివచ్చుట సులభముగాదు. నాపూర్వశిష్యులును, చిరపరిచితులును నగు శ్రీయుత కర్లపాలెము లక్ష్మీనరసింహారావుగారిపు డీనాటకము నాంధ్రీకరించిరి. పాఠకులు ప్రేక్షకులు నీ పాశ్చాత్యనాటక మాధుర్యమును సమగ్రముగఁ గ్రోలి యానందించుటకై యీ యాంధ్రానువాదమునఁ గొన్ని యావశ్యకములగు మార్పులు చేయఁబడెను. నాటకమునకుఁ గ్రొత్తపేరిడుట, పాత్రలకు హిందూనామధేయము లొసంగుట, కథారంగమును భారతదేశమునకుఁ దరలించుట, విదేశాచారములకు మాఱుగ హైందవ సాంప్రదాయములు చొప్పించుట, ఒక్కొకచోట కథను వర్ణనను నించుక మార్పుచేయుట—ఇవియే ముఖ్యమగు మార్పులు. ఆంగ్లనాటకమందలి సొంపు లాంధ్రములోనికి

బాగుగఁ గొని వచ్చుటకే యీ మార్పులు చేయఁబడెను. కాని, యివియన్నియు చిన్న చిన్న మార్పులే. మొత్తముమీఁద నీ భాషాంతరము, భావమునందును భాషయందును, మాతృక ననుసరించియే యున్నది. షేక్సుపియరుని యతులితకథా చమత్కృతియు, సంభాషణాసారస్యము నీ యాంధ్ర రచన మున విస్పష్టముగ గోచరించుచున్నవనియు, పై మార్పుల మూలమున నీ యాంధ్రానువాదము కొన్నిపట్టుల సన్యనా టకమువలె నలరారుచున్నదనియుఁ జెప్పనగును.

కవిసార్వభౌముఁడగు షేక్సుపియరు భావసంపదను, సరళమును సరసమును నగు పదజాలమున నీ యాంధ్రకవి ప్రక టించిన రీతి నొకింత చదువరులకుఁ జవి చూపుటకీ నాటకము నుండి కొన్ని యుదాహరణముల నిచ్చుచున్నాను.

"ప్రిచం—ఛీ! దుర్మార్గుఁడా, నాముద్దుపట్టి నెచట దాచితివి? ఓరీ పాతకీ! నీవు దానిపై నెట్టి మైకము జల్లితివిరా! అసామాన్యసౌం దర్యవతి నాముద్దుబిడ్డ, ఎట్టి విలాసవంతులఁ గూడఁ గన్నెత్తిచూడని ముద్దరాలు మాకుముద్దుగుమ్మ, ఎట్టి మాయ మంత్రములు లేకున్న నీ యట్టి కురూపి ననుసరించునా? గడపదాటియెఱుంగని సుకుమారి, యిల్లు వాకిలి విడిచి, వికారరూపి వగు నీవెంటవచ్చినదన్న, లోకము నవ్వదా? రసగంధకాది సిద్ధౌషధములఁ బ్రయోగించి, నీవు నా బిడ్డ కోమలయౌవనమును గలుషదేర్చితివి." (పుట. 19)

"శ్యామ—యుద్ధరంగమునందలి బాహుబల ప్రదర్శనముచే నా కరములు కాయలు గాచియున్నవేగాని, తళుకు బెళుకు మాటల చాకచక్యము నాకెంతమాత్రముఁ జేతకాదు." (పుట. 24)

"నా పడిన కష్టములకు నన్నామె ప్రేమించెను. ఆమె నాయెడఁ జూపిన జాలికై నే నామెను బ్రేమించితిని. ఈ విధముగ నన్యోన్య

ప్రేమము వికాసము గాంచినది. ఇంతకుఁదప్ప వేఱే మందులు మాకులు నే నేమియు నెఱుఁగను.'' (పుట. 28)

“కామ—గీ॥ మున్ను నాతల్లి తనదగు పుట్టినిల్లు
వదలి మిమ్ముఁజేరఁగా వచ్చినటులె,
ఏను నావిభుఁజేరఁ బోయెదను తండ్రి;
ఆదరముతోడ నీవున న్ననుపు మయ్య” (పుట. 29)

“ఇరా—మఘూర్ణ్యుఁడు కపట మెఱుఁగఁజాలఁడు. పైకగపడు వాండ్ల సజ్జనులే యని భావించును. కావునఁ గ్రమ క్రమముగ వాని యందీ యనుమానమును పెంపొందించుచు, మెడకు గొలుసును దగిలించి కుక్కను వెంటఁగొనిపోవు చందమున నాతని వశపఱుచుకొని నా యిచ్చవచ్చిన చొప్పున నడిపించెద.'' (పుట. 40)

ఈరీతిగా నీ నాటకము తెలుఁగు చేయఁబడినది. మాతృకయందీ కట్టకడపటి వాక్యమున, “ముకుతాడ్రుచ్చిన గాడిదను దోలుకొనిపోవు చందమున'' నని యుపమానము గలదు. అనువాదకుని మార్పులు స్వల్పములును సందర్భోచితములు నని రసజ్ఞులు గ్రహింపఁగలరు.

ఈ యాంధ్రీకృతనాటకమున ముఖ్యముగ వచనమే ప్రయోగింపఁబడెను; దీనికిఁ గారణము లేకపోలేదు. పాశ్చాత్య సాంప్రదాయము చొప్పున, నాటకమందు సంగీతమున కంతగా తావులేదు. షేక్సుపియరుని యాంగ్లనాటకములందలి యతిప్రాస విరహితమగు గీతావళి, గద్యపద్యములకు మధ్యస్థముగనుండి, మన తెలుఁగు ద్విపదను బోలియుండును. పద్యముల పోంకముగాని, గానకళా కౌశలముగాని, నాటకగమనమున కేమాత్రమును నిరోధము గలిగింపరాదని పశ్చిమ ఖండవాసుల సిద్ధాంతము. భావోద్రేకమును సూచించుపట్లు

లందు మాత్రమే గీతగానాదులు పొడసూపవలయును. ఈ సూత్రము ననుసరించియే యీ యాంధ్రకవి భాషాంతరము చేసియున్నాఁడు.

ఇందలిగీతము లెంతయు నొప్పియున్నవని చెప్పనగును. మాతృకయందలి "విల్లోపాట" యొక్క సారస్యము తెలుఁగునఁ గొనిరానేరనని కవి తొలుత వెఱచెను. కాని, షేక్స్పియరు పదునాల్గు పదునైదు పాదములతోఁ గలిపించిన యీ పాటయందలి భావమును మఱి పదిపాదములతో నీ కవి రమ్యమగు "భగ్నప్రణయగీతము" గ తెలుఁగునం దల్లెను.

"పండు బెట్టిన పచ్చిక బయలులోని
గడ్డిపూలను సమకూర్చి కంఠహార
మొంటి నిర్మించి ధరియించుకొంటి వీవు
ప్రియతిరస్కృతి కిసుమంత బెంగఁ గొనక
పాడుకొంటివి హృదయతాపమ్ము దీర
ప్రాణనాథతిరస్కృత ప్రణయచరిత."

అనుపదములు మాతృకయందలి పాటలోని తుదిపంక్తుల యర్థమును సువ్యక్తము చేయుచున్నవి.

ఆంధ్రసారస్వతాభిమానులీ గ్రంథమును విరివిగాఁ జదివియు ఆంధ్రనాటకసమాజములవారీ నాటకమును బలుచోట్ల ప్రదర్శించియు, కవి కిట్టి గ్రంథరచనమునఁ దగు ప్రోత్సాహము గలిగింతురుగాకయని కోరుచున్నాను.

గుంటూరు,
19-8-1933.

రాయసము వెంకటశివుఁడు.

# మనవి.



౧౮౭౭ వ సంవత్సరమున తొలుత నే 'యొథెల్లో' నాటకము నాంగ్లమునఁ జదివినప్పుడే యిందలి భావములు ప్రాచ్యసాంప్రదాయానుగుణ్యముగ నుంటచే మనదేశజులకు హృదయంగమములు కాఁగలవని తలంచి యప్పుడే దీని నాంధ్రీకరింప మొదలు పెట్టితిని. కాని "మందఃకవియశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్." అను కాళిదాసోక్తి ననుసరించి నాకిందుకు శక్తి చాలదని కొంతవఱకు వ్రాసి నిలిపివేసితిని. తరువాత నప్పుడప్పుడు కొంచెము కొంచెముగ వ్రాసి ౧౮౭౬ వ సం॥మున ముగించితిని. కాని యిందలి భాగములు కొన్ని నాకు సంతృప్తిఁ గలిగింపలేదు. ముఖ్యముగఁ జతుర్థాంకములోని "విల్లో" గీతమునందలి కరుణారసమును బ్రదర్శింపఁ జేయ నా వలనఁగాదని నిరాశఁజెంది వదలివేసితిని.

ఇటీవల ౧౮౯౭ వ సం॥మున "ఒథెల్లో" నాటకము నెవ్వరో యాంధ్రీకరించి నట్లును నది బాగుండనట్లును నొక విమర్శనము చదివితిని. అపుడు నా గ్రంథమును పైకిఁ దీసి కొంచెము శ్రమపడి యందలి లోపములను నా శక్తికొలఁది సవరించి యీ గ్రంథమును దిరుగ వ్రాసితిని. అంత దీనిని గురువులకును, గురుతుల్యులకును, నటకులకును, మిత్రులకును, బలువురకుఁ జూపితిని. అందఱును నిది చాల రసవంతముగ నున్నదనియు నవశ్యము ప్రచురింపఁ దగినదనియు వాక్రుచ్చిరి. అంతట ధైర్యము తెచ్చుకొని ౧౭ వర్షములు కృషిసలిపి సాధించిన యీ కావ్యకన్యకను రసజ్ఞులగు నాంధ్రలోకమున కర్పించుచున్నాఁడను. ఇందలి గుణాగుణవిచక్షణ రసగ్రహణపారీణులును, ఆంగ్లాంధ్రోభయభాషాకోవిదులును నగు సదస్యులకు విడిచిపెట్టుచున్నాను. ఓపికలేనివారీ గ్రంథమునందలి చతుర్థాంకమును మాత్రమైన సంపూర్ణముగఁ జదువుదురుగాక యని కోరుచున్నాను.

ఇంక భాషాంతరీకరణముపిషయములో ననేకాభిప్రాయము లున్నవని నే నెఱుంగుదును. ముఖ్యముగఁ గొందఱు మూలగ్రంథములోని పేరులను మార్చఁగూడదని నొక్కి చెప్పుదురు. భాష యెప్పుడు మారుచున్నదో అప్పుడే తదనుగుణ్యముగ దేశము, కాలము, వేషము మారిపోయినట్లే; పేరులు

గూడ భాషాసాంప్రదాయానుగుణ్యముగ మార్పుఁజెందు టత్యావశ్యకమని నానమ్మకము. అనేకగ్రంథములఁ బరిశీలించి చాలినంత యనుభవము సంపాదించి యాంధ్రీకరణ మన నిల్వయుంపవలెనను నిర్ధారణ నేనిపుడు దీనిని ప్రచురపఱచుచున్నాను. మఱియు నిందలి నాయికా నాయకుల యిరువురి యొక్క విషాదాంతమునకు మూలకారణము వారిరువురి యుత్కటప్రేమము వివేక రాహిత్యమునుండి యుత్పన్నమగుటయే. అందుచే వివేకవిహీనమగు ప్రణయమే యీగ్రంథమందలి మూలవస్తువు. ఈభావమును సరళమగుభాషలోఁ బొందుపఱచనెంచి దీనికి "ముగ్ధప్రణయ"మని నామకరణ మొనర్చితిని.

భాషయొక్క పాటవము ననుసరించి, రసోత్పాదనమగునని నా నమ్మకము. నాటకమున కెప్పుడును రసమే జీవకళ. కావున నిందలి భాష పాత్రాశ్రయముగాక సందర్భానుసరణముగను, భావానుసరణముగను, రసోత్పాదకముగ సమకూర్పఁబడినది. ఇందు దోషము లనేకము లుండవచ్చును. స్ఖాలిత్యములుఁగూడఁ బెక్కులుగలవు. ఇన్నిటికిని నా కించిజ్జ్ఞతయే కారణమని మనవిఁజేసికొనుచుఁ దప్పులక్షమించి రసమును గ్రహింపవేడుచున్నాను.

అనేకవత్సరములు గుంటూరు కళాశాలయందు షేక్స్పియరు నాటకాధ్యాపకులుగను, పిదప నెల్లూరు కళాశాలకుఁ బ్రిన్సిపాలుగను నుండినట్టియు, నాంధ్రాంగ్లోభయభాషాపాండితీగరిమచే రెండుబాసలయందలి సారస్యమును గ్రహింప సమర్థులైనట్టియు నాంధ్రలోకమునకుఁ జిరపరిచితులైనట్టియు, మ॥ రా॥ శ్రీ రాయసము వెంకటశివుఁడు పంతులు, ఎం. ఏ., ఎల్. టి., గారు నాయందలి వాత్సల్య విశేషమున దీనికిఁ "దొలిపలుకు" వ్రాసి యొసంగినందులకు వారికిని, నీ గ్రంథమును బ్రచురింపఁ బ్రోత్సహించిన మిత్రులకును నా హృదయపూర్వక వందనము లర్పించుచున్నాను.

శ్రీముఖశ్రావణము,
పూర్ణానందంపేట, బెజవాడ,
24—8—1933.

కర్లపాలెము లక్ష్మీనరసింహారావు,
గ్రంథకర్త.

# అంకితము.

నేను మద్రాసులో నుద్యోగము చేయుచుండగా ది **19-1-23** న మా తండ్రిగారికి చాల జబ్బుగా నున్నట్లు మాస్వస్థానమగు బాపట్లనుండి యొకటి వెంట నొకటి రెండు తంతివార్తలు వచ్చెను. నే నారాత్రియే బయలుదేరి బాపట్ల చేరి యా మరునాడు మా బావగారి కొక జాబు వ్రాసితిని. అందలి భాగము లిటఁ బొందుపఱచుచున్నాను.

మా నాయనగారు మొన్న గురువారమునాడు మిగుల సంతోషముతో సంక్రాంతిపండుగ నిర్వర్తించితి నని సంతృప్తి పడెనఁట. సాయంకాలము వేళ హఠాత్తుగ వాంతి యయ్యెను. ఔషధసేవఁ జేయఁదలఁచిరి. ఇంతలో మైకము గ్రమ్ముచుండెను. తన సహజధైర్యముతోఁ బరవాలేదని చేయి మాత్రము జూపెనఁట. అప్పుడే దృష్టిపోయినది. వాక్కు నిలచిపోయినది.

ది 19-1-23 న రాత్రి పదునొకండు గంటలవేళ మా కుటుంబ సింహము లోకాంతరగతమైనది. ... మొగమున నొక్క విచారము గానఁబడలేదు. ఒక్క కోరిక వెలిఁబుచ్చలేదు. ఒక్క మాటలేదు. ఒక్క పలుకు లేదు. నిశ్చింత. నిరామయము ... ఆనాటి యుదయమున నొక్క విమానము తనకై వాకిట వేచియుండఁ దా నధిష్ఠింపఁబోవుచున్నట్లు కలఁ గనెనఁట. ఆమధ్యాహ్న మొంటిగంటవఱకు నిష్ఠాగరిష్ఠుఁడై జపము సలిపెనఁట!

ఎట్టి స్వేచ్ఛామరణము ! ఎంతటి పవిత్రగమనము !! సంపూర్ణబాధ్యత వహించియు బాధ్యతారహితుఁడగు సన్న్యాసి వోలె సంసారమున సంచరించిన యోగీంద్రుఁడు నిరంతరహృదంతరధ్యానతత్పరుఁడగు క్షత్రవరేణ్యుఁడు తాఁగన్న సంతానమునకుఁగూడఁ దేఱిచూడరాని చండశాసనుఁడు ఎట్టికష్టములందేని తొణికియెఱుంగని ధైర్యహిమాచలుండు ఎట్టిబాధలందైన దైన్యమందని గభీరహృదయుఁడు, అట్టి జితేంద్రియుని జీవము భౌతికరూపము నతివర్తించి చనినది.

ఆశ్రితక్షేత్రముల నిర్మలపయస్సు వర్షించినవారివాహక మదృశ్యమై పోయినది. పూర్ణవికాసము గాంచిన పూజాపుష్పము ఱెక్కలురాలకమున్నె తన దివ్యసౌరభసర్వస్వముతోడ నీశ్వరపాదపద్మములకడ నిష్కళంక హృదయముతోఁ జరమత్యాగమగు నాత్మార్పణము గావించుకొని తరించినది. విజ్ఞానప్రజ్వలితమై యాత్మశక్తిచే నుద్భూతమగు జీవజ్యోతి పరంజ్యోతియం దొక్క నిమేషమున నైక్యమైపోయినది. నాకు కటము లదరినవి. కండ్లు భ్రమసినవి. గుండె లవిసినవి. అంధకారపట మెల్లయెడల నావరించినట్లయినది. ఈ యంధకారమహార్ణవమున నే నాశ్రయరహితుఁడనై యేకాకినై విగతప్రాణివోలె నిర్విణ్ణుఁడనై పోయితిని. బాధ్యతారహిత జవ్వనమునుండి యొక్కమారు వార్ధక్యము పైఁబడినట్లు తోఁచుచున్నది. జీవము కృంగినది. మేను వడంకుచున్నది. త్రాణ యంతరించుచున్నట్లు చూపట్టుచున్నది....

నేఁటికి నా జన్మమందు, నాతండ్రి కగ్నిసంస్కారముఁ జేసి యాయన ఋణమం దణుమాత్రముఁ దీర్చుకొనఁ గలిగితిని. చేయి వడంకుచున్నది. ఒకరి సంపాద్యమున కొసైనఁ దినియెఱుంగఁడు! నా కొక్క దినముననైన నా తండ్రిని సంతోషపెట్టు నవకాశము లభింపలేదు. పాతకుఁడను నేను. నాకన్నులు గానఁబడుటలేదు. ఇప్పటికే రాలిన కన్నీటిబిందువులచే నీ కాగితము సగముతడిసినది. ఇంక నేమియు వ్రాయఁజాలను. సెలవుఁ గైకొనియెద. చిత్తగింపుఁడు.”

అప్పటికి కొలఁది దినముల క్రిందటనే నే నీ నాటక రచనఁ బ్రారంభించి యుంటిని. అందుచే విషాద నీహారబిందు పూరితమగు నీ యపూర్వకుముదినీ దివ్యసుమమ్మును భక్తిపురస్సరముగ నా తండ్రిగారి కంకితముచేసి యీ యశ్రుబిందువుల తోడనే పితృతర్పణమాచరించి తరింపఁ దలఁచుచున్నాను.

శ్రీముఖాశ్రయము,<br>
పూర్ణానందంపేట, బెజవాడ.<br>
శ్రీముఖ భాద్రపద శు॥ ౮<br>
గురువారము.

కర్లపాలెము లక్ష్మీనరసింహారావు.<br>
24-8-1933.

ఓం



శ్రీసరస్వత్యైనమః.

నవశోభాకలితం బనంత మచలా
నందప్రపూరంబు నా
కవిలోకంబునఁ గాలువెట్టు తలఁపుల్
కంఠంబు నిండార నే
భవదాశీస్సును గోరి భక్తిమెయి నిఁక
భావింతు నో తల్లి! యో
కవిహృద్వీథివిహార! భావజననీ!
కైయూత నందీయుమా.



# CAUTION.

*This* entire *Drama*, or any part hereof, *shall not be enacted* by anybody unless with the explicit written permission and instructions of the author obtained beforehand.

Bezwada, 24-8-33. } K. L. NARASIMHARAO.

---

# గమనింపు.

ఈ నాటకము పూర్తిగాగాని, యిందలి భాగములుగాని, గ్రంథకర్తయొద్దనుండి వ్రాతపూర్వకమగు ననుమతియు, నియమములును గ్రహింపనిదే యెవ్వరును బ్రదర్శింపఁగూడదు.

ఈ గ్రంథములు వలయువారును, ప్రదర్శనమున కనుమతిఁ గోరువారును,

**కర్లపాలెము లక్ష్మీనరసింహారావు,**

శ్రీముఖాశ్రయము, పూర్ణానందంపేట, బెజవాడ.

అని వ్రాయవలయును.

పూర్ణానందంపేట,
బెజవాడ,
24–8–1933. } కర్లపాలెము లక్ష్మీనరసింహారావు

---



# ముగ్ధప్రణయము.

## నాంది.

శ్రీజగన్మోహనమూర్తి వేణురవముగ్ధీభూతబృందావన
వ్రజనారీమణిమండలీవినుత భాస్వత్కీర్తి, సంకల్పమా
త్రజనానందవిధానకల్పనమహోద్యత్స్ఫూర్తి యాంధ్రావని
ప్రజలన్ గావ్యరసైకచింతనకళాప్రావీణులన్ జేయుతన్.

[నాంద్యంతమున సూత్రధారుడు పుష్పాంజలితోఁ బ్రవేశించి యా పూవుల సభాసదులపైఁ జల్లి నిలుచును.]

సూత్ర—పరబ్రహ్మస్వరూపములగు సభాముఖ్యులకు నమస్కారము. నాయందలి వాత్సల్యవిశేషమున నిట కరుదెంచి యున్న సదస్యు లీయాంధ్రదేశమునం దనేక నాటకములఁ గాంచియుందురు. అందలి దోషాదోషములను గుణాగుణములను బరిశీలించి విమర్శించి యుందురు, రసమును గ్రోలియుందురు. కాని, "కావ్యేషు నాటకం రమ్యమ్" అను నార్యోక్తిని సార్థక

పఱచఁగల తెలుఁగునాటకమును జూచిరో లేదో నేను చెప్పఁజాలను.

నేఁ డిసహృదయబృందము నెదుట నే నొకనూతన నాటకమును బ్రదర్శింపఁ దలఁచియున్నాను. ఈ దృశ్య కావ్య మిటనఱకువానివలెఁ గాక వస్తువిధానము నందును, రసభావపోషణములందును, పాత్రౌచితియం దును, నిరుపమానమైన దని చెప్ప సాహసించుచున్నా ను. ఏలయన నీకావ్యమును మొదట రచించిన మహాకవి జగద్విఖ్యాతుఁడగు షేక్స్పియరు. నాగరకలోకము లోని యన్నిజాతులలోను, అన్నిదేశములలోను ఈమ హాకవి కవితారసముఁ గ్రోలి యానందింపనివారు లేరు. ఈ మహనీయునిదివ్యవాణి దేశమును కాలమును నతి క్రమించి ప్రకృతియందు విలీనమై చిరంతనఫలముఁ గాంచినది. ఆతనిచే సృష్టింపఁబడినపాత్రలు శాశ్వత జీవముఁ గలవై మనలఁ బలుకరింపుచున్నవి. అట్టి కవినాథునిరచనలయం దెల్ల నీనాటక ముత్తమో త్తమ మని కీర్తిఁగాంచి యున్నది. అట్టియుద్గ్రంథము వలని రసానుభవము నాంధ్రలోకమున కందఁజేయు తలంపున నీసత్కావ్యమును మిగులఁ బ్రయాసపడి కడు నైపుణ్యముతో నాంధ్రీకరణమునని ట్లుండవలయు ననిపించురీతిని రచించె రసజ్ఞుఁడగు నొక్కయువకుఁడు. కవిలోకమున నూతనముగఁ గాలిడిన యశఃకాముఁ డగు నాతని మీకుఁ బరిచితుఁ జేసెదను. ఈతడు కీ. శే.

# ఇందలి పాత్రలు.

## పురుషులు.

**శ్యామలరాయుడు:**— కథానాయకుఁడు. ఘూర్జరరాజవంశమున జన్మించియు దేశదిమ్మరియై మన కథాకాలమున నాంధ్రరాజ్యమున నెన్నికఁగన్న యున్నతసైనికోద్యోగి నున్నవాఁడు.

**ఇరావంతుఁడు:**— శ్యామలరాయుని యంగరక్షకుఁడు. కపటనాటకసూత్రధారి.

**విక్రమసింహుఁడు:**— శ్యామలరాయుని దండనాథుఁడు.

**ప్రభువు:**— కేరళ, సింహళ కర్ణాటక రాష్ట్రముల నావరించియున్న యాంధ్రసామ్రాజ్యమున కధిపతి.

**ప్రచండసింహుఁడు:**— ఆంధ్రసామ్రాజ్యశాసనసభయందలి సభ్యుఁడు. కథానాయికకుఁ దండ్రి.

**లక్ష్మణసింహుఁడు:**— ప్రచండసింహుని యనుజుఁడు. రాజకీయోద్యోగి.

**రఘుపతి:**— పల్నాటిజమీందారుఁడు. ప్రేమాతురుఁడు.

**మలిదేవరాయలు:**— సింహళమందలి దుర్గరక్షకుఁడు.

(ఇంకను వార్తాహరులు, పరిచారకులు సమయానుకూలముగ వచ్చుచుందురు.)

## స్త్రీలు.

**కుముద్వతీదేవి:**— కథానాయిక. ప్రచండసింహుని యేకపుత్రిక. సౌందర్యనిధి; సద్గుణఖని.

**దమనిక:**— ఇరావంతుని భార్య; కుముద్వతి పరిచారిక.

**కళావతి:**— విక్రమసింహుని యుంపుడుగత్తె.



# ముగ్ధప్రణయము.

## ప్రథమాంకము.



(మొదటి రంగము: ఆంధ్రపట్టణమందలి యొక వీథి.)

(ప్రవేశము: ఇరావంతుఁడు, రఘుపతి.)

రఘుపతి—ఇరావంతుఁడా! నీ వెంతవాఁడవురా! నాధన మంతయు నీవశము గావించితిని, నా ప్రాణములు నీ చేతులలోఁ బెట్టితిని, నిన్నే నమ్ముకొంటిని. అప్పటికిని, నీద్రోహచింత మానవుకదా. నీ కంతయుఁ దెలిసియుండియును నాకుఁ జెప్పకపోయితివి.

ఇరా—ఛీ! దైవసాక్షి. ఈసంగతి నేను కలలోనైన నను కొనలేదు. నాకు రవంత తెలిసియుండిన నీతోఁ జెప్పనా, రఘుపతీ?

రఘు—అతనికిని నీకును సరిపడదంటివే?

ఇరా—అది యథార్థమైనఁ జెప్పుతోఁ గొట్టుము. మొన్న నా రేఁడు తనకు దండనాథుని నియమించుకొనునపుడు నా ధైర్యసాహసములను దెలిపి నన్నుఁ జేకొమ్మని వేఁడుకొంటిని. నేనే కాక యీ పట్టణమందలి ముగ్గురు పెద్దమనుష్యులు స్వయముగా నాతనికడ కేగి నే నందుకుఁ దగినవాఁడ నని బోధించిరి. కాని గర్విష్ఠుఁడగు నా ధూర్తుఁడు దండనాథుని తా నిదివఱకే నియమించుకొంటి నని నాలుగుకబుర్లు చెప్పి వారలఁ బంపివేసెను.

రఘు—అయితే యెవ్వరినిఁ గుదుర్చుకొన్నాఁడు ?

ఇరా—ఎక్కడో కొండవీటిసీమనుండి వచ్చిన వానిని జేర్చుకొనియెను. చెప్పుకొనఁగా వినియుండెనేమో గాని వాఁడు స్వయముగా యుద్ధభూమినైనఁ జూచినటుల లేదు. లాభనష్టములగుణాకారము లేమైనఁ దెలియునేమోగాని, వానికి సైన్యములు వ్యూహములు యుద్ధములు నిట్టివానియందనుభవము శూన్యమే. అదిగాక వానికి కోకవిలాసవతితగులాటము గూడఁ గలదు.

రఘు—ఇట్టివాఁడా, ఆ ప్రఖ్యాతవీరునికి దండనాథుఁడు ?

ఇరా—ఔను. వానినే యా ఘూర్జరుఁడు స్వయముగ నియమించుకొనియెను. నేనో - యిదివఱకే యాతఁడు కండ్లారఁ జూచుచుండఁగా భీకరరణరంగములలో సాహసపరాక్రమములఁ బ్రకటించిన నేను - అతనికిఁ దయినాతిగా నుండవలసె.

రఘు—ఆ! ఎంతమాట! నాబోంట్లవాండ్రైన నాతనికిఁ దయ
నాతి గాదు - ప్రాణఘాతియై యుండును.

ఇరా—కాక చేయున దేమున్నది? ఈ సేవకవృత్తిలో
నెక్కడఁ జూచినను నిట్టులనే యున్నది.

చ॥ శ్రమపడు నొక్కసేవకుఁ డజస్రము స్వామిహితంబె కోరి, త
చ్ఛ్రమముల నెంచ నింకొకఁడు నెక్కినమాటలఁ బల్కు యుక్తమో.
క్రమముగ నున్నన్ గను నొకండు సిఫారసులన్ గ్రహించి, న్యా
యము లవమైనఁ గానఁబడ దక్కట! యెంతటి పాపకర్మమో.

ఇట్టి స్థితిలో నా కాతనిపై నెంత ప్రేమ యుండునో,
నీవే యూహించుకొనుము.

రఘు—ఒక్కనిమిషముకూడ నే నిట్టి యవస్థ పడఁజాలను.

ఇరా—నేను మాత్రము వానికి దాసుఁడనైతి ననుకొంటివా
యేమి? ఒక యూహ మనసులోఁ బెట్టుకొని యది
నెఱవేఱుట కీతని ననుసరించి యుండఁ దలఁచితిని.
సమయము చూచుకొని యాతనికిఁ దగినశాస్తి చేసె
దను. అందఱు నందలము లెక్కువారే యైన మోయు
వా రెవ్వరు? కాఁబట్టి కొందఱు సేవకులుగాఁ గూడ
నుండవలసినదే. కాని వారిలో రెండు తెగలు:

ఉ॥ కొందఱు సేవకుల్ దొరలఁ గొల్చుచునుందురు బుద్ధిహీనులై,
యందుకె జన్మ మెత్తినటు లాత్మసుఖమ్ముఁ దలంప రెన్నఁడున్;
కొందఱు బుద్ధిమంతు లనుకూలురరీతి మెలంగు చెక్కడే
సందు లభించినన్ విడక సాహస మూని జయింతుర్ స్వార్థముల్.

ఈ రెండవతెగవారే నాకు నచ్చినవారు. నేను గూడ నంతే. నేనేగనఁ యాఘూర్కునివంటి దశలో నుండి యుండిన నెవ్వరి నాశ్రయింప నక్కఱలేకుండ స్వతంత్రముగా సంచరించెడివాఁడనే పరమేశ్వరు సాక్షిగ నొక్కి చెప్పెదను, వినుము నాహృదయగత మగు వాంఛలు ఫలించుట కిట్లు వినయవిధేయతలు చూపింతునే గాని నాలో భక్తివిశ్వాసము లేకోశాస లేవు. నామాటలను నాచేఁతలను బట్టి నాహృదయ మెవ్వరును గ్రహింపలేరు నాది లోపల లొకరీతి, పై కింకొకరీతి. నానిశ్చితార్థ మెవ్వరును గనిపెట్టలేరు.

రఘు——ఇది సరేగాని, నిజముగా నిట్లు జరిగెనా నామొఱకుఁడెంత యదృష్టవంతుఁడు! ఇంక వానిభోగమునకు మేరగలదా ?

ఇరా——ఇఁక పద పద. దానితండ్రిని మేలుకొలిపి యాతని వెన్నాడునటులఁ జేయవలెను. ఆతనిసౌఖ్యము సాంతము సేయవలెను. వానిభోగము భగ్నము సేయవలెను. వాడవాడల వానిదుశ్చరిత్రఁ జాటించి యాతనికి మనశ్శాంతి లేకుండఁ జేయవలెను. దాఁగఁబోయిన చోటికి దయ్యములవలె మనోవేదన యాతని వెంబడింపవలెను. దాని బంధుమిత్రులకీవార్త నెఱిఁగించి వార లందఱఁ గోపవివశులఁ జేయుదము. రమ్మి, త్వరగా రమ్మి.

[ఇరువురుఁ గొంతదూరము నడచుట నభినయింతురు.]

రఘు—ఇదియే యాపెతండ్రియిల్లు బిగ్గరగాఁ గేకలు పెట్టుదమా?

ఇరా—ఊఁ! కొంపలు తగులఁబడుచున్నప్పు డఱచినట్లు గోలగాఁ గేకలు వేయుము.

రఘు—మేలుకోండ, ఏమండోయి! మేలుకోండి. ఓ చండసింహుఁడా! మేలుకో, మేలుకో.

ఇరా—మేలుకోండయ్యా, మేలుకోండి. దొంగలు దొంగలు. లేచి యిల్లంతయుఁ జూచుకోండి. మీపెట్టెలు గిట్టెలు అన్నియు నున్నవేమో చూచుకోండి. ముందు మీ కూతు రింట నున్నదో లేదో, చూచుకోండి. దొంగలు, దొంగలు.

ప్రచండసింహుఁడు—(మేడపై నుండి ప్రవేశించి) అర్ధరాత్రి వేళ నేమి యీయాగడము?

రఘు—మహాశయా! మీవా రందరు నింటిలో నున్నారా?

ఇరా—మీతలుపు లన్నింటికిఁ దాళములు సరిగా నున్నవా?

ప్రచం—ఏమి యీ ప్రశ్నలు? ఎందు కిట్లడిగెదరు?

ఇరా—ఎందుకా! మీయింట దొంగలు పడినారు. ఇంకను జూచెద రేమి? ఇప్పుడైనను, పైన బట్ట వేసికొని బయలుదేరండి. వింటే గుండె బ్రద్దలవుతుంది. నీ ముద్దు కూఁతురు లేచిపోయినది. వెంటనే పరిజనులఁ బిలిచి

బయలుదేరుము. ఆలసించితివేని బ్రహ్మరక్షస్సు నీ కెల్లఁ డగును.

ప్రచం—మీ కేమైన మతిపోయినదా యేమి?

రఘు—ఆర్యా! నాకంతయు గుఱుతించితిరా?

ప్రచం—ఏమో! నీ వెవ్వఁడవు?

రఘు—నేను పల్నాటి జమీందారుఁడను - రఘుపతిని.

ప్రచం—ఛీ! ఛీ! ఇఁక నోరు మూయుము. తప్పతాగి తిక్క బట్టినవాని చందమున నించు కేనియు భయములేక యీ యర్ధరాత్రివేళ నాయింటికి వచ్చి కేక లిడ సాగితివా?

గేయము

ఛీ ఛీ పోరా చెడుగా నీ విటు। నాదు పుత్త్రిపై నాసఁబెట్టుకొని
కామాంధుఁడవై కన్నులు గానక। అరుగవద్దనుచుఁ దెలియజెప్పినను
మానవై ౘవా మానహీనుఁడా। ఛీ ఛీ పో చెడుగా...

రఘు—నన్ను నిష్కారణముగా దూషించుచున్నారు.

ప్రచం—ఛీ పొమ్ము. నేను తలఁచుకొనిన నీకు బుద్ధి జెప్పింపఁగల నని మఱచితివా?

రఘు—అయ్యా, కొంచెము శాంతింపుము.

ప్రచం—దొంగలు దొంగ లంటి రేమిటి? ఇది యాంధ్రనుహా పట్టణము! నా యిల్లు నట్టడవిని లేదే?

రఘు—ప్రభూ! నే నిచటికి మిగుల సదుద్దేశముతో వచ్చి యుంటిని.

ఇరా—మీరు మీకోపములో సైతానుమాటలఁ బాటించి దేవుని దిగఁ ద్రోయుచున్నారు. మీ కుపకారము నేయనెంచి మే మిటకు వచ్చియుండ మీరు మమ్ములఁ దిట్ట సాగితిరి. పోనిండు. మీముద్దుపట్టి కంచరగాడి దను గట్టుకోనిండు. మా కెందులకు?

ప్రచం—ఓరీ, పరమచండాలుఁడవు.

ఇరా—నీవు; రాజసభ్యుఁడవు.

ప్రచం—రఘుపతీ! నేను నిన్నెఱుంగుదును. ఈ యకార్యము నకుఁ దగినశిక్ష వేయించెదను.

రఘు:—నేనన్నిటికి సంసిద్ధుఁడనే కాని దయయుంచి ముందుగ యథార్థము తెలిసికొనుఁడు. రూపవతియగు నీముద్దుపట్టి యీ నిశాసమయమునఁ గూలికి యుద్ధము చేయు దౌర్భాగ్యుఁడగు నొకరఘూరుఁని చేట్టఁబట్టి లేచిపోయినది. అందులకు మీరు సమ్మతించియుండిన నిపుడు మే మొనర్చినది మహాపరాధమే యగును. లేక మీ కెఱుక లేకయే యీపని జరుగుచుండిన మీ కెఱింగింప వచ్చిన మమ్ములను మీరు నిర్హేతుకముగ నిందించినవా రయితిరి.

పరిచం—అక్కటా! ఏమిది? ఎట్టిమాట వింటిని? ఇది నిక్కువమగునా? నాముద్దుపట్టి, నాబంగారుకొండ నాయింట లేదా యిపుడు ?

రఘు—నిక్కువముగాకున్న మీతో నేను పరిహాసమాడుదునా ? మీకించుకేనియుఁ దెలియకయే యిట్టి ఘోరకార్యము జరిగెనా ? ఎంతచిత్రము ! అట్లైన మీకూఁతురే మిమ్ము మోసగించినదన్నమాట. మిమ్మలక్ష్యముచేసి తనవిధినియమముల వీటఁబుచ్చి తెలివితేటలఁ దెగనాడి, తనరూపరేఖల దేశద్రిమ్మరియగు నొక్కకారుభిల్లునకర్పించినది. ముందు వెదకి చూడుఁడు. ఒకవేళ నీయింటనేయుండిన నన్నురిదీయించెదరుగాక.

పరిచం—ఓరీ, ఎవరురా, అక్కడ ? దీపములు వెలిగింపుఁడు. కాగడాలుముట్టింపుడు. నౌకరులందఱఁ జేరబిలువుఁడు. అయ్యో ! కలలో నగుపడిన దంతయు నిజమయ్యెనే ! దీపము దీపము; ముందు దీపము. [నిష్క్రమణము.]

ఇరా—మిత్రమా ! ఇంక నేనిటఁ దడయరాదు. నన్నాతఁడు గుఱుతింపఁ గూడదు. నే నిచటనుండిన ఘూర్కునికి వైరినని వెల్లడియగును. నేనాతనిఁజూచి యెంత యసహ్యపడినను గార్యసాఫల్యముకొఱ కాతని ననుసరించి యుండక తప్పదు. ఇప్పుడు సింహళమున జరుగుచున్న తిరుగుబాటు నడంప నాతని కీడగు కార్యశూరుఁ డీ రాజ్యమున లేఁడని యాతనిఁబో నియోగించిరి. ఈ

రాత్రియే ప్రయాణమగునని తోఁచుచున్నది. కావున నీకుఁ గాముననే యాతనిఁ గలిసికొనవలయును. పోయి వచ్చెదను. [నిష్క్రమణము.]

(ప్రవేశము: ప్రచండసింహుఁడు - కాగడాలతో పరిజనముతో.)

ప్రచం—అయ్యో, అయ్యో, ఎంత ఘోర మెంత ఘోరము! ఎంతటి పాపకార్యము జరిగిపోయినది. ఇంక నాకీ జన్మమునకు గర్భశోకమేగతి. రఘుపతీ, నీవు మా కుమార్తె నెదుఁజూచితివా? ఆఘూర్ణుని వెంటఁ బోవుచుండెనా? నీ వామె నెట్లుగుర్తించితివి? ఇది నిజమేనా? అక్కటా ఆగర్భశ్రీమంతురాలగునాముద్దుపట్టి కెట్టి నిర్భాగ్యుఁడు దాపరించె. కడుగారాబముతోఁ జూచుచున్న కన్నతండ్రిని నన్నె మోసగించెనే! ఎంత మోసము! రఘుపతీ! నిన్నామె చూచెనా? నీతో నేమైనఁ బలికెనా?

రఘు—వా రిరువురుఁ బరిణయమాడఁ బోవుచుండిరి.

ప్రచం—పరిణయమాడఁబోయిరా? ఇప్పటి కది జరిగియుండునా? మిత్రులారా! రండు. బంధువులారా, శీఘ్రమే రండు, త్వరపడుఁడు. మహాఘోరము జరుగుచున్నది, వేగిరపడి రండు.

రఘు—ఇప్పటికి వివాహమై యుండుననియే తోచుచున్నది.

ప్రచం—ఆమె యింటనుండి యెట్లు తప్పించుకొనియె? ఇంటి దొంగ నీశ్వరుఁడైనఁ బట్టజాలఁడుగదా. ఎంతద్రోహ మెంతద్రోహము! లోకము సందింకఁ దలిదండ్రు లెవ్వరును దమ కుమార్తెలఁజూచి మోసపోకుందురు గాక. అక్కటా, పయోముఖవిషకుంభమై కన్న తంద్రినగు నాగర్భమునఁ జిచ్చుపెట్టి పోయెఁగా! రఘుపతీ, యౌవనవతులగు కన్నియల వశపఱచుకొను మంత్రౌషధము లేమైనఁ గలవా యేమి? నాతనయ యారీతిగ మాయజేయఁ బడెనేమో? అట్టివాని గూర్చి నీవేమైన వినియున్నావా?

రఘు—ఔను. కొన్ని మంత్రములు గలవు.

ప్రచం—ఓహో! అటులైన రండి. రండి. అయ్యో, రఘుపతీ! నీకైన నీయకపోయితినే! అందఱును తలొక దారిని బొండు. ఇప్పుడు వారెక్కడ నుందురో నీవూహింపఁగలవా?

రఘు—నాకుఁగనుక యిరువురు మంచిభటులఁ దోడిచ్చిన నిప్పుడేపోయి వారిని గనిపెట్టి వచ్చెదను.

ప్రచం—అటులైన నీ వీ యిరువురతో ముందునడువుము. మే మిల్లిల్లు వెదకుచు వచ్చెదము. రక్షకభటుల మేలుకొల్పి యాయుధములఁ గొన్నిటి నడిగిపుచ్చుకొనవలయును. రఘుపతీ, ఇపుడు నావిషయమై కొంచెము శ్రమపడుము. నీకష్టము వృథాసేయను. పోవుదము పద.

(అందఱు నిష్క్రమింతురు) (తెర పడును.)

రెండవ రంగము - ఆంధ్రపురమున వేఱొకవీథి.

[ప్రవేశము: శ్యామలరాయఁడు, ఇరావంతుఁడు.]

ఇరా.—దురమున నెదురై తలపడిన వీరభటుల నెందఱనైనఁ జెండాడుదును గాని పొంచియుండి హత్యఁ జేయుటకు నామనసొప్పదు. నాయెత్తు ధనము పోసినను నేనట్టి పనిఁ జేయనొల్లను. ఆయుధముఁగొని ప్రచండసింహుని డొక్కలో నొక్కపోటుఁ బొడిచి కడతేర్ప వలయునని పలుమాఱు తలంచితినిగాని నా యంతరాత్మ యొప్పకయ్యె.

శ్యామ.—ఇప్పటికని మేలేయైనది.

ఇరా.—ఆ నీచుఁడు దూరమున నిలిచి మిమ్ముఁ బలురీతులఁ దూలనాఁడినాఁడు. చెప్ప నలవిగాని యా తూలుపలుకులు నా చెవులకు ములుకులై నాటెను. ఇప్పుడు కార్యము పూర్తియైనది గదా. ఇప్పుడైన నాతఁ డూరకుండఁడు. ఆతనికి రాజసభయందు మంచి పలుకుఁబడి గలదు. పట్టుఁబట్టినఁ బలుకు నెగ్గించుకొనఁగలఁడు. ఎటులేని న్యాయశాస్త్రము తలక్రిందు జేసి యీ వివాహము రద్దుపఱచి మీకు గొప్పశిక్ష వేయింపఁ జూచును.

శ్యామ.—చూడనిమ్ము. ఆతని శక్తికొలఁది ప్రయత్నింప నిమ్ము.

గీ॥ స్వార్థమెల్లను ద్యజియించి పరమభక్తి
నాంధ్రసామ్రాజ్యమునకు నే నాచరించి
నట్టి ఘనకార్యపటలి నేఁ డెవల నెట్టి
న్యాయ మరయక శిక్షాగ్రహించు నన్నుఁ
బలుకునంతటి యజ్ఞుఁడే పార్థివుండు?

అది యటుండ నేను నిర్వక్రపరాక్రమాన్వితు లగు ఘూర్జరరాడ్వరేణ్యుల వంశాంకురుండను. తూలనాడుటకు నీచకులజుఁడఁ గాను. మఱియు ధనధాన్యము లపేక్షించిగాని ఈ యాంధ్రసామ్రాజ్యమునఁ బ్రసిద్ధి పొందఁదలంచిగాని నే నీకుముద్వతిని వివాహమాడలేదు. నిక్కువముగ నామనంబా సుందరాంగి యందు లగ్నమగుటచేతనే స్వేచ్ఛావిస్ఫూర్తితో విరాజిల్లు నాస్వతంత్రజీవనమ్మును ద్రోసిరాజంటిని. నిర్బంధప్రాయమగు గార్హస్థ్యము స్వీకరించితిని. లేకున్న రత్నగర్భని రత్నరాసుల నెల్ల నా కొసంగినను స్వేచ్ఛాప్రియుండనగు నే నిట్టిబంధమున కొడంబడియుండను. మిత్రమా! ఆవచ్చు దీపకాంతు లేవో కనుంగొనుము.

ఇరా—క్రుద్ధుఁడగు నాయమతండ్రి పరిజనముతోఁ గూడ వచ్చుచున్నట్లున్నాఁడు. మీరు వడివడిగ నింటికి నడువుఁడు.

శ్యామ—ఏమీ? నే నింటికి నడచు టెందులకు? నే నిచ్చటనే నిలిచియుండెదను. వారిని రానిమ్ము.

క॥ నాదగు బలసంపత్తియు
నాదగు నీ జీవితంపు నైర్మల్యంబున్
నాదగు నున్నత పదవియుఁ
గాదని నాతో నెవండు కయ్యము సేయున్.

ఇరా—ఇ వేపియు వారికంటె కాగవు.

(ప్రవేశము : విక్రముఁడు కొంద ఱుద్యోగులతో)

శ్యామ—ఓహో ! మనవారలే నాదండనాథుఁడు విక్రముఁడు రాజకీయోద్యోగులతో సరుదెంచి యున్నవాఁడు. మిత్రులారా! మీకు శుభమగుఁగాక. విశేషము లేమి?

విక్ర—ఆర్యా! ప్రభువర్యులు మిమ్ముఁ గుశలమడిగి తత్క్షణమే తోడుకొని రమ్మని మా కానఁ బెట్టిరి!

శ్యామ—అట్టి యవసరమునకు హేతువేమై యుండునో?

విక్ర—సింహళమునుండి కబురువచ్చినది. ఆవేడిమీఁద జరుగవలసిన పనులుండనోపు. లంకాధిపతి కబురుమీఁదకబురు పంపెడిండు కబురు లంపినాఁడు. అందుచే నీయర్ధరాత్రమున నే సభ్యు లనేకు లరుదెంచి రాజసభ నలంకరించి యున్నారు. వెంటనే మిమ్ముఁ బిలువఁబంపిరి. మీ రింట లేనందున మీకొఱకు నలుదిక్కుల నలువురఁ బంచిరి.

శ్యామ—ఈశ్వరుని కటాక్షమున నిట మీకంటఁ బడితిని. ఇప్పుడే యింటికేగి యొక్కమాట చెప్పి వచ్చెదను.

[నిష్క్రమణము.]

విక్ర—ఇరావంతుఁడా! ఆతఁ డిచ్చట కేలవచ్చెను?

ఇరా—ఆతఁ డీనాఁ డొక మానవమృగమునకై వల వేసి నాఁడు. అది చేఁజిక్కిన వాని జన్మము సఫలమైనట్లే.

విక్ర—అదేమో నాకంతు బట్టలేదు.

ఇరా—నేఁ డాతఁడు పరిణయము చేసికొనియె.

విక్ర—ఎవరిని ?

[ప్రవేశము: శ్యామలుఁడు]

ఇరా—పరిణయము—(శ్యామలునితో) మహాశయా, ఇంకఁ బోవుదమా?

విక్ర—మీకొఱకు వెదకుచు మఱొక్క జట్టువచ్చుచున్నది.

ఇరా—శ్యామలరాయధిపా, దయచేసి నామాట వినుఁడు. ఆ వచ్చునది ప్రచండసింహుఁడు. ఆతఁడు కోపోద్రిక్తుఁడై దురుద్దేశముతో సరుదెంచుచున్నాఁడు

[ప్రవేశము: రఘుపతి, ప్రచండుఁడు, ఆయుధపాణులగు భటులు]

శ్యామ—ఎవ రక్కడ? అంతట నిలువుఁడు.

రఘు—అల్లదే, ఆయుఱచు వాఁడే ఘూర్కుఁడు.

ప్రచం—ఆఁ దొంగ, దొంగ, పట్టుఁడు. కట్టుఁడు.

ఇరా—ఓరీ రఘుపతీ, నీవా, రమ్ము. నిన్నొక వేటునఁ దెగ వేసెద.

[అందఱును గత్తులు దూయుదురు]

శ్యామ—మీ పదునుకత్తుల ఝుళిపింపకుఁడు. వానికి మంచు తగిలి తుప్పుపట్టును.

గీ॥ భయపడను నేను మీకత్తి పదనుగాంచి
మీపయోతిశయం బెంచి మీరు నాకు
మాననీయు లటంచు నా మదిని దలఁతు
నార్యవర! నా నమస్కార మందుకొనుమ.

ప్రచం—ఛీ! దుర్మార్గుఁడా, నాముద్దుపట్టి నెచ్చటదాచితివి? ఓరీ పాతకీ, నీవుదానిపై నెట్టి మైదుజల్లితివిరా? అసామాన్య సౌందర్యవతి నాముద్దు బిడ్డ, యెట్టివిలాస వంతులఁ గూడఁ గన్నెత్తిచూడని ముద్దరాలు, మా కుముద్వతి; ఎట్టి మాయ మంత్రములు లేకున్న నీయట్టి కురూపి నను సరించునా? గడప దాఁటియెఱుఁగని సుకుమారి యిల్లువాకిలి విడిచి వికారరూపివగు నీ వెంట వచ్చినదన్న లోకము నవ్వదా? రసగంధకాది సిద్ధౌషధములఁ బ్రయోగించి నీవు నాబిడ్డ కోమల యౌవనమును గఱకుదేల్చితివి. ఈ విషయము ప్రభువున కెఱిఁగించి వాదించెద. నీవు లోకకంటకుఁడ వనియు పిశాచానువర్తి వనియు నిరూపించి తగిన శిక్ష, వేయించెదను, పద. చూచెద రేమి? వీనిని బట్టుకొనుఁడు, తెక్కలు విరిచికట్టుఁడు.

శ్యామ—నామిత్రు లడ్డుపడ నక్కఱలేదు. ఆర్యా! మీరు నన్ను బంధించి విచారణ కెక్కడికిఁ గొంపోనఁదలఁచితిరి?

ప్రచం—ఎక్కడకా! చెరసాలకు; నేరము విచారణకు వచ్చు వరకుఁ జెరసాలలో నుండవలయును.

శ్యామ—ఇప్పుడే, అత్యవసరమగు రాచకార్యములకై ప్రభువర్యులు కబురంపినారు. పిలువ వచ్చిన భటు లిచటనే

యున్నారు. చూడుఁడు. నేను మీకిపుడు గట్టువడుటెట్లు?

భటు—ఔను ప్రభూ, ఔను. ప్రభువర్యులు కొలువుతీర్చి యున్నారు. వీరిని బిలుచుకొని రమ్మని మమ్మంపిరి.

ప్రచం—ఏమీ! ప్రభువర్యులు కొలువుఁదీర్చియున్నారా? ఈ యర్ధరాత్రిమందా? ఏమాశ్చర్యము! అటులైన నీతని నిప్పుడే తీసికొనిరండు. ఈ యభియోగముగూడ వ్యర్థవాదము కాదు. ప్రభువర్యులుగాని తదితర రాజసభ్యులు గాని యీమహాపరాధము తమదిగా భావింపకపోరు. ఇట్టి దుర్ణ్నతుల శిక్షింపకున్న నీతిదూరులే నీతివేత్తలయ్యెదరు.

[అందఱు నిష్క్రమింతురు.]

(యవనిక పడును.)



మూఁడవ రంగము: ఆంధ్రపురమున రాచనగరు.

[రాజసభ్యులుచితాసనములపైఁ బరివేష్టించియుండెఁ బ్రభువు సింహాసన మధివసించి యుండును. కొంద ఉద్యోగులు క్రిందిపైపుగఁ గూర్చుండి యుందురు. ఇరువురుభటులు చెరియొక ప్రక్క నిలిచియుందురు.]

ప్రభు—ఈ వార్తావళి మిగుల నసంబద్ధముగఁ దోఁచుచున్నది. ఒకదాని కొకటి వ్యాఘాతముగ నుంటచే నేది నిజమో తెలియకున్నది.

౧ వ సభ్యుఁడు—ఔను,ఇవి తలయుఁదోకయులేకుండ నున్నవి. ఒక జాబులో నూఱు పడవలని యున్నది. రెండవదానిలో నూటనలుబది పడవ లని యున్నది.

ప్రభువు—ఇపుడే వచ్చిన మూఁడవ జాబులో రెండువందల పడవ లున్నట్లు వ్రాయఁబడియె.

౨ వ సభ్యుఁడు— మన మొక్క సంగతి మఱచిపోవఁగూడదు. ఇంతేదియు సరిగ లెక్కించి వ్రాసినది గాదు. చూచి యూహించినసంఖ్య యగుటచే నింతటిభేదముండు టాశ్చ ర్యకరము గాదు. మొత్తముమీఁద నొక నౌకాదళము సింహళముపైఁ బడుచున్నదనుట స్పష్టము.

ప్రభు—ఔను. అంతనఱకు నొప్పుకొనక తప్పదు.

వార్తాహారి— (అవసరముగఁ బ్రవేశించి) ప్రభువుగా రెక్కడ? ఎక్కడ?

ఉద్యో—మఱియొక వార్తాహారి వచ్చియున్నాఁడు.

ప్రభు—ఓరీ, క్రొత్తవిశేషములేమి?

వార్తాహారి—మ్లేచ్ఛదళము పశ్చిమతీరము వంకకు వచ్చు చున్నదని తమతో మనవిచేయ నన్ను సైన్యాధిపతి పంపినాఁడు.

ప్రభు—ఈమార్పున కిప్పు డేమనవలెను?

౧ వ సభ్యుఁడు—గతమునుబట్టి యిది యథార్థమనుటకు వీలు గాదు.

౨ వ సభ్యుఁడు—ఇది మనలను మోసగించుటకుఁబన్నినమాయో పాయము. ఏలయన మనము యోజించిచూచినఁ బరాసు లకుఁ బశ్చిమతీరమందలి కేరళముకంటె సింహళము వేయి

మడుంగు లెక్కువ లాభదాయకము. అదిగాక పశ్చిమ తీరముఁ జేరుట దుస్సాధ్యము. అటుపైనిఁ బడమటి కనుమల దాఁటుట కష్టతరము. ఒకవేళ దాఁటినను కేరళము దుర్భేద్యములగు పర్వత దుర్గములతో నిండియున్నది.

ఇట్టితఱి సుసాధ్యమును లాభదాయకమును నగు సింహళము వీడి దుర్జేయమును నిరుపయోగమును నగు కేరళముపై కేగుటకుఁ బరాసులు మూఢులుకారు.

ప్రభు—ఔను, కేరళముపై నెత్తివచ్చెదరనుట యసంభవము.

ఉద్యో—ఇదే మఱియొకవార్త వచ్చెడిని.

వార్తాహారి—ప్రభువరా! మున్నూఱు పడవలుగల పరాసు నౌకాదళము పశ్చిమతీరమునకు వచ్చినట్లే వచ్చి హఠాత్తుగ సింహళమువైపునకు మరలుటఁ దాను స్వయముగఁ జూచితినని నాయకుఁడు మనవి చేయుమనియె.

ప్రభు—కాఁబట్టి సింహళముపైననే దాడియని స్పష్టపడినది. మన ప్రతినిధి యచట నున్నాఁడుగదా?

ఉద్యో—అతఁ డిప్పుడు రామేశ్వరము యాత్రార్థ మరుదెంచి యున్నవాఁడు.

ప్రభు—ఆతని నచటినుండి సూటిగా నిచటికి రావలసిన దని మాయాజ్ఞ. వెంటనే వ్రాసి పంపుము.

ఉద్యో—చిత్తము.

౧వ సభ్యుఁడు—ఇరుగో, ప్రచండసింహుఁడును, నిర్వక్రపరాక్రమశాలి యగు ఘూర్జరశిఖామణియు వచ్చుచున్నారు.

[ప్రవేశము: ప్రచండసింహుఁడు, శ్యామలరాయఁడు.]

ప్రభు—వీరాగ్రణీ! శ్యామలరాయా! మనకుఁ బ్రబల శత్రువులగు పరాసులపైకి యుద్ధమున కిప్పుడే నిన్నుఁ బంపఁ దలఁచితిమి. ఆర్యా! ప్రచండసింహా! స్వాగతము. ఈరాత్రి మీసలహా మాకుఁ గొంతవసరమైనది.

ప్రచం—నేనుగూడ మీసలహా పొందవలసి యున్నది. ఈ నాఁడు రాజకార్యములేవియు నన్ను మేలుకొలుపలేదు. గర్భనిర్భేదమగు నాస్వంతవిషయమొండు నన్నుఁ గలంచి వేయుచుంటచే నింకేయితరవిషయములును నా తల దూరుటలేదు. నాదే నాకు తలమునిఁగితాడి ప్రమాణమైనది.

ప్రభు—ఆదేమి? అట్లనుచున్నావు?

ప్రచండ—అక్కటా! నాముద్దులపట్టి. నా బంగారుకొండ.

ప్రభు—ఏమి గతించెనా?

ప్రచం—ఆ, నాకు గతించినట్లే. నాయింటినుండి దుర్మార్గముగఁ గొంపోవఁబడి బలాత్కారముగ నమానుషకార్యములకుఁ బాల్పఱచఁబడియె.

ప్రభు—అట్లొనర్చిన యా తుచ్ఛుఁడెవఁడు? నీచమార్గముచే నీకును నీకుమారికిని గాకుండఁజేసిన యాద్రోహి

యెవ్వఁడు? అట్టివాఁడు యువరాజై ననుసరే వానికిఁ దగిన శిక్ష యేదియో శిక్షాస్మృతి నీవే చూచి చెప్పుదువుగాక.

ప్రచండ—అట్లయిన నిదే నమస్కరించుచున్నాను. మీ వాక్యము ననుసరించి మీదండన కర్హుఁడగు ద్రోహి యిడుగో మీయెదుటనే యున్నాఁడు.

ప్రభు—ఇది యెంతయు సంతాపకరము.—శ్యామలా! నీ వందు కేమందువు?

ప్రచండ—అంతయు వాస్తవ మనియే చెప్పితీరఁగలఁడు.

శ్యామ—న్యాయవిశారదుఁడ వగు రాజోత్తమా, నామనవి నాలకింపుము. నే నీవృద్ధునిపుత్రికను గ్రహించినమాట తథ్యము. ఆమెను వివాహమాడిన మాటయు నిశ్చయమే. నేనొనరించిన ద్రోహమెల్ల నిదియే. మఱేమియు నెఱుంగను. యుద్ధరంగములందలి బాహుబలప్రదర్శనముచే నాకరములు కాయలుగాసియున్నవేగాని, తళుకు బెళుకు మాటల చాకచక్యము నాకెంతమాత్రముఁ జేతగాదు. ఈ ప్రపంచమున యుద్ధముతక్క నేను వేఱొండెఱుంగను. ఈ యేఁడెనిమిది మాసములనుండియు యుద్ధము లభింపమిచే నాచేతులు తీటఁబట్టియున్నవి. నామన మాతురపడుచున్నది. కాఁబట్టి నేనిపుడేమియుఁ బ్రతివాదము చేయఁబూనుకొనలేదు; యథార్థము వచించెద వినుండు. నాయందారోపింపఁబడిన పరికరములు, మందులు, మంత్రములు, ఇత్యాదులు, నేనేమియు నెఱుంగను. ఇవేవియులేకయే నా

యదృష్టవశమున నే నామె హృదయ మాకర్షింపఁగలిగితిని.

ప్రచం — ఆ! ఏమియు నెఱుఁగఁడా?

మంజరి.

వినరయ్య యీవార్త వింతఁబుట్టించు। ముద్దులపట్టి నాముదిపెంపుమూట
సౌందర్యసరసి నాసౌభాగ్యరాశి। యువిదలమిన్న నాయొప్పులకుప్ప
అంతఃపురమువీడి యరుగనిపాప। పల్లెత్తిమాటాడ భయమందుబాల
గట్టిగాఁబిలిచినఁగన్నీరుగార్చు। కుసుమపేశలగాత్రి కోమలహృదయ
అట్టి నాపుత్త్రిక యక్కటా! నేఁడు। కూలికిపోరాడు గుణశూన్యుఁడైన
ఘోరరూపమువాని కులహీను నొకని। నిల్లువాకిలిలేక యల్లాడువాని
కఠినాత్ముమూర్ఖునిఁ గామించెనంట। వింటిరే యీవార్త వింతగా లేదె
ఆడుబిడ్డలగన్న అయ్యలందఱును। అరయుఁడీ యాత్మీయ మని దీనిఁదలఁచి
రాజహంసాంగన రమణీయసుగుణ। కాకోలమును దానె కామించునెట్లు?
ఈవార్త నిజమౌనె యిదినమ్మఁదగునె? ముమ్మాటికిదిమీరు నమ్మఁగావలదు.
మందుల మాకుల మాయమంత్రములఁ। గనుకట్టు వాకట్టు గాలివిద్యలను
శక్తివంచనలేక సాధించి వీఁడు। వానితో నాముద్దుపట్టిమానసము
మాయలోఁబడవేసి మరులను గొల్పి। తనవెంటఁ గొనిపోయెఁ దగుదునటంచు
నాడుబిడ్డలఁగన్న అయ్యలు మీరు। లాత్మీయముగ దీని నాలించవలయు
నాలించి యపరాధి నర్హమౌరీతిఁ। గఠినంపు శిక్షలఁ గడతేర్పవలయు.

ప్రభు — ప్రచండసింహా, ఊరక నీమాటనమ్మి యిట్టి విషయమున నిదమిత్థమని నిర్ధారణ సేయుట కనువుగాదు. ఇందుల కేమైన నిదర్శనము లుండవలెను.

౨వ సభ్యుఁడు — శ్యామలా, నీవు పరమేశ్వరునిపై నానఁబెట్టి నిక్కము వచింపుము. నీ వేమైన బలవంతపెట్టిగాని భయ

పెట్టిగాని, ఆశబెట్టిగాని, యామెను వశపఱచుకొంటివా? లేక పలుమారు ప్రసంగించుటచేఁ గ్రమక్రమముగ నామె హృదయ మాకర్షింపఁ గలిగితివా?

శ్యామ—మహాశయులారా! ఇంక నిట్టి ప్రశ్నలేల? నా యందు దయయుంచి యామె నిటకుఁ బిలిపించి నిక్కువ మారయుఁడు. ఆమెతండ్రిగారు వినుచుండ నామెనోటి మీఁదుగనే యీకథ చెప్పనిండు. ఆమెపలుకులవలన నేను దోషి నని తేటపడినయెడల నన్నుఁ బదభ్రష్టుఁ గావించుటయేగాక మీ నిశితకరవాలముల నాశిరస్సు ఛేదించి పాపము నాహరింపుఁడు.

ప్రభు—అటులైన కుముద్వతి నిప్పుడే పిలిపింపుఁడు.

శ్యామ—ఇరావంతుఁడా, ఆచోటు నీ వెఱుంగుదువుగదా. తత్క్షణమేపోయి యామె నిటకుఁ గొనిరమ్ము.

[ఇరావంతుఁడు నిష్క్రమించును.]

ఈ లోపల నే నేదోష మొనర్చి యామె హృదయముఁ జూరగొంటినో దైవసాక్షిగ నిక్కము వచించెదను.

ప్రభు—ఏదీ! ఆకథ చెప్పుము.

శ్యామ—కుముద్వతితండ్రి యగు నీప్రచండసింహునకింత దనుక నాయం దెక్కుడు మక్కువ యుండెడిది అది కతంబుగ నన్నుఁ బలుమాఱు తమయింటికిఁ గొంపోయి నాపూర్వచరిత్రనుగూర్చి గుచ్చిగుచ్చి యడుగుచుండు వాఁడు. నేనును నాచిన్నతనమునుండి పడినకష్టములు

చేసిన యుద్ధములు సాధించిన దుర్గములు జయించిన పట్టణంబులు ఆర్జించిన ధనరాసులు మున్నగు వానినిగూర్చి విపులముగఁ దెలుపుచుండు వాఁడను. ఒక్కొక్క రణరంగమున నిల్చి పోరాడునపుడు గాయములగుటయు, మూర్ఛిల్లుటయు, మరల బ్రదుకుటయు యుద్ధములందు జయించుటయు, నొకప్పుడోటువడి బానిసగ విక్రయింపఁబడుటయు, మరల స్వాతంత్ర్యము సంపాదించుటయు, మున్నగు చిత్రవిచిత్రంపుచరిత్రలనెల్లఁ గథారూపమునఁ బూసఁగుచ్చినట్లు వినుపించుచు వచ్చితిని. నేను చెప్పునపుడెల్ల కుముద్వతి యాతురతతో దగ్గఱనే కూర్చుండి వినుచుండెడిది. అపుడింట నేదేని పనిగలిగిన వెంటనేపోయి యదాని ముగించి తిరిగివచ్చెడిది. తుదకొకనాఁడామెకోరికపై నా కథ ప్రత్యేకముగ నామెకు వినుపింప మొదలుపెట్టితిని. నేను ఘూర్జరరాజవంశమున జననమంది చిన్ననాఁడే యుద్ధకాంక్షనై యిల్లువిడి

చ॥ తిరిగిన దేశముల్ గనిన తీర్థములుꣳ ఘనశైల పంక్తులుꣳ
పరిసర దుర్గమాటవులు వన్యమృగంబులుఁ గ్రూరరాక్షసుల్
గురుతర సైన్యసంతతులు ఘోరరణంబు లభేద్యదుర్గముల్
వరుస ననేకరీతులఁగ వర్ణనసేయుచు ముచ్చటించితిꣳ.

ఆమె యతికుతూహలముతో నాకథ నాలకింపుచు నాకు గాయములు తగిలెనని పలికినపుడు కంటఁదడివెట్టగా నే నది గతవృత్తాంత మని యోదార్చితిని. సంపూర్ణముగ నా కథ విన్నపిదపఁ జాల చిత్రమగు చారిత్రమని తన సంభ్ర

మాశ్చర్యములఁ బ్రకటించెను. నాపడిన కష్టములకు మిక్కిలి జాలిపడెను. ఒకప్పుడు తా నిట్టి పురుషుఁడుగా జన్మింప నిచ్ఛగింతునని పలికెను. ఇంకొకనాఁడు తనకిట్టి కథలు వర్ణించి చెప్పఁగల సమర్థుఁ డెవ్వరైన నామిత్రులలో నున్న వానితోఁ దనను బరిణయ మాడఁ బుద్దిపొడముచుండె ననియు సంకేతపఱచె. ఆభావము నే గ్రహించితిని. నాపడిన కష్టములకు నన్నామె ప్రేమించెను. ఆమె నాయెడఁజూపిన జాలికై నే నామెను బ్రేమించితిని. ఈ విధముగ నన్యోన్య ప్రేమము వికాసముఁ గాంచినది. ఇంతకుఁదప్ప వేఱే మందుమాకులు నే నేమియు నెఱుంగను. ఇదే కుముద్వతి వచ్చుచున్నది. అడిగిచూడుఁడు.

[ప్రవేశము : కుముద్వతి, ఇరావంతుఁడు.]

ప్రభు—ఇట్టికథలు నాతనయనైన వశపఱచుకొనఁ గలవని తలంచెద. సాధుశీలా! ప్రచండసింహా! ఇంచుక శాంతచిత్తుఁడవై యీ విషయమును గూర్చి యోజింపుము. పట్టిచేతులకంటె వెండిక తియెసను మెఱుగేగదా!

ప్రచం—అయ్యో! న్యాయమూర్తీ! ఇంతలోఁ ద్వరపడ నేల? ఆమెను మాటాడనీయుఁడు. ఆమె తానే స్వయముగ నాతనిఁ బ్రేమించితి నని పలికిన నావలన నాతనికిఁ బాటిల్లిన యపకీర్తి నాతలపై వేసికొనియెద — నాముద్దుపట్టీ! కుముద్వతీ! యిటురా! పూజ్యులగు సభ్యులతో నిండియున్న యీసభయందఱిలో నీకత్యంతాప్తు లెవ్వరో పలుకుము.

కుము—

చ॥ కులసతి కెప్పుడున్ బతినిఁ గొల్చుటె ధర్మువుగాదె తండ్రి! నేఁ
బలికెద నాలకింపుము సభాముఖమందున శౌర్యసాహసో
జ్జ్వలమహనీయమూర్తి గుణసాంద్రుఁడు శ్యామలరాయచంద్రుఁడే
వెలసెడు నామానసికపీఠమునన్ బరమాప్తవర్యుఁడై.

(కోపోద్విగ్నుఁడైన తండ్రివంకఁ జూచి దుఃఖాకులితయై)

గీ॥ కలతఁజెందకు ననుఁగాంచి కన్నవాఁడ
కోపగింపకు నాపైని కూర్మితండ్రి
అలుగవలదయ్య నాపల్కు లాలకించి
కులసతీధర్మ మెంచి నే పలికియుంటి.

గీ॥ మున్ను నాతల్లి తనదగు పుట్టినిల్లు
వదలి మిమ్ములఁ జేరఁగా వచ్చినటులె
యేను నావిభుఁ జేరఁ బోయెదను తండ్రి!
ఆదరముతోడ నీవు నన్ననుపుమయ్య,

ప్రచం—(గద్గదకంఠుఁడై) శ్యామలరాయా, ఇటురమ్ము. ఇంతకు ముందు హృదయపూర్వకముగ నిన్ను నిరాకరించిన నేనే యిప్పుడీమెను నీకొసంగుచున్నాను. స్వీకరింపుము. ఓ బంగారుబొమ్మా, నా కింక వేఱే బిడ్డలు లేనందుల కిపుడు సంతసించుచున్నాను. ఏలయన నీకథను జూచినమీఁదట నేను వారియెడఁ గఠినచిత్తుఁడఁ గావలసివచ్చెడిది. ప్రభువరా, ఇంక నాపనియైనది; నేఁ బోయెద సెలవొసంగుఁడు.

ప్రభు—మిత్రమా, నే నొకమాటచెప్పెద నాలకింపుము. కష్టపరంపరలందు మనము చేయున దేమియు లేదని తెలిసి

నపుడు వానివలని దుఃఖము క్రమక్రమముగ నంతరించును. గతించిన కష్టములకు విలపించుట క్రొత్తవానిని గోరుకొనుట యగును. గ్రహచారమువలన సంభవించిన కష్టముల నోర్పుతో సహించిన నవియే పరిహాసితము లగును.

గీ॥ చోరుఁ డిల్లు సొచ్చి సొమ్ము నెత్తుకపోవ
మందహాసలీలఁ జెందు నరుఁడు
చోరహృదయజనిత సుఖరాశి నంతటి
నపహరించి తాను హర్ష మొందు.

అటుగాక

గీ॥ చోరుఁ డింటఁ జేరఁ జూచి భయమునంది
దుఃఖవివశుఁ డగుచుఁ దూలునరుఁడు
చోరుఁ డపహరించుసొత్తులతోఁ బాటు
చిత్తశాంతిఁ గూడఁ జేటువడును.

ప్రచం—అట్లైనఁ బరాసులు సింహాళము వశపఱచుకొనుచుండ మనము చూచి చిఱునగవు నవ్వుచు నూరకుండవలయుఁ గదా. తాను బాధపడుచుండియు వేఱొకరు లేదని చెప్పిన నూరకుండవలసినదేనా ? పోనిండు. మీరు చెప్పినది యథార్థమే యయినను నిట్టి దుఃఖమును సహించుటకుఁ దాలిమి నెటనుండి కొనితెత్తును. మీపలుకులు అమృతమో విషమో నాకుఁ దెలియుటలేదు. కాని మొత్తము మీఁద మిగుల గాటముగ నున్నవి. మాటలతో నింకేమి పని ? హృదయము బ్రద్దలగుటకుఁ దోడుగ శరీరముకూడ వ్రయ్యలై పోవును. ఇంక మీరు మీ రాజకార్యములకుఁ గడంగుఁడు.

ప్రభు—శ్యామలరాయుం! పరాసు లఖండప్రయత్నముతో సింహళప్రాంతముఁ జేరుచున్నారు. సింహళద్వీపము బలిష్ఠమగు దుర్గములతో నిండియున్నది. చాలినంత సైన్యముకూడ నటఁ గాపున్నది. కాని సమర్థుఁడగు పాలకుఁడు గావలసియున్నాఁడు. అందుచేత మాప్రతినిధిగా నీ వట కేగుట శ్రేయస్కరము. నీ విమ్మహాకార్యమునందు నీ శౌర్యసాహసమ్ములఁ బ్రకటించి నీ యదృష్టమున కనువగు సత్కీర్తి నార్జించుకొనుము.

శ్యామ—మహాప్రభూ, నే నాయుధము చేతఁబట్టినదాదిగ యుద్ధమనిన వెనుదీయుటలేదు. ఎల్లప్పుడు డాలు తలగడగ నిడుకొని రణభూములే శయనగృహములుగ నిద్రించియుంటిని. జన్మతః కఠినమగు నాశరీరము మఱింత కఱకు బారినది. నే నీయుద్ధమునకిదే కంకణము గట్టుచున్నాను కాని నాదొక చిన్నిమనవి.

ప్రభువు—అదేమని ?

శ్యామ—మహాశయా! నవోఢయగు నాసతీమణి కుముద్వతికిట ననుకూలమగు సదుపాయముల గలిపింపుమని.

ప్రభువు—నీకిష్టమైన నామెతండ్రియొద్దనే డించిపొమ్ము.

ప్రచం—అందుకు నే నెంతమాత్ర మంగీకరింపను.

శ్యామ— నాకు మొదలే యిష్టములేదు.

కుము—అందుకు నేనుకూడ నంగీకరింపఁజాలను. మాతండ్రి గారి కండ్లయెదుట నుండిన నాతనికి నిరంతర మనోవ్యధకుఁ గారణ మగుదును. కావున నామనవిఁ జిత్తగింపుఁడు.

ప్రభు—చెప్పుము.

కుము—మహాప్రభూ, నేనీ షూరకశిఖామణియొక్క సాహస విక్రమంబు లెఱింగి, వీరరసోత్పన్నమై విజయలక్ష్మీవిల సితంబగునీతని దివ్యతేజోరూపమును నాహృదయఫలక మున స్థాపనజేసికొంటిని. అట్టి విజయమూర్తిపాదముల కడనే నాసర్వస్వ మర్పించి ప్రేమ మను పెన్నిధానమును బ్రీతిఫలంబుగఁ బడసితిని. ఇప్పు డట్టిప్రేమము నీటఁగలిపి దుస్సహవియోగదుఃఖానలమ్మున వేల్చి యూఱఁ డొం టిగ ద్వీపాంతర మేగుట నే నోర్వఁజాలను. నేనుగూడ నాతని వెనువెంట నేగెద. నాపతి ననుసరించుట కేకదా నే నిట్టి రచ్చకుఁబాలుపడి నామనోరథ మీడేర్చుకొన్నది.

గేయము॥ మనవి విను ప్రభూ నా-మనవి విను ప్రభూ
ఆత్మనాయకుని ననువర్తింపఁగ - ననుమతింపుమా- ఆదరింపుమా!
తుములరణమ్మల నుముకుటలైనన్,
దుర్గమకానల దూఱుటలైనన్,
తుంగభంగముల దోగుటలైనన్
ఉగ్రిదవాగ్నిని నురుకుటలైనన్,
ఆత్మనాయకుని ననుసరించెదన్
అనుమతింపుమా ఆదరింపుమా॥ మనవి విను ప్రభూ.

శ్యామ—ప్రభువరా, ఆమె కనుజ్ఞయొసంగుఁడు. ఒకవేళ నే నల సటచేత యుద్ధభూమినుండి విముఖుఁడ నైనను, నాసతీమణి ముఖముఁ జూచిన ద్విగుణితోత్సాహుఁడనై వీరవిహారంబు సేయనోపుదు. కావున మీయాజ్ఞానువర్తినై కార్యభారము వహించు నా కీయమపాత్రిపు ఫలప్రదమేగాని ప్రతి బంధకము కానేరదు. మీ రనుజ్ఞ యొసంగి నాకుఁగూడఁ బరమానంద మొసగూర్పుఁడు.

ప్రభు—మీ యిరువురి ప్రేమానుబంధము వీరరసోత్పాద కమని నే గ్రహించితిని. నా కిఁక నెట్టి యభ్యంతరము ను లేదు. నీవుమాత్రము తత్క్షణమే బయలుదేరవలయును.

౧వ సభ్యుఁడు—ఈ రాత్రియే పోవలయును.

శ్యామ—నే నిపుడే బయలుదేరుచున్నాను.

ప్రభు—రేపు రాజసభ తిరిగి సమావేశమగును. శ్యామలా, నీ పరివారమున నొక్క నమ్మఁదగినబంటు నిఁట నుంచి పొమ్ము. నీ కెఱిఁగింపవలసిన రహస్యముగు ముఖ్యవార్త లేమైన నున్న రేపు వానితోఁ జెప్పిపంపెదము.

శ్యామ—అటులైన నాయంగరక్షకుఁ డీరావంతుఁ డిందుల కెంత యుఁ దగినవాఁడు. నాసతినిగూడ నాతఁడే తనవెంటఁ గొని వచ్చును. మీరు చెప్పఁదలచినదెల్లఁనాతనికిఁ జెప్పిపంపుడు.

ప్రభువు—అట్లేకానిమ్ము. ఇఁక సభచాలింతము. అందఱు సె లవు గైకొనవచ్చును. — ప్రచండసింహా, సౌశీల్యము

శరీరమునకు శోభ గలిగించు నని నీ వంగీకరింతు వేని నీ యల్లుఁడు స్ఫురద్రూపియే యనఁజెల్లును.

[ప్రభువు నిష్క్రమించును]

ఇరువురు సభ్యులు—శ్యామలా, సెలవొందుము. కుముద్వతి యెడ జాగరూకుఁడ వై మెలంగుము. ఆమెహృదయమును నొప్పింపక కనిపెట్టి వర్తింపుము.

(సభ్యులు, ఉద్యోగులు నిష్క్రమింతురు.)

ప్రచం—(వెడలిపోవుచు శ్యామలుని వైపు మొగంబై)

మత్త॥ కన్నతండ్రిని మోసగించిన కామినీమణి సెప్పుదున్
కన్నుమూయక కాముకోన్మద గర్వమొందక మూర్ఖుఁడా!

శ్యా—

నన్ను గూర్చి విచార మందకు నాదు ప్రాణమె పందె మీ
సన్నుతాంగి యచంచలం బగు సాధువృత్తికిఁ బూజ్యుఁడా

శ్యామ—ఇరావంతుఁడా, నాబహిఃప్రాణమగు నీయమను నీవశమున నుంచిపోయెద. నీసతి నీమెకుఁ దోడు సేయుము. సమయము చూచి సాధ్యమైనంత త్వరలో నీవు వారి నిరువురఁ దీసికొనిరమ్ము. కుముద్వతీ! యిటు రమ్ము నీతో మాటలాడుటకు నాకిప్పు డొకగంటమాత్రమే వ్యవధిగలదు.

(నిష్క్రమణము శ్యామలుఁడు కుముద్వతి తోడనే యిరావంతుఁడు.)

(యవనిక జారును.)

---

నాలుగవ రంగము:—ఆంధ్రపురమున రఘుపతి గృహము.

(ప్రవేశము : ఇరావంతుఁడు, రఘుపతి.)

రఘు—ఇరావంతుఁడా!

ఇరా—చెలికాడా, ఏమందువు ?

రఘు—నే నేమి చేసెద ననుకొంటివి ?

ఇరా—ఏమున్నది చేయుటకు ? పండుకొని నిద్రపొమ్ము.

రఘు—కాదు. నే నిప్పుడే పోయి బావిలో దూకెదను.

ఇరా—నీ వట్లు చేసితివేని ని న్నెంత మాత్రము ప్రేమింపఁ జాలను నేను. ఎందుకు నీ కట్టి మౌఢ్యము ?

రఘు—బ్రదుకుట బాధాకర మని తెలిసినపుడు బ్రదుక నెంచుటయే మౌఢ్యము. ఏలయన నీబాధకు మృత్యువే చికిత్సకుఁడు.

ఇరా—ఏమి నీయవివేకము ? నేను ముప్పది వత్సరములనుండి యీలోకమందలి మేలుగీళ్ళను బరిశీలించుచున్నాను. కాని తన్నుఁదాను ప్రేమించుకొనలేని యవివేకి నెందును గని విని యెఱుంగను. ముందు బుద్ధిలేనిగాడిదవై జన్మించి యట్టుపైన నీమాటఁ జెప్పిన సమంజసముగా నుండును.

రఘు—నేను జీవించియున్నందునఁ బ్రయోజన మేమి ? లజ్జాకరమ్మగు మోహాప్రవాహమునఁ గొట్టుకొని పోవుచున్నాను. ఇది భ్రాంతి యని యెఱింగియున్నను దీనికిఁ బరిహారము సేయుట నాచేతఁగాదు.

ఇరా—ఛీ! చేతఁగాదా? మన కొకపని చేతఁగా దనుకొను టకు మనమే కారణము.

గీ॥ మానవశరీర మనెడి యుద్యానమునకు
మానసమె మాలి యై స్వేచ్ఛ మసలుచుండి
యలఘు పరిమళసుమరాజి నిలుపు నందు
స్వాదుఫలతరుజాతుల సంతరించు.

కాని వాఁడే యొకప్పుడు, అనఁగా నీవలె పిచ్చిపట్టినపుడు.

గీ॥ తుమ్మిగింజల వెదజల్లుఁ దోఁటనిండ
బీడుగాఁజేసి యొకతతిఁ బాడుపెట్టు

మఱియొకప్పుడు.

మొక్క జొన్నలఁ బండించి మెక్కుచుండు
కాసచో నోషధులఁ బెంచి కాపుఁగాయు.

ఇదియంతయు మనచేతిలోనిపని. కామోద్రేకము నడం పఁగల వాదపటిమ లేదని మనము తుచ్ఛులమై యధో గతికిఁ బోవుదుము. కావున వివేచనాశక్తి వలన నిట్టి వెఱ్ఱి తలంపుల నడంచివేసి నిస్పృహత్వమున కెడమీయకుండఁ గాపాడుకొనవలయును. లేకున్న నీ కీవలపు జన్మముతో వచ్చినదా? పోకుండ పాదుకొనుటకు?

రఘు—కాదు కాదు.

ఇరా—

గీ॥ వలపు వలపనునది యొక్క పాడు భ్రాంతి
ఉడుకు నెత్తుటిచే నిట్టి వుద్భవిలు

శాంతమున నివి యెల్లను జక్కపడును
ఒడలు విదిలించి లెమ్మి; శూరుఁడవు గమ్మి.

బావిలో పడుదువా? గ్రుడ్డికుక్కలను బావిలోఁ బడఁద్రోయుము. లెమ్మి. నేను నీతో సఖ్యము చేసితిని. నేను నిన్ను విడనాడ నని యిదే ప్రమాణము సేయుచున్నాను. నిన్నుఁజూడ నాకు మిగుల జాలియగుచున్నది. డబ్బు సిద్ధముచేసియుంచుము. ఈయుద్ధవార్తలఁ దఱచుగాఁ బరిశీలింపు చుండును. గడ్డముల మీసములఁ గట్టుకొని మారువేషము వేసికొనుము. ముందుగ డబ్బు సిద్ధము చేసికొనుము. ఈకుముద్వతి యాఘూర్కు నెక్కువకాలము ప్రేమింపఁజాలదు. డబ్బుమాట ముందు చూచుకొనుము. ఆతఁడుగూడ నామెపై నెక్కువ కాలము కూరిమి నిలుపఁ జాలఁడు. డబ్బు చేర్చియుంచుము.

ఆమెయందీ ప్రేమము మంట మండినట్టు లొక్కసారిగఁ బైకెగసినది. అదేరీతి నొక్కసారిగఁ జల్లారఁగలదు. కానముందుగ డబ్బు సిద్ధపఱచుము. ఈ ఘూర్కుఁడు మిగులఁజపలచిత్తుఁడు. అన్నిఁటికిని డబ్బుముఖ్యము. ముందాసంగతిఁ జూడుము. ఆతని కిపుడు కలిగంజియే పాయసాన్నముగ నున్నను కొలఁది దినములలో నాతనికిఁ బాయసాన్నముకూడ విషాన్నము కాఁగలదు. అచిరకాలము ననే యామె తనపొరపాటెఱింగి యా ముదునలిపైఁ గినిసి యొక యౌవనవంతు నపేక్షింపఁగలదు. ఇట్టి మార్పు సత్వరముగనే చేకూఱఁగలదని నానమ్మకము. కాన

ముందుగ డబ్బు సేకరించి యుంచుము. నీవు దేహత్యాగము చేయఁదలఁచిన బావిలో పడిగాదు; వేఱొక్క సుల భోపాయముఁ జూడవలయును. సాధ్యమైనంతడబ్బు ముందుగఁ జేర్చియుంచుము. చపలచిత్తుఁడగు నామొఱకునికిని సూక్ష్మబుద్ధియగు నాసుకుమారికిని గల వివాహబంధము త్వరలోనే భగ్నము గావింపఁగలను. నా తెలివితేటలప్పుడు నీకు బోధపడఁగలవు. అటుపైన నామె నీకు లభింపఁగలదు. కాఁబట్టి డబ్బుమాట మఱచిపోకుము. నీటఁబడి చచ్చుటయా! ఆమాటలఁగట్టి పెట్టుము. ఊరక నీటఁబడి చచ్చుటకంటె నీకోరికఁదీర్చుకొను ప్రయత్నములో నుఱిదీయఁబడినను మేలేగదా!

రఘు:—నేను నీమాటపై నాసఁబెట్టుకొని యుండెదను. నీవు నాయభిమత మీడేర్పఁగలవా?

ఇరా:—ఆ యనుమాన మెంతమాత్రమును బెట్టుకొనకుము. నీవుపోయి డబ్బు సిద్ధపఱచుము. నే నిదివఱకే పలుమాఱు చెప్పితినిగదా? మరల చెప్పుచున్నాను వినుము. అఘోరుఁనిపై నాకుఁ గినుక మెండు. నాయెడ వాఁడొనర్చిన యపరాధము నా మనమందు బాగుగ నాటుకొనియున్నది. నీప్రయత్నముకూడ నట్టిదే. కాఁబట్టి మన మిరువురముఁ జేరి వానిపైఁ గసిదీర్చుకొనవలయును. ఇంకనొక్కొక్కటిగ నన్నిసంగతులు బయటపడకమానవు. వెఱవకపొమ్ము! డబ్బు భద్రపఱచుకొనుము. ఇంక నీవిషయమై రేపు మాటాడుదము.

రఘు:—మరల తే పెచ్చుట గలియుదము.

ఇరా:—నా యింటియొద్ద

రఘు:— తే హృదయమే మీయింటియొద్దకు వచ్చెడనులే.

ఇరా:—సరే, పో! చివరకు విన్నావుగదా?

రఘు:—ఏమంటివి ?

ఇరా.—ఇంక నీవు బావిలోఁబడెడి సంగతి యెత్తవుగదా.

రఘు:—ఇప్పుడు నామనస్సు మారిపోయునది నేనిదే పోయి నాభూములెల్ల విక్రయించెదను.

ఇరా:—సరే! పోయి డబ్బు మఱింతగాఁ జేర్చిపెట్టుము.

(రఘుపతి నిష్క్రమించును.)

ఇరా:—ఆహా! ఈవిధముగ నీవెట్టివెంకటాయను నా డబ్బు సంచిగాఁ జేసికొంటిని. నాకుఁ గార్యావసర ముండఁబట్టి గాని లేకున్న నీ పిచ్చుకతో నే నింతసేపు మాటాడుదునా? ఆఘూర్ణునిపై రెత్తిన నాం కసహ్యాము. నిజమో, అబద్ధమో నాకుఁ దెలియదు, కాని నాకు మాత్ర మించుకం తనుమానమున్నది. అదే చాలును. అయితే వానికి నాయందు మంచి నమ్మకము గలదు. అందుచేతనే నామంత్రము మఱింత బాగుగాఁ బాఱఁగలదు. విక్రముఁ డిందుల కెంతయుఁ దగినవాఁడు. వానిపదవి ముందు నేను సంపాదించి, తరువాతఁ జాకచక్యముతో నాపని నెఱవేర్చుకొనియెదను.—ఆ, ఏమది! ముందదెట్లు సంపాదింపనగును?

(ఆలోచన నభినయించుచు) కొన్నిదినములు గడచిన మీఁదట విక్రముఁడు కుముద్వతితోఁ బలుమా ఱేకాంతమున మాటాడుచున్నాఁడని శ్యామలుని చెవిని వేసెదను. ఆ విక్రిముని మృదుమధురభాషణములు సుందరరూపము స్త్రీజనవశీకరణములుగ నుండుటచే నీపలుకు విశ్వాసార్హమై యాతని హృదయమున నాటుకొనఁగలదు. ఈ ఘూర్ఖుఁడు కపట మెఱుంగఁ జాలఁడు. పైకగు పడువా రెల్ల సజ్జనులే యని భావించును. కావునఁ గ్రమక్రమముగ వానియం దీయనుమానమును బెంపొందించుచు మెడకు గొలుసును దగిలించి కుక్కను వెంటఁగొనిపోవుచందమున నాతని వశపఱచుకొని నాయిచ్ఛవచ్చినచొప్పున నడిపించెద. మంచి యుపాయమే తోఁచినది. కాని కష్టసాధ్యమగు నీయుపాయము నెఱవేఱవలయుఁగదా. ఇందుకు నిశాధిదేవతయు మృత్యుదేవతయుఁగూడ నాకుఁ దోడగుదురు గాక.

(తెరపడును)

---



# ముగ్ధప్రణయము.

## ద్వితీయాంకము.

మొదటిరంగము - సింహళమున సముద్రతీరము.

(ప్రవేశము: దుర్గాధిపతియగు మలిదేవరాయలు, నొక పౌరుఁడు)

మలి:—గోపుర మెక్కి చూచితివిగదా, ఏమియుఁ గాన వచ్చుట లేదా?

పౌరు—ఏమియులేదు. దేవా, సముద్రమూరకఁ బొంగిపోవుచున్నది. కాని నాకెక్కడ నొక్క తెరచాపయైనఁ గానుపింపలేదు.

మలి—ఈ తీరమందెల్ల వాయు వతిప్రచండముగాఁ గొట్టుచున్నది. మేడలు స్తంభములతోఁగూడ కదలి పోవుచున్నవి మహావృక్షములు వ్రేళ్లతోసహా యూఁగి పోవుచున్నవి. ఇట్టి మహావాయువు సముద్రముపైఁగూడ వీచుచుండెనేని కొండలు, గుండ్లు పిండియై పడిపోవలసినదే. "ఇనుపగుది

యలుకొట్టుకొనిపోవ దూదిపింజలు మాగతియే" మన్నట్లు, ఇట్టితఱిఁ బడవలు బ్రద్దలై పోకుండునా? అదిగో వార్తాహారి వచ్చుచున్నాఁడు. ఏమివార్త తెచ్చునో!

పౌరు—ఇంకేమున్నది? పరాసుదళ మెల్ల ఛిన్నభిన్నమై యుండక తప్పదు. అల్లదె సుడుగులు గ్రిక్కుచున్న యీ పశ్చిమతీరముంబరికింపుఁడు. తమశాంతికి భంగము గలిగించె నన్న కోపమున నూర్మిమాలికలు మేఘములపైకిఁ దుషారబాణముల రువ్వుచున్నవి. తెల్లని జూలిరువంకల వ్రేల నెగిరెగిరి దూఁకు ధవళతురంగమ్ముభంగిఁ దరంగమ్ములు నిప్పుకణికలవలె మెరయుచున్న నక్షత్రముల పైకి నీటిబిందువుల నెగురఁజిమ్ముచున్నవి.

ఈ భయంకరవాతూలముఁజూడ నోడలెల్లఁ గంపమెత్తుచున్నది. ఆ పరాసుదళ మిప్పుడెక్కడేని యొడ్డుజేరి నక్కియుండనియెడల సంపూర్ణముగ విధ్వంసమై యుండును.

(ప్రవేశము—వార్తాహారి)

వార్తా—దేవా! దండములు. మహాసంతోషవార్త. ఇంక యుద్ధమంతరించినది. ఈ ప్రచండ వాతాహతి కోడి పరాసులు వెనుక మరలిరి. ఆంధ్రనౌక యొం డాసమయంబునకే యట కరుదెంచి వారి పడవలఁ జాలవఱకు ముంచివేసినది.

మలి—ఆహా! ఇదంతయు నిశ్చయమేనా? నేడెంత సుదినము.

వార్తా—ఆనౌక యిచ్చటనే లంగరు వేయబడినది. అందుండి వీరకేసరియగు శ్యామలరాయని దండనాథుఁడు విక్రమ

సింహు డిదే వచ్చుచున్నాడు. శ్యామలరాయ లిప్పుడు సింహళమునకు రాజప్రతినిధిగ నరుదెంచి తానే స్వయముగ విరోధిసైన్యములఁ బారదోలుటకై వారి వెన్నాడి పోయెను.

మలి—నాకుచాల సంతోషముగనున్నది. ఆత డీ పనికెంతయుఁ దగినవాఁడు.

వార్తా—ఈ విక్రముఁడు వైరిదళవిధ్వంసమునకు సంతోషము జూపుచున్నను శ్యామలుని క్షేమమును గూర్చి తహతహ పడుచున్నాడు. ఏలయన, పరాసుదళమును వెన్నాడుట కిరువురు గలిసిపోయిరఁట. ఇంతలో సముద్రతరంగముల మహోద్ధతిచే విడిపోయి తా నొంటిగ నిటకు జేరుకొనియెనఁట.

మలి—ఈశ్వరుఁ డా శ్యామలరాయునికిఁ దోడు పడఁగలఁడు. నేనాతని చేతికిఁ ద్రిందఁ గొన్నాళ్ళుంటిని. ఆతఁ డారితేఱిన వీరశిఖామణి. కార్యభారమును గడుసామర్థ్యముతో నిర్వహింపఁగలఁడు. మన మిపు డావంక కేగి దరిజేరిన యాపడవను పరిశీలించి పిదప శ్యామలుని రాక కెదురుచూచుచు వేచియుందము. (ఇరువురు కదలుచున్నారు)

( ప్రవేశము—విక్రముఁడు )

విక్ర—శ్యామలుని గొనియాడుచున్న యా యోధుఁడెవ్వరు? (కలయఁజూచి) ఓహో! మలిదేవరాయలా, అభివాదములు. ఉసురుల మ్రింగునట్లు ముసురుకొనివచ్చు నలలతో నెత్తి

పోవుచున్న కడలిపై నాతనితో నా కెడఁబాటు గలిగె. దైవమాతనిఁ గాపాడుఁగాక !

మలి—తథాస్తు! ఆతఁ డధిష్ఠించియున్న పడవ మంచిదేనా?

విక్రి—పడవమిక్కిలి గట్టిది. చుక్కాని వన్నెగన్నవాఁడు. అందుచేతనే నాకించుక యాసగలదు.

(తెరలో కలకలము—"పడవ" "పడవ" అనికేకలు)

ఏమి యీ గంద్రగోళము!

భటుడు—(ప్రవేశించి) ఏమియులేదు. ఊరిలోని జన మందఱు "పడవ" "పడవ" యని కేకలఁ బెట్టుచు సముద్రపు దరిఁ జేరి గుంపులు గూడియున్నారు.

విక్రి—అటులైన నా వచ్చుచున్నది ప్రభువు శ్యామలరాయలే యైయుండినోపు,

( ఫిరంగులు మ్రోగుచున్నవి )

పౌరు—మనవారు గౌరవప్రదర్శకములఁ గూడ మ్రోగించుచున్నారు.

విక్రి—(వార్తాహారునితో) ఓయీ! నీ వేగి యావచ్చిన దెవ్వరో నిశ్చయ మెఱింగిరమ్ము.

వార్తా—చిత్తము.

(నిష్క్రమించును.)

విక్రి—లంకాధిపా! ఈ సింహళమున కెప్పుడు రాజప్రతినిధి శ్యామలుఁడు ఈపాటికిటఁ జేరియుండును.

మలి—మిత్రమా! విక్రమసింహా! శ్యామలరాయలు వివాహితుఁడయ్యెనఁట నిజమేనా ?

విక్ర—ఔను, నిజమే. అతఁడు గొప్ప యదృష్టవంతుఁడు. అనన్యసామాన్యయగు నొక్క యువతీరత్న మాతనికి లభించె.

గీ॥ ఆమెరూపము వరింప నలవిగాక
వేయినాల్కల శేషుఁడే విసిగిపోవు
నామెగుణముల సు[illegible]యింప నలవిగాదు
గణుతికెక్కిన యామహాకవులకైన.

వార్తా—(పునః ప్రవేశించి) ఆ వచ్చినవారు ప్రభువుగారి సతీమణి కుముద్వతీదేవియు, నంగరక్షకు డీరావంతుఁడును.

విక్ర—ఆశ్చర్య మాశ్చర్యము! ఇక్క డున్న ట్లింతలో నెటుల రాఁగలిగిరి ?

శా॥ ఆ యత్యంత కఠోర ఘోరమశిలోద్య ద్రౌద్రపరత్నాకరం
బీయుత్తుంగతరంగ భీకరతటం బీచండవాతూలముల్
స్త్రీయాభీల లయక్రియఁ విడి వెసఁ జేర్పించె నిక్కమ్మిఁ
నేయుంబో! పరిచర్యరూపసులకుఁ నిర్జపభూతంబులుఁ !

కాకున్న నింత త్వరితముగ రాఁదరమా ?

మలి—ఏమి? ఆమెయేనా యిప్పు డిచ్చటికి వచ్చినది.

విక్ర—ఔను. నేనిపుడు జెప్పిన యామెయే. మన యధీశ్వరుని హృదయేశ్వరి. ఈయిరావంతునిచే నిటకుఁ దోడుకొనిరాఁబడియె. ఓ సముద్రరాజా! మా శ్యామలుని గాపాడుము. ఇప్పుడేయాతఁడరుదెంచి యీకుముద్వతిని[illegible] ప్రేమతో

గౌరవించి యీసింహళద్వీపమునెల్ల సంతోషతరంగముల నోలలాడించునుగాక.

[ప్రవేశము—కుముద్వతి, దమనిక, ఇరావంతుడు, రఘుపతి.]

అల్లదే కనుంగొనుడు. ఆపడవనుండి దిగి యాదివ్య మాణిక్య మిదే యరుదెంచెడి! పౌరులెల్ల రామె నుచితరీతిని గౌరవింపుడు. దేవీ, స్వాగతము, సుస్వాగతము. ఈశ్వరుని కారుణ్యము మీపై నెల్లవేళలఁ బ్రసరించుఁగాక!

కుము—అనన్య విక్రమా! విక్రమా! అభినందనములు; నా నాథుఁడు కుశలముగ నున్నాడుగద. ముందావార్త తెలుపుము.

విక్రి—రాయలింకను నిచటికిఁ జేరలేదు. అతఁడు కుశలముగనే యున్నవాఁడు. ఇంకొక్క నిమిషమున నిటనుండ గలఁడు.

కుము—నాకేమో భయమగుచున్నది. మీరిరువురు నెట్లు విడిపోయితిరి?

విక్రి—భయంకరమగు నీ ప్రచండవాతూలము మాయిరువురిమధ్యగా వీచి మమ్ముల విడఁదీసె. అల్లదే యొక్కపడవ కనన య్యెడి.

[తెరలో - "పడవ" "పడవ" అని కేకలు. పిదప ఫిరంగిమ్రోతలు]

వార్తా—అదుగో ఫిరంగులు మ్రోగుచున్నవి. వచ్చునది మిత్రులేయనుట స్పష్టము.

విక్రి—అటులైన నీవేగి యావచ్చిన దెవ్వరో కనుగొని రమ్ము.

[వార్తాహారి వెళ్లును, తోడనే మలిదేవరాయలు, పౌరులుగూడ నిష్క్రమింతురు.]

ఇరావంతా! నీకుస్వాగతము (దమనికను జూచి) సుదతీ, నాయభినందనముల గ్రహింపుము.

కుము—అయ్యో! ఈమె మాటాడ దేమి?

ఇరా— ఆమె కిట్టి మన్నన లనిష్టము.

దమ—మీ రట్లనుటకుఁ గారణము లేదు.

ఇరా—నీమానమే కారణము.

తెలియుబో నాకు మీ స్త్రీలమర్మములు
కాంతలు వంటింట గండుబిల్లులును
గడపలోపలనున్న కంచుఘంటలును
గడపదాటినయంత గాజుబొమ్మలును
కోపంబువచ్చినఁ గ్రూరసర్పములు
కష్టకాలమున రక్షసితాల్మి తోడ
మానవత్రముఁబూని మాటాడకుంద్రు.

కుము—ఛీ, ఇఁక నీ పైశాచిక హాస్యములఁ జాలింపుము.

ఇరా—ఇప్పుడు నేఁజెప్పినవానిలో దప్పున్న నేను పిశాచినే.

దమ—మీవర్ణనలతో మాకుఁ బనిలేదు.

ఇరా—పోనిమ్ము పనిలేకున్న మిన్నకుండెదను.

కుము—దానితోనేమి, పోనిచ్చి, నన్ను వర్ణించి పలుకుము, చూతము.

ఇరా—అమ్మా! నన్నిట్టి పనికిఁ బురికొల్పకుము. నేను వట్టిపరనిందా పరాయణుఁడను.

కుము—కానిమ్ము. వార్తాహారి నౌకాస్థానమున కేగి యున్నాడు. అతఁడు వచ్చులోపల యత్నించి చూడుము.

ఇరా—తల్లీ! ఏమంటివి?

కుము—నాకేమో మనసులో నుల్లాసము లేకున్నది. కావున వినోదముల కాశించుచున్నాను. కానిమ్ము నన్ను గుఱించి పలుకుము.

ఇరా—నే నదే యోజించుచున్నాను; కాని నాయూహలుఁ మెదడునంటుకొని యూడిరాకున్నవి. బలవంతముగఁ బట్టి లాగిన మెదడుగూడ జారిపడునేమో - కాని యెట్లో సాధన చేయఁదలచితిని.

గీ॥ విదితరూపలావణ్య సంపదలఁ బొదలు
కాంత బుద్ధివిశేష సంకలితయైన
తనము రూపమ్ము బుద్ధిచేఁ దగినరీతి
స్వార్థఫలసిద్ధి కుపయోగ పఱచుకొనును.

కుము—బాగున్నది? కురూపియగు యువతి తెలివిగలదైనపుడు-

ఇరా—నల్లని మైచాయఁగల యువతి తెలివిగలదైనఁ దనచాకచక్యమెల్ల వినియోగించి యెట్టివానిని బెండ్లియాడును.

కుము—ఇది బాగుండలేదు. మఱల బాగుగా యోజింపుము.

కమ—రూపవతి బుద్ధిహీనయైన నేమగును?

ఇరా—ఇంతవఱకు రూపవతు లెవ్వరును బుద్ధిహీనలై జన్మింపలేదు.

కుము—ఇవన్నియు నల్పబుద్ధుల నవ్వించు పాత్రసామెతలు. అయినను నిది యొకటి మాత్రము చెప్పుము. కురూపియు బుద్ధిహీనయుఁ గూడనైన దానిగతి యేమి?

ఇరా—అంత బొత్తుగ తెలివి లేనివారు కురూపిణు లగు స్త్రీలలోఁ గూడ నుండరు. ఒకవేళ నుండినను వారుకూడఁ దెలివి గలవారివలెఁ బరిహాసములఁ బల్కుచుందురు.

కుము—ఎంత యనాలోచితముగఁ బలికితివి? అధములనే కడు రమ్యముగ వర్ణించితివి. అట్లయిన బుద్ధిచేతను రూపము చేతను సన్నుతిపాత్రమయ్యు నహంకారవిశేషమ్మున దుష్ప్రవర్తనిబోలెఁ జరియించుకాంత నభివర్ణింపుము.

ఇరా-సీ॥ విమలరూపవిలాసవిఖ్యాతిఁ గలిగియు,
గర్వితమతి గానికాంత యున్న
మితభాషిణియగుచు హితమతిఁ జరియించు
శ్రుతిమించు రాగమ్ముఁ జెనకఁబోదు
తగినభూషణములె ధరియించుకొనుఁగాని
యాడంబరంబుల కాసపడదు

పరుల కష్టసుఖాలు పాటించి పాలించు
స్వార్థపరత్వమై వఱలఁబోదు.
పదుగురుగోవాళ్లు పలుమరు తెన్నాడఁ
గన్నె త్రియెనను గాంచఁబోదు
ప్రబలనిరోధసంపత్తిచే నిజభావ
దీప్తుల వెలి కింతఁ దెలియనీదు
తే॥ గీ॥ బహువివేచనాశక్తి సంపన్న యగుట
నట్టికాంత మనోజ్ఞదివ్యాంబుజముల
సరసనరించు రాజహంసమ్ము వీడి
మాలకాకిని జేపట్టఁజాల దెపుడు.

కాని యట్టి యాదర్శరూపము నిపు డెచ్చటను దర్శింపఁజాలము.

కుము—ఏమి చేయుటకు ?

ఇరా—ఎందుకా ? బుద్ధిహీనులఁ బాలిచ్చి పెంచుటకు.

కుము—ఛీ ! ఏమి నీయవ్యక్తపుమాటలు. దమనికా! ఈతఁడు నీపతియే యగుఁగాక, నీవుమాత్రి మిట్టిమాటల నేర్చు కొనకుము. విక్రమా! నీ వేమందువు ? వీని పలుకు లసంబద్ధములు గావా ?

విక్రి—ఆతఁ డెప్పుడు నిట్లే యడ్డదిడ్డముగ మాటాడుచుండును. ఆతఁడు సాహిత్యమునందుకంటె సంగీతమునం దెక్కువ నిపుణుఁడు.

ఇరా—(స్వగతము) ఏమి వీనిచనవు ? తగిలియుఁ దగుల నంత దగ్గఱగ నిలిచి మంతనము లాడుచున్నాఁడు ! కానిండు.

చెవులు గొరుకుకొనుఁడు. గొత్తె కొవ్విన దెల్ల గొల్ల వానికే లాభ మన్నట్టు లివియెల్ల నావిజయమునకే తోడు పడును. నా కింతియే చాలును. ఈ యల్పసూత్రము తోడనే విక్రమునంతటి మదకరీంద్రమును గట్టిపడవై చెదను. (విక్రముఁడు చేయిఁ జాప కుముద్వతి హస్తచాల నము చేయును. విక్రముఁడు నవ్వును.)

కానిమ్ము. నవ్వుము; నవ్వుము. ఈ లేనిపోని హస్త చాలనాది మర్యాదలతో నిన్నుఁ గట్టఁ ద్రాళ్ళు నీవే తెచ్చుకొనుచున్నావు. అబ్బ! ఏమి మాయలు, ఏమి మర్యాదలు! విక్రమా, నీ విధ్వంస మిందే యిమిడియుండు నని నీ వెఱుంగఁజాలవు గదా. కానిమ్ము. కానిమ్ము.

(తెరలో శంఖారావము)

ఇరా—అదే శ్యామలరాయలు. ఆతనిదే యాసింహనాదము.

విక్ర—ఔను, నిజమే.

కుము—మనము వారికిఁ బ్రత్యుత్థానము చేసి పిలుచుకొని వత్తము రండు. (అందఱు కొంచెము ముందునకు నడతురు)

(ప్రవేశము : శ్యామలరాయలు, ఒక భటునితో)

శ్యామ—ప్రియా, రణప్రియా!

కుము—మనోహరా, శ్యామసుందరా!

శ్యామ—నాకంటె నీవు ముం దిట కరుదెంచుటవలన నా కమితసంతోషము గలుగుచున్నది. నిన్నుఁ గాంచుట నాకుఁ బరమానందకరముగదా.

గీ॥ చండవాయువు వెంటఁ బ్రశాంతి యెపుడు
తప్పకయె కల్గు ననుమాట తథ్య మయిన
ప్రబలఝంఝానిలాఘాత పటలములకు
సంతతోత్తుంగ సాంద్రోర్మి సంతతులకు
శీకర తుషార సంభృత వీచికలకు
వెలవఁబనిలేదు తుది మేలు జరుగుకతన.

నా హృదయానంద మిపుడు సాకల్యము గాంచుటచే నా కిపుడు మృత్యువు సిద్ధించినను సంతసించెదను. లేకున్న నా భవిష్యజ్జీవితమున నింతకంటె నెక్కుడానందదాయక మగు ముహూర్తము కలుగఁ బోదు.

కుము—పాపము శమించుఁ గాక! అమంగళము ప్రతిహతింపఁజేసి మన సౌఖ్యము దినదినప్రవర్ధమాన మగున ట్లీశ్వరుఁ డనుగ్రహించుఁగాక.

శ్యామ—తథాస్తు, తథాస్తు. ఇంతకంటె వేఱువిధముగా నా సంతోషమును వర్ణింపఁజాలను. ఆనందపారవశ్యమున నానోట మాట రాకున్నది. (కుముద్వతిని ముద్దిడుకొనును.) ఈ యధరస్పర్శచే మనజీవన నాదమందలి భగ్న తంత్రు లెల్లఁ బాసిపోవుఁగాక.

ఇరా—(స్వగతము) నాదము బాగుగనే కుదిరినది. నన్నిపుడు విశ్వసనీయునిగా నమ్మియున్నాఁడు. ఈ నేనే యాతంత్రులఁ దెంపి యీ నాదము భగ్నము జేసెదనులే.

శ్యామ—రండు, కోటలోని కేగుదము రండు. యుద్ధవార్తలు వింటిరిగదా! శత్రుదళ మెల్ల సముద్రమునకు ధారాగత

మైనది. మన యుద్ధము ముగిసినది. పూర్వపరిచితు లగు నీపురవాసు లందరు క్షేమముగ నున్నారుగదా? సుందరీ, ఈ సింహళద్వీపము నీ కింపుఁగూర్చుననియే భావించెదను. ఈ దేశవాసులకు నాయం దెంతో మక్కువ గలదు. ఇరావంతుఁడా! నీవు తీరమున కేగి నావడవయందలి సామగ్రి నెల్ల దింపించుము. ఆ చుక్కాని కడుసమర్థుఁడు. మన మన్ననకుఁ బాత్రుఁడు. కావున వానిని నాప్రాసాదమునకుఁ బిలుచుకొని రమ్ము. విక్రమా! నీవును నావెంటరమ్ము.

(నిష్క్రమణము: శ్యామలుఁడు, కుముద్వతి, వెనువెంట విక్రముఁడు, ఘటుఁడు)

ఇరా—రఘుపతీ, ఎక్కడున్నావు? ఇంక బయటకి రా! ఏదీ యిటు దగ్గఱకు రా.

(రఘుపతిః ప్రవేశించి సమీపించును.)

అల్పుఁడు ప్రేమవివశుఁడైనపుడు తనకు సహజమగు నంతకంటె నెక్కుడు ధైర్యసాహసములఁ జూపును. కాబట్టి నీయం దేమైన పౌరుష మున్న యెడల నే చెప్పునది వినుము. ఈరాత్రి ప్రాకారమునొద్ద విక్రముఁడు తానే స్వయముగాఁ గాపుండును. కాని ముందుగ నీ కొకసంగతిఁ దెలుపవలయును, వినుము. కుముద్వతి యీ విక్రముని మనసారఁ బ్రేమించుచున్నది.

రఘు—ఈ విక్రముడా? అసంభవము. ఛీ! నేను నమ్మఁజాలను.

ఇరా—ఈ వెఱ్ఱిబుద్ధి పడుచుపడుచు. నే చెప్పుమాటలు తలకెక్కనీ. ఈమె యాఘూర్కుని మాయమాటలకు ముందెంతగా వానిని బ్రేమించినదో నీ వెఱుంగుదువు. కాని యింకను నాపిచ్చిమాటల నమ్మి తన మనసు నాతనిపై నిలిపియుంచు ననుకొంటివా? అది వట్టిమాట. బాగుగ యోజించి చూడుము. ఈపిశాచి యామె నేత్రముల కెల్లకాల మింపుగూర్పఁ గలఁడా? శరీరగత మగుప్రేమకు మాంద్యము గలిగి నపుడు మరల నూతనోత్సాహముఁ గల్పించుట కాతనికి రూపసంపద లేదు. మృదుమధురభాషణములు లేవు. ఉత్కృష్టభావములు లేవు. మనోహరములగు నవ్యకళ లేమియును లేవు. అంత నీయిల్లాలు తన సౌకుమార్యము నిరర్థకమాయెనని వగచి యాతని నేవగించుకొనును. ప్రకృతిసిద్ధముగనే యామె కట్టిభావము లలవడితీరును. అపుడు వేఱొకనిఁ జేపట్టకతప్పదు. విధివిధాయక మగునట్టి పరిణామదశయందు, అంతటి యదృష్ట మనుభవించుటకు సర్వసంసిద్ధుఁడుగ నున్నవాఁడీ విక్రముఁడే గదా? * * * ఆహా, యిట్టి సౌభాగ్య మీమాయగానికా? ఈవేషధారికా? చీఁకటి పడఁగనే కొంపకొంపలు దిరుగుచుఁ దెల్లవాఱఁగనే తనయంత సత్పురుషుఁడు లేడనిపించుకొనఁ జూచు నీపెద్దమనిషికా? ఆ, ఏమి యీగజదొంగటక్కులు? సమయము పొంచియుండి యవకాశములఁ జేఁజిక్కించుకొని తన కనువగురీతి నాటకమాడు చున్నాఁడు. అది గూడ వీని యొప్పులఁ గనిపెట్టి వీని వలలోఁ జిక్కుకొనుచున్నది.

కాని వీని యదృష్టపరివాహమున కెదురీది, నేను తుది ముట్టింప లేకపోవుదునా వీనిసౌఖ్యమును!

రఘు—నే నిది యంతయు నమ్మజాలను. ఆమె సాధ్వీమణి యనియే నా నమ్మకము.

ఇరా—ఛీ, సాధ్వీమణియా? పీతలకాయ. ఆమె తినేది గూడ నుప్పు కారమే. ఆమె నీ వన్నట్లు సాధ్వీమణియే యైనచో మొదట నీఘూర్కు నేల వరించును? అహహా! (నవ్వును) ఆ, పాపము సంగనాచి! ఆమె విక్రమునిచేతికిఁ జేయి కలిపి మురియుచుండుటఁ గాంచలేదా?

రఘు—నేను చూచితినిగాని, యవి యన్నియు నొకరి నొకరు మర్యాదచేసికొను చిన్నెలుగావా?

ఇరా—ఛీ, చేతులు పిసికికొనుటా మర్యాద? అంతమాత్రము నాకుఁ దెలియకపోలేదు. అదియే ప్రణయరాగమున కంకురము. దుర్భావములకు మూలకందము. నా రిరువురి పెదవులు తగిలియుఁ దగులనట్లు సమీపించె. వారి నిశ్వాసము లొండొంటిఁ గౌఁగిలించె. రఘుపతీ, అన్యోన్య ప్రేమ చిహ్నము లిట్లు వ్యక్తమగుచుండ నింక ననుమాన మేమిటికి? అత్యల్పకాలములోనే కాఁడగిన కార్యము లన్నియు సిద్ధింపఁగలవు. అందుకు సంశయము లేదు. కాని యిటు వినుము. నిన్నాంధ్రపురమునుండి వెంటఁగొనివచ్చితిని. నీ విపుడు నేఁ జెప్పినట్లు నడుచుకొనవలయును. ఈ రాత్రి నా యాజ్ఞలకు వేచియుండి తత్క్షణమే శిరసావహింపుము.

విక్రముఁడు నిన్నెఱుంగఁడు. నీవీ రాత్రియే పోయి విక్రము నేదో విధమునఁ గదపవలయును. బిగ్గఱగా నఱచి యతని నధిక్షేపింపుము. లేదా సమయానుకూలమగు నే యుపాయముచేతనైనను సరే, వానికి నీపైఁ గోపముఁ దెప్పింపవలయును. నేను నీ వెనువెంటనే యుండెదను. నీ వేమియు భయపడనక్కరలేదు.

రఘు—సరే, అటుపైని ?

ఇరా—నీవు జాగ్రత్తగానుండవలెను. అతఁడు చాల దుడుకువాఁడు. ఆకోపములో నిన్ను ఖండించిన ఖండింపవచ్చును. కాన మెలఁకువఁగలిగియుండి విక్రమున కెటులైన నాగ్రహముఁ గలిగింపుము. ఆకొంచెముతో నేను సింహళవాస్తవ్యులచేఁ దిరుగుబాటు నడిపించెద. అంతటితో నాతనికిఁ బదభ్రష్టత్వము తప్పదు. అపుడుగాని నీకోరిక నెఱవేఱుటకవకాశము కలుగదు. ఇపుడు నే చెప్పినచొప్పున జరుగకున్న మనసంకల్పములు సిద్ధించు నను నాస లేదు.

రఘు—నాకుఁ జెప్పినపని నేను చేసితీరెదను. పిదప నీదే భారము.

ఇరా—సరే. జాగ్రత్త. నేను రేపున కేగెదను. సంజపడగనే నన్నుఁ గోటయొద్దఁ గలిసికొమ్ము.

రఘు—సరే. (నిష్క్రమించును.)

ఇరా—విక్రముఁ డామెను బ్రేమించుచున్నాఁ డనుట విశదమే. ఆమె యాతని ప్రేమించుచున్న దనుటగూడ మిగులనమ్మఁ దగియున్నది. ఈ శ్యాములుఁడో ... ... అబ్బో! యేమిది యీపేరే నాకుఁ గిట్టకయున్నది? వీఁడు సాహసౌదార్య

ములేకాక చిత్తస్థైర్యముగూడఁ గలవాఁడు. నిజ మూర
యఁ గుముద్వతి కెంతయుఁ దగినవాఁడు.— నాకుఁగూడ
నాలావణ్యరాశిపై మనసు గలదు. కేవలము శరీరసౌఖ్యముఁ
గోరి కాకపోయినను, నాకసి దీర్చుకొనుట కీపాపముఁ దల
పెట్టితిని. ఎందుకనఁగాఁ బ్రణయవివశుఁడై యీ ఘూర్జుఁ
డెప్పుడో యొకప్పుడు నాకు ద్రోహముఁ దలపెట్టియుండ
కుండునా యని నా కనుమానము. ఆయనుమానమే నా
గుండెలలో గాలమై బాధించుచున్నది. వీఁడు నాభార్యను
జేపట్టి నాకుఁ జేయఁబోవుద్రోహమునకు వానిభార్యను వశ
పఱచుకొన్నఁగాని నా కసితీరదు. ఒకవేళ నిది సాధ్యము
గాకపోయిన వారిద్దఱకుఁ గాకుండఁజేయుదును. ఇన్నిఁటికిని
నాగుప్పిటిలోఁ బెట్టుకొన్న యీాశలువగనుక సమయానికి
వెనుకకుఁ దీయకుండ నిలువఁబడిన నీ విక్రముఁడు నిమిష
ములో నాచేతికిఁ జిక్కఁగలఁడు. అప్పుడు తగిన కొండెము
లల్లి శ్యామలునితోఁ జెప్పెదను. విక్రముఁడనిన నాకుఁ
గలలోఁగూడ భయమే. అటుపైని ఘూర్కుఁడు సంతో
షించి నేఁ జెప్పినట్లు వినఁగలఁడు. నేను వానిని గంచరగాడి
దనుగాఁజేసి ముక్కునకుఁ ద్రాడుగట్టి ముందునకు లాగెదను.
ఆపైనఁ జేయవలసినపని స్పష్టముగాఁ గానఁబడుటలేదు.
మాయోపాయములు సమయము వచ్చినఁగాని తోఁచవు.
ఇంక నే నిక్కడ నుండఁగూడదు. పోయెదను.

(నిష్క్రమించును తెరపడును)

---

రెండవరంగము : సింహళరాజధానియందొక వీధి.

[డప్పువాఁడు, వానితోఁ గొందఱు పురజనులు.]

డప్పువాఁడు—(డప్పు గొట్టుచుండును - పిదప డప్పునిలిపి) పభువుగారు చల్లంగుండాలి. పడమటి సేనలన్నీ బగ్గమై పోయ్యాయని తెల్చింది గామట్టినీ, మన పెబువైన చామలాప్రియలు దొరగారు పెండ్లిచేసు కొచ్చి గురప్ప వేళ మియ్యాల జేస్కుంటున్నారు గామట్టినీ, ఊళ్లో జనంయావత్తు మందీ యియ్యాలంతా తమయిట్టం వచ్చినట్టల్లా యినోదాలు జరుపుకోవచ్చంట- యినోదాలు జేసుకోవచ్చంటోహోయ్—తినేదీ తాగేదీ తందనాలాడేదీ, చిందుల్ దొక్కేదీ చలిమంట లేస్కునేదీ యీాప్పకారంగా యెవరియిట్టంకొద్దీ వాళ్లు చేయొచ్చునంటోహోయ్. ఇది పబువుగారి ఆగ్గోహోయ్. [నిష్క్రమించును]

[మరల రెండవవైపునుండి ప్రవేశించి వెనుకటిమాదిరిగనే యింకొకసారి కేకవేసి నిష్క్రమించును.]

---

మూఁడవ రంగము—కోటలో రాజనగరునకు బహిర్ద్వారము నొద్ద సావడి.

[ప్రవేశము : శ్యామలుఁడు కుముద్వతి - విక్రముఁడు, ఘటుఁడు]

శ్యామలుఁడు—సాధుశీలా! విక్రమసింహా! కోటవాకిఁట నీ వీ రాత్రి స్వయముగాఁ గాపుండవలయును. వినోదము ధర్మము నతిక్ర మించి పోఁగూడదని మనము విశదపఱచవలయును.

విక్రి—ఈపని సక్రమముగ నిర్వర్తించుట కిరావంతు నిది వఱకే నియమించితి. అయినను నేనుగూడ నొకకంటఁ గనిపెట్టియుండెదను.

శ్యామ—ఇరావంతుఁడు చాల సజ్జనుఁడు. తగినవాఁడే. విక్రిమా, నే నింకఁ బోయెదను. రేపు తెల్లవాఱఁగనే నా కడకు రమ్ము. కుముద్వతీ, మన మింక పోవుదము రమ్ము.

(నిష్క్రమణము: శ్యామలుఁడు, కుముద్వతి, ఘటుఁడు.)

(ప్రవేశము: ఇరావంతుఁడు మఱియొక ప్రైపునుండి.)

విక్రి—ఇరావంతుఁడా! సమయమునకే వచ్చితివి. మన మిరుపుర మీనాఁడు స్వయముగాఁ గోటవాకిటఁ గాపుండవలె నని రాయలయాజ్ఞ.

ఇరా—ఇపుడేనా? ఇప్పుడు తొమ్మిదిగంటలైనఁ గాలేదే! మన యొడయఁడు తన ప్రియురాలిమీఁది మోహముచే మనలఁ ద్వరితముగ విడిచిపుచ్చె.

విక్రి—అందుఁ దప్పేమున్నది? ఆమె మిగుల సౌందర్యవతి.

ఇరా—తప్పని నే ననలేదు. ఆమె విలాసవతిగూడ.

విక్రి—ఔను. ఆమె ప్రాయంపుజవ్వని, యమిత సుకుమారి.

ఇరా—ఆమెచూపు లేమిచూపులు! చూపఱుల హృదయ మినుమంతలోఁ జూరగొనును.

విక్రి—ఆమె దృక్కులు చూడ-చోద్యము లైనను వినమ్ర భావము తొలుకాడుచుండును.

ఇరా—ఆమె పలుకులు ముద్దులు గులుకుచుండును.

విక్రి—ఆమె యన్నింట సాకల్యముఁ గాంచియున్నది.

ఇరా—మంచిదే. వారికి సుఖ మగుఁగాక. సేనానీ! ఇటుచూడుము. చక్కని ద్రాక్షాసవ మిందున్నది. ఇచ్చటనే శ్యామలాంగుని పేరుఁ జెప్పి యించుకఁ ద్రావనెంచిన పెద్ద మనుష్యు లిరువురు వేంచేసియున్నారు.

విక్రి—మిత్రమా, ఈ నాఁడు వీలుకాదు. నా బుద్ధి త్రాగుడు కాఁగఁజాలినది కాదు. బుద్ధిమంతు లింతకంటె వే ఱొక్క వినోదముఁ గల్పించిన నేను సంతోషముతోఁ బాలుగొనెదను.

ఇరా—వారు కేవలము క్రొత్తవారు కారు. మనకుఁ జిర పరిచితులే. ఒక గ్రుక్కెడు ద్రావుదువుగాని రా. పోనీ, అంత నీవు త్రాగలేకపోయిన నీ బదులు గూడ నేనే త్రాగెదను లెమ్ము.

విక్రి—ఈ రాత్రి నే నిదివఱకే యొకబుడ్డి సేవించితిని. కాని దానిలో సగానికి సగము నీరుఁ గలిపి పుచ్చుకొంటిని. దానితోనే నా తల తిరుగుచున్నది. అసలే నాకుఁ గొంత మైమఱ పున్నది. దానికిఁ దగినట్లు యీ సారాయముఁ గూడఁ ద్రాగిన నసలుకే మోసము వచ్చునేమో.

ఇరా—ఏమిటయ్యా, అట్లాగంటావు? ఈ రాత్రి వేడుకలు చేసికోమనికదా రాజాజ్ఞ? మన స్నేహితులు గూడఁ జాల నాతురతతో నున్నారు. కా దనక రమ్ము.

విక్రి—ఏరీ వా రెక్కడున్నారు?

ఇరా——ఇక్కడే; యీ తలుపుదగ్గఱ నున్నారు. నీవు పోయి పిలువుము.

విక్రి——సరే పోయెదను. కాని నా కెంతమాత్రి మిష్టము లేదు. (నిష్క్రమణము).

ఇరా——ఈవేళ వీనిచేత నొక్కబుద్ధిఁ దాగించిన నిది వఱకే వీఁడు తాగినదానితోఁ జేరి చుఱ్ఱుమనిపించుతుంది. ఆరఘుపతి కుముద్వతిమీఁది మోహముతో వెఱ్ఱెత్తిపోవుచున్నాఁడు. పిచ్చికుక్కవలె తెల్లవార్లు మేలుకుంటాఁడు. మాటంటేపడని మఱిముగ్గురు తుంటర్లకుఁగూడ నిషా యెక్కించివేసినాను. వారుకూడ వీనివెంటనే యుందురు. ఇప్పుడీ తాగుఁబోతులగుంపులో విక్రిమునిచేత నందఱకుఁ గోపము వచ్చుపని నొకదానిని జేయింపవలెను. అదిగో! అందఱు నిటే వచ్చుచున్నారు.

గీ॥ అనుకొనినరీతి నాయుపాయంబు లెల్ల
సక్రమంబుగ జరుగుట సంభవింపఁ
దేలిపోవును నానావ గాలిమీఁద
నొరుగునైనను నెఱుఁగక త్వరితగతిని.

గేయము. తేలిపోవును నాదు దివ్యమైన నావ
గాలిగుంపులతోడ కదముదొక్కుడునట్లు
నటు నిటుఁ దొలుకక యందమైన నడల
నానందమును గూర్చు నాహా! అహా!

(ప్రవేశము: విక్రముఁడు, మలిదేవరాయలు - పరిచారకుఁడు మద్యపాత్ర తో వెంటవచ్చును.)

విక్ర—ఈశ్వరసాక్షిగ నా కప్పుడే యొకటియెక్కించినాఁడు.

మలి—ఎంత ! గుర్రెక్కాడేగదా ?

ఇరా— పాట:

బుడ్డి నందీయరా బుడ్కు బుడ్కు తాగుదాం
బుడ్డీ నందీయరా బుడుక్ బుడుక్ బుడుక్॥ ౧ ॥
సీపాయి లంటేమి సిబ్బంది లంటేమి
పారాజవాన్లేమి బంట్రోతు లేమి
సీపాయ్ - రూపాయ్ - సపాయ్ - రూపాయ్॥ ౨ ॥
అంచులూ మనుసులే అందర్వి బతుకులే
అందులో సంగతీ అందర్కి తెలుసునా
సీపాయ్ - రూపాయ్ - సీపాయ్ - రూపాయ్॥ ౩ ॥
బతుకు బతుకంటేమి బారెడా తూమెడా
సాపుగా జూస్తేను జానెడే గాదటోయి
జానెడే గాదటోయ్ - జానెడే, జానెడే॥ ౪ ॥
జానెడూ బతుకులో సారాయి దాగితే
స్వర్గమొత్తుందోయ్ - స్వర్గమొస్తుంద
స్వర్గం మోచ్చమ్ - స్వర్గం మోచ్చమ్॥ ౫ ॥

విక్ర—భలేపాట, భలేపాట, ఆహా ఎంత బాగుంది ?

ఇరా—ఎక్కడిది దనుకున్నా వీపాట ? పడమటిసీమది. ఆడ బలే దాగుతారు. ఆళ్లు, నైజామోళ్లు, మళయాళపోళ్లు అరవోళ్లు, కన్నడపోళ్లు బలే దాగుతారు! బలే! బలే! నీకేం; తాగు, తాగు.

విక్రి—పడమటో ళ్లంతెచ్చుగా దాగుతారా!

ఇరా—ఇంకా అడుగుతావా? నీపేరు జెప్పి మళ్లీతాగుతారు. నీచేతఁగాకపోతే నీబదులుగూడా తాగుతారు. ఆళ్లముందఱ మీకొండవీటోళ్లు నోళ్లే తెరవలేరు. మీపల్నాటోళ్లు నిలనే లేరు.

విక్రి—మన ప్రభువుపేరుజెప్పి ఒకగుక్క తాగుదము.

మలి—నేనందుకే చూస్తున్నాను.

ఇరా—కన్నడసీమోళ్ళమీఁది పాట బాడ్తా, యినండి.

పాట

కర్నాటదేశంలో ఘనమైనసర్దారు, సోమప్ప మావాడు షోకైనవాడు
షోకైనవాడూ, శోకైనవాడూ, షోకూశీకూ, షోకూశీకూ
పండెర్రిందు రూకాల పట్టంచుతలపాగ, పేటుదీర్చిచుట్టి సిటుగుల్లుతాడు
షోకైనసోమప్ప షోకూశీకూ
పేటూపాగాలోని సిటూజూచి నేను కూటికిబోతేను
కుడువా మెతుకులేను షోకైనసోమప్ప, షోకూశీకూ
రాగిగంజీతోటి ప్రాణాల్ని నిలబెట్టి కమ్మనిసారాతో
కడుపునిండిస్తాడు, షోకైనసోమప్ప షోకూశీకూ.

ఇరా—తెండి, సారాయి. యింకా తెండి తెండి.

విక్రి—ఈపాట యిందాకటిదానికంటె యింకా బాగుంది.

ఇరా—మళ్లీ పాడేదీ వింటావూ?

విక్రి—వద్దు, వద్దు, ఈపాటలు, యీపనులు, మన తాహతుకుఁ దగినవిగావు. కానీ! దేవుఁడున్నాఁడు. పుణ్యాత్ములను బాపాత్ములనుగూడఁ గనిపెట్టుచుండును.

ఇరా—ఆమాట నిజం.

విక్రి—నామట్టుకు నేను ప్రభువుకుగాని మఱెవ్వరికిఁగాని యెట్టి ద్రోహమును దలంచి యెఱుంగను. కాఁబట్టి నాకుఁ బుణ్యలోకమే దొరుకుతుంది.

ఇరా—నీకు వచ్చిన నాకేనా రానిది?

విక్రి— ఇంక మాటలఁ గట్టిపెట్టి మనపని చూచుకొందము. దేవుఁడు పాపము శమింపఁజేయుఁగాక. అందఱము నెవరి పనుల వారము చూచుకొందము. నేను తాగియున్నానని మీరెంతమాత్రము ననుకోవద్దు. నాకిప్పుడు మత్తు కొంచెముగూడ లేదు. బాగా నిలువఁగలను. ఇదిగో, నా కుడిచెయ్యి; ఇదిగో యెడమచెయ్యి. నేను బాగా మాటాడఁగలను.

[అని ఒక చేయికి బదులు మఱొకటి చూపును.]

అందఱు—బహుబాగా!

విక్రి—అయితే నే తాగినట్లెవరును అనుకోవద్దు.

(నిష్క్రమణము.)

మలి—(బురుజుపైకిఁ బోవుచు) మనము కాపలాకుఁ బూనుకొందము.

ఇరా—ఇతణ్ణి వెళ్ళేటప్పుడు చూచినారుగదా! ఇతఁడు భీష్ముని కెదురునిల్చి సైన్యముల శాసింప సమర్థుఁడు. కాని వీని దుర్బుద్ధి చూడండి, సుగుణములను దిగమ్రింగఁ జాలినన్ని దుర్గుణము లున్నవి. అదియతనిపురాకృతకర్మము. ప్రభు

వీతనిపై నుంచిన ప్రబలవిశ్వాస మెపుడో యొకప్పు డాతనికిఁ జేటు దెచ్చును.

మలి——అయితే యెప్పుడు నిట్లే తాగుచుండునా ?

ఇరా——వీనికిఁ ద్రాగిననేగాని కునుకుపట్టదు. త్రాగనినాఁడు తెల్లవారులు నిద్రపట్టక దొరలుచుండును.

[ప్రవేశము : రఘుపతి.]

మలి——అమాయకుఁడగు నీ శ్యాములుఁడు తన తరువాతఁ దన యంతపదవి నిట్టి త్రాగుబోతున కొప్పఁజెప్పుట మిగుల శోచనీయము. కాఁబట్టి యీ విషయ మాతనికి నచ్చఁ జెప్పవలయును.

ఇరా——(రఘుపతిచెవిలో రహస్యముగా) అదిగో, విక్రముఁడు. వానివెంటనే యుండుము

[రఘుపతి విక్రము ననుసరించి పోవును.]

అట్లు చెప్పుట నాకిష్టము లేదు. ఈ విక్రమునిపై నా కెక్కుడు మక్కువ కలదు. కావున వానియం దీదుర్బుద్ధి మాన్పఁజూచుచున్నాను.

[తెరలో "ఉండు, ఉండు" అనికేకలు.]

ఇరా——ఆగండి, ఆగండి. ఏమా అల్లరి.

విక్ర——(రఘుపతిని దఱుముకొనుచుఁ బ్రవేశించి) ఛీ,నీచుఁడా! ఎవఁడవురా నీవు ?

మలి——సేనాపతీ! ఏమి యీ యాగడము ?

విక్ర——ఈ వెధ వెవ్వఁడో నాపనిఁ బట్టించునఁట. ఏడీ వాఁడు? ఆదొంగ! సున్నములో కెముక లేకుండఁ జితుకఁగొట్టెదను.

రఘు—నీవేనా ? కొట్టునది !

విక్రి—ఇంకను వదరుచున్నావా! (అని రఘుపతిని మోదును)

మలి—విక్రమసింహా, ఆగుమాగుము. ఏమి యీ యల్లరి ?
(అడ్డము నిలుచును)

విక్ర—ఊఁ, ఊఁ, నన్ను పోనీ. (పెనగులాడుచు) నన్ను వదలక పోయిన నీబు ర్రౌగురఁగొట్టెదను.

మలి—చాలుఁ జాలు. నీవు త్రాగియున్నావు.

విక్ర—నేనా? నేను త్రాగియున్నానా? (అని కలియఁబడును.)

ఇరా—(రఘుపతి చెవిలో) పో త్వరగా. పరుగెత్తుకొనిపోయి "తిరుగుబాటు" "తిరుగుబాటు" అని కేకలుపెట్టు. పో, పో.
(రఘుపతి నిష్క్రమించును.)

అయ్యో, అయ్యో, ఏమి యీయాగడము. దండనాథా, ఆగు మాగుము. మలిదేవా! నీవైనఁ దడయరాదా? ఆగఁ డాగఁడు. అయ్యో, అయ్యో, బలే కాపలా గాయుచున్నారే. జనులారా, రండి, రండి.
(గంట మ్రోగును.)

అయ్యో, అయ్యో. గంటకొట్టున దెవ్వరు ? గంట, గంట! పట్నమంతయు మేల్కాంతురు. ఛీ, ఛీ, సేనాపతీ, ఆగు మాగుము. లేకపోయిన నీబ్రతుకు నేలఁబడఁగలదు.

(ప్రవేశము : శ్యామలుఁడు, ఒక పరిచారకునితో)

శ్యామ—ఏమి యీ ఘోష !

మలి—నాయొడ లింకను రక్తము గాఱుచున్నది. నాకుఁ జావు దెబ్బ తగిలినది.

శ్యామ—ఇంక నోరెత్తిన ప్రాణములు దక్కవు.

ఇరా—ఛీ, సేనానీ; ఊరకుండుము. మలిదేవరాయా, ఊరుకో. "ఎక్కడ నున్నాము? ఏమిపనిలో నున్నాము?" అను మాట బొత్తుగా మఱచియున్నారే. ఛీ, సిగ్గులేదా? ఊరుకోండి, ఊరుకోండి. ప్రభువుగారిని జూచినైన నూరుకోరేమి కర్మము?

శ్యామ—ఏమిది? ఈ యాగడ మెందుచేతఁ గలిగినది? లంకలోఁ జేరి యందఱును రాక్షసుల మై పోయినట్లున్నదే! ఈశ్వరేచ్ఛవలన వైరులు చేయకవిడిచినపని మనకు మనమే తెచ్చుకొంటిమి. సిగ్గుతెచ్చుకొని యిప్పుడైన గోల నాపివేయుఁడు, ఇఁకఁ గదలినఁ దెగవేసెదను. సుగుణనిధీ! ఇరావంతుఁడా? ఏలయిట్లు దెలతెలబోయెదవు? జరిగినసంగతి యేమో చెప్పుము. ఎవరు దీనికంతకుఁ గారణము? ముందు చెప్పుము.

ఇరా—నా కేమియుఁ దెలియదు. ఇంతకుముందే యందఱము గలిసి, సరసాలాపము లాడుకొనుచుంటిమి. ఇంతలోఁ బిడుగుపడి, పిచ్చెత్తినట్లు హఠాత్తుగఁ గత్తులు కటారులతో నొకరి నొకరు పొడుచుకొనసాగిరి. ఈ వెఱ్ఱికొట్లాటకిది మొదలు, నిది చివర యని చెప్పఁదరముగాదు. ఈ యల్లరి చూడరాకుండ నేసత్కార్యమందైన నాకాళ్ళు విరిగిపోయి యుండిన బాగుండెడిదని తోఁచుచున్నది.

శ్యామ—ఇదేమి విక్రమా? నీ విట్లాడలు మఱచియున్నావేమి?

విక్రి—ప్రభూ! మన్నింపుఁడు. నే నిపుడు మీతో మాట లాడఁజాలకున్నాను.

శ్యామ—మలిదేవరాయా! నీవు సజ్జనుఁడ వని సన్నుతిగాం చియుంటివే. ఇప్పు డిట్టి యల్లరిచిల్లర పోరాటమ్ములకు లోఁబడి నీకీర్తి నమ్మగావించుకొంటి వేల?

మలి—మహాప్రభూ! శ్యామలరాయా! నా కొకగాయము తగిలినది. మాటాడుటకే శక్తిచాలకున్నది! నాదుస్థితినిగూ ర్చి మీయుద్యోగి యిరావంతు నడిగి తెలిసికొనుఁడు. నాకుఁ దెలిసినంతవఱకు నే నీరాత్రి యొనర్చిన మహాదోషము లేవనఁగా, ఒకరినొకరు నిష్కారణముగాఁ బొడుచుకొను చుండ నాపఁబోవుట నొకటి, అందుచే నాకే మోసము రానుండ నాత్మసంరక్షణము చేసికొనఁజూచుట రెండ వది. ఇంతియే నే నెఱుంగునది.

శ్యామ—నా కాగ్రహ మతిశయించుచున్నది. యథార్థ మా రయ నెంచి సంశయించుచున్నాను. లేకున్న నెట్టివానినైన నిప్పటికే ఖండించియుందును. ఈ నీచపుపోరాట మెట్లు కలి గినదో చెప్పుఁడు. ఎవరు దీని నారంభించినది? ఇం దపరాధి యెవ్వరు? అతఁడు నాసహజన్ముఁడైనను సరే - చావు తప్పదు. ఏమి యీ యాగడము?

యుద్ధముల చేఁ బ్రజల హృదయములు భయకంపిత ములై యున్న యీసమయముననా, యిట్టి యాందోళన? అదియు నీ కోటయావరణమందే! ఈయర్ధరాత్రివేళ!! ఈ రక్షకభటుల మధ్యనుండి యే యీకలహములు!!!

ఏమి వైపరీత్యము, ఏమి ఘోరకలి! బుద్ధివంతుఁడా, ఇరావంతుఁడా! నిక్కము వచింపుము. దీనికి మూలకారకు లెవ్వరు? నీకుఁ బైయధికారి యనుమోమోటము వీడి నీఖడ్గముపై నానవెట్టి పలుకుము.

ఇరా—అంతటి యానఁబెట్టకుఁడు. ఈ నాలుకతో విక్రమున కపకారముఁ జేయుటకంటె, దీనిని బెటికి వేసికొనుట మేలు. కాని, సత్యము చెప్పక తప్పదుగదా. ఆతనికిఁ గీడు గలుగకుండఁ బరమేశ్వరుఁడు కాపాడుఁగాక.

ప్రభువరా, నిక్కము వచించెద, నాలకింపుఁడు. నేనును, ఈ దుర్గరక్షకుఁడు మలిదేవుఁడును మాటాడుకొనుచు నిట నిలిచియుంటిమి. ఎవఁడో యొక నీచుఁడు "రక్షింపుఁడు" "రక్షింపుఁడు" అని కేక లిడుచు నిటు మీఁదుగాఁ బరుగెత్తెను. ఆ వెంటనే విక్రమసింహుఁ డొర నుండి పెరికిన కరవాలమును గరమున ధరించి తఱుముకొని వచ్చి యాతని నఱకఁబోయెను. అప్పుడీ పుణ్యుఁ డడ్డుపడి కొంచెము శాంతింపుఁ డని బతిమాలుకొనియె. ఇంతలో నా నీచుని కేకల కులికిపడి పలువురు బఱతెంతు రను భయమువలన నే నాతనిఁ బట్టుకొని నోరు మూయింపఁబోవ వాఁడు నా కందకుండఁ బరువెత్తి నేననుకొన్నంతపనియుఁ జేసినాఁడు. నేను తిరిగి వచ్చునరికి వీ రిరువురు ఖడ్గముల ఝళిపించుచుఁ బ్రబలవైరులట్లు హోరాహోరిగఁ బోరుచుండిరి. విక్రముఁడు ప్రగల్భముగ నఱచుచుండెను. ఇప్పుడు తాము వచ్చునప్పటి కున్నట్లే యిరువురుఁ

గలియుఁబడి విడివడరాకయుండిరి. ఇంతకంటె నెక్కు-డేమియుఁ జెప్పఁజాలను. ప్రభూ, ఏదో మానవులన్నతరువాతఁ గోపతాపములు రాకుండునా? కోపావిష్టులగువారు తమ యాప్తులఁగూడ బాటింపఁజాలరు. కావున విక్రముఁడించుక తప్పఁజేసె. కాని యా పాటిపోయిన నీచుఁడు విక్రము నెడల నేదో మహాపరాధముఁ గావించి యుండె ననుట కేసందేహమును లేదు. కాఁబట్టి విక్రముఁడు క్షమార్హుఁడు.

శ్యామ—ఇరావంతుఁడా! నేను గ్రహింపకపోలేదు. నీయౌదార్య మీవిక్రముని నేరము నెంతయుఁ దగ్గింపఁ జూచుచున్నది. ఈమాత్రము నేను గని పెట్టకపోలేదు. విక్రమా! నీపై నా కెక్కు-డభిమానముగలదు. అయినను నింక మీఁదట నీవు నాదండనాథుఁడవుగా నుండఁదగవు. పొమ్ము.

(ప్రవేశము : కుముద్వతి.)

ఇటు చూడుము. నా ప్రియురాలుగూడ నిచటికరుదెంచినది. ఇట్టి తప్పిదమును శిక్షింపక విడువరాదు.

కుము—ఏమి సంగతి?

శ్యామ—ఇంక నేమియు లేదు. పోవుదము పద సేవకా, ఈ మలిదేవు నిటనుండి వైద్యశాలకుఁ గొంపొమ్ము. (సేవకుఁడు మలిదేవుని నడిపించుకొనిపోవును). ఇరావంతుఁడా! జాగరూకుఁడవై పురమెల్లఁ దిరిగి యాఘోషమున కులికిపడి లేచినవారి నెల్లరఁ బోయి పరుండుఁడని చెప్పుము.

కుముదా, ఇంక నీవు రమ్ము. ఇట్టి వృథాకలహములతోఁ బ్రజలను గాఢసుషుప్తినుండి మేలుకొలిపినందుల కీవిక్రము నకుఁ బ్రాణదండన విధించియుండవలసినది. ఇట్టి కలహములు, కలతనిద్రలు సైనికజీవనమునందు స్వాభావికములు. పాపము! రాచకన్నియవు నీ వెఱుంగవు. ఇంక పోదము రమ్ము.  (నిష్క్రమణము: శ్యామలుఁడు కుముద్వతి)

ఇరా—(విక్రమునితో) సేనాపతీ, నీకుఁగూడ గాయము తగిలెనా?

విక్ర—ఔను, నూన్పరాని గాయము తగిలినది.

ఇరా—అకటా! నేఁ డెంత దుర్దినము!

విక్ర—అయ్యో, అయ్యో, నాకీర్తి నేలఁబడినది. నా పరువు బ్రద్దలైనది. నాప్రతిష్ఠ పాడైనది. నాగౌరవ మంతరించినది. నా వాసి మాసిపోయినది. ఇంక నే నేమి చేయుదును? కీర్తి; కీర్తి. నాసత్కీర్తి నాకుఁ గాకుండ నశించిపోయినది.

ఇరా—ఇంతేనా? నీశరీరమున నేదైన గాయ మయిన దేమో యని తలంచితిని. అట్లుగానిచోఁ బరవాలేదు. కీర్తియనునది యుబుసు పోని సోమరులు తెచ్చిపెట్టుకొన్న యాటోపము.

గీ॥ కీర్తి కీర్తి యటంచును గేక లిడెదు
మాటమాత్రమె యిది వట్టిబూటకంబు
వ్యర్థులకుఁగూడఁ బలుమాఱు వచ్చుచుండు
పాటిపోవు నొకప్పు డకారణముగ.

దానికై నీవు చింతింపఁబనిలేదు. నీయంతట నీవు పోయినదని చెప్పుకొనుటతప్ప నిజముగాఁ బోయిన దేమి

యును లేదు. ఏమి విక్రమా, అటులఁ జూచెదవు? ప్రభువును మరల లోఁగొను మార్గము యోచింపలేవా? ఇపు డేదో కోపవశమునఁ జేసినశిక్షకుఁ బరిహార మాతని యొద్దలభింపదందువా ? సింహమును బెదరించు తలంపుతోఁ గుక్కను గొట్టినట్లు తాను చండశాసనుఁడ నని యీ దేశమునఁ బ్రకటించుటకు నిన్ను దండించెనేగాని నీపైఁ గినుకవలనఁ గాదు. కోపము శాంతించినపిదపఁ బోయి వేడుకొంటివేని యాతఁడు ప్రసన్నుఁ డగును. నీపదవి మరల నీకు లభింపఁగలదు.

విక్ర—ఔను. ఆతఁడు కాలదన్నినను సరియే, ఆతనిపాదములపైఁబడి గట్టిగాఁ బట్టుకొందును. అక్కటా! యెట్టిదుష్కార్య మాచరించితిని! ఉదారశీలుఁ డగుప్రభువునొద్ద విధ్యుక్త మాచరింపనేరక నీచపుఁబను లాచరించి పాపముఁ గట్టుకొని, తప్పఁద్రావి మత్తెక్కి కానిమాట లాడితిని. పోట్లాటఁ బెట్టుకొంటిని. కొట్లాటకు దిగితిని అక్కటా! యెంతలో నెంత వింతజరిగె. నే నిప్పు డేమొగముఁ బెట్టుకొని యాతని కడకుఁ బోఁగలను? ఆహా! యెట్టిగతి సంభవించె! ఇదంతయు సురాపానమాహాత్మ్యమే కదా! ఓ సురాదేవతా! అదృశ్యరూపిణివై నీ విపు డెందు దడఁగియున్నావు! నిన్నుఁ బ్రత్యక్షరాక్షసియని పిలిచినను దప్పులేదు.

సీ॥ ధనవంతుఁ డైనను దారిద్ర్యమున మున్గి
యల్లాడు నిన్నాశ్రయించుకతన
గుణవంతుఁ డైనను గుణహీనుఁడై మట్టుఁ
డైపోవు నీ సఖ్య మబ్బెనేని

ఉ॥ త్తమకులజాతుఁ డున్నతిఁ గోల్పోయి
భ్రష్టుఁడై తిరుగు నిభవుఁడైన
ధీవిశాలుండైనఁ దెలివితేటలు దూలి
వెఱ్ఱివాఁడగు నీవు వెంబడింపఁ
గీ॥ బరిజనుల ఘోరపాపకూపములఁ ద్రోచి
తెన్నుగానక వారలు తన్నుకొనఁగఁ
గని పరిహసించు క్రూరరాక్షసివి నీవు
విలయరూపిణి ! హింస నీ వికటలీల.

ఇరా—విక్రమసింహా ! నీవు మొట్టమొదటఁ దఱుముకొని పోతివే, యాతఁ డెవ్వఁడు? ఆతఁడు నీకే మపకారముజేసె!

విక్ర—ఏమో; నా కిపు డేమియుఁ దెలియదు?

ఇరా—అది యెట్లు నమ్మఁదగును?

విక్ర—ఏమో నామన స్సిప్పు డనేకవిషయములతో నిండి నిబిడీకృతమై యున్నది. అం దొక్కటియు స్ఫుటముగా లేదు. అయ్యో, మైమఱచి మాటాడి యెంత చేటుఁ దెచ్చుకొంటిని. పశుప్రాయునివలెఁ ద్రాగి తందనాలాడి చేతులార కొంపఁ గూల్చుకొంటిని.

ఇరా—నీ విపుడు సరిగనే యున్నావే. స్వస్థత యెటులఁ గలిగెను.

విక్ర—ఘోరరాకాసి, యీసురాదేవి యాగ్రహపిశాచమునకు నాయందు స్థానముఁ గలిగించి తా నింకెక్కడకో దయ చేసినది. నేనో ఆత్మనిందాపరాయణుండనై దినములు గడపవలసి వచ్చినది.

ఇరా—నీవు చాల నీతివేత్తవు. సంగతి సందర్భములఁ బట్టి చూడ నిట్టిపని జరుగకుండిన బాగుండెడిదే. కాని గడచిన దానికై వగచిన ప్రయోజన మేమున్నది? నీవు దానికిఁ బరిహారముసేయు విధము నాలోచింపవలయును.

విక్ర—నా పదవి నా కిప్పింపుమని యాతని వేడుకొందును. అప్పు డాతఁడు "నీవు త్రాగుబోతు" వని పల్కెను. అంతటితో నాకు వేయినోళ్ళున్నను నవి యన్నియు నొక్కమాఱుగ మూతవడిపోవును. మొదట వివేకవంతుఁడ ననిపించుకొని పిదప మూఢుఁడనై తుదకుఁ బశువనై పోతిని. ఇది యంతయు నీ సారాయిమహిమయే. ఒక్కొక్కబుద్ధి కామరూపియగు నొక్కొక్క పిశాచము. ఇది—

చ॥ తొలుత వివేకముఁ దొలఁగఁద్రోసి పశుత్వముగూర్చుఁ బిమ్మటన్
బలము పదమ్ము డుల్చుకొని భ్రష్టునిజేయును వేశ్యమాడ్కి; బం
ధుల హితులన్ జికిత్సకుల దూరము నెట్టును నంటురోగమై
కలధన మెల్ల దోచుకొని గర్వితుఁజేయును దొంగపోలికన్.

ఇరా—అట్లుగాదు, మంచిసారాయము సమయమునుబట్టి వినియోగించిన మిక్కిలి మేలుఁగలిగించును. దానివిషయమై యధిక ప్రసంగము చేయకుము. ఇది నీప్రాప్తము. ఇటు చూడుము. నిన్ను నేను మనసారఁ బ్రేమించుచున్నానని నీవు నమ్ముదువా లేదా?

విక్ర—నిన్ను నమ్మియేగదా నేను త్రాగుబోతునైనది.

ఇరా—నీవేగాదు ఎవరైననుసరే, మెపుడో యొకప్పుడు తొందరగా కుండ నుందురా? దానికేమిగాని, నీ విపుడేమిచేయవలెనో యుపాయము చెప్పెదను వినుము. ఇపుడు నిజముగాఁ బ్రభుత్వముచేయునది శ్యామలుడు కాదు. ఆయనభార్య. ఈవిషయము నేఁ జెప్పనక్కరయే లేదు. నీకే తెలియును. కాఁబట్టి మన మనుకొనుటలోఁ దప్పేమియు లేదు. ఏల యనన, నాతఁ డిప్పుడు ఆయమగారి విలాసంబులోఁ జిక్కియున్నాఁడు. నీ వామెయొద్దకేగి నీసంగతి విన్నవించుకొనుము ప్రార్థేయకనుము. ఆమె నీతోఁ జనవుగా దయతో మాటాడును. పిదప నీయుద్యోగము నీ కామె తప్పక యిప్పింపఁ గలదు. మిగులఁ గనికరముఁ జూపుచు నీవు చెప్పునదెల్ల నోపికతో విని నిన్నాదరించును. నీవు కోరినదానికంటె నెక్కువ సాయము చేయఁజూచును. ఇది సాధ్వీమణియగు నామె స్వభావము. ఆమెభర్తకును నీకును దెగిపోయిన ప్రేమబంధములఁ దిరిగి ముడి వెట్టఁజాలిన దామె యొక్కతెయే.

విక్రి—ఇరావంతుఁడా! నీసలహా మిక్కిలి కొనియాడఁదగినది.

ఇరా—నేను నీయందలి ప్రేమాతిశయముచే హృదయపూర్వకముగ మంచి సలహాచెప్పితిని. పోయి వెంటనే నేఁ జెప్పినట్లు చేయుము, పొమ్ము.

ఇరా—నే నీరాత్రి నిదానముగ నాలోచించి చూచుకొని తెపుదయమున నే దేవిగారికడ కేగి నాపైఁ గరుణింపు

మని బతిమాలుకొనియెద. నాపదవి మరల నాకు లభింప దేని నా కీజన్మపై విరక్తి గలుగును.

ఇరా—ఔను, కాదా మఱి? సేనానీ, ఇంక సెలవు. నేను కాపుండుట కేగవలయును గదా.

విక్రి—ఇరావంతుఁడా! పోయివచ్చెదను. (నిష్క్రమించును.)

ఇరా—నేను మోసము చేయుచున్నానని యిప్పు డెవ్వఁ డనఁ గలఁడు? యథార్థమాలోచించి చూచిన నిది నిజముగా మంచిసలహా. ఈఘూర్జుని వశపఱచుకొనుట కింతకంటె మంచి మార్గ మేమున్నది? ఎందుచేత ననగా సత్కార్యములకుఁ దోడుపడుట యన నామెకుఁ జాలప్రీతి. కాఁబట్టి యిట్టి సందర్భములో నామెసాయము పొందుట సులభము. అడుగుటయే లోపముగాని యడిగినఁ దప్పక చేయఁగలదు. అందులో నిది యామెభర్త చేతిలోనిదే కదా. ఆమె యాజ్ఞాపించిన శ్యాములఁ డిపుడు బ్రహ్మహత్యనైనఁ జేయును. దేని కైనను వెనుదీయక యామె చేతిలోఁ గీలుబొమ్మవలె నాడుచున్నాఁడు. స్వాతంత్ర్యప్రియుఁడై మహాస్వేచ్ఛానువర్తియగు ఘూర్జర ప్రభువు నేఁడు వలపు తీగలచేఁ గట్టుబడి యాఁబోతువలె (?) యెట్లాడించిన నట్లాడుచున్నాఁడు. అతని మేలుఁగీళ్లామెచేత నున్నవి. ఆమె యిష్టమైనరీతి నాతని నడిపింపఁగలదు. ఇన్ని సందర్భములు బాగుగా నెఱింగియున్న నేను, విక్రమునకు మిక్కిలి ప్రయోజనకారి కాఁగల మంచిసలహా నొసంగిన నేను, ద్రోహి నెట్లగుదును? ఘోరదుష్కార్యము లాచరింపఁ

బోవు రాక్షసాధములు కూడ పయికి నావలెనే మృదుల హృదయులట్లు మెలంగుదురు.

ఇపుడీ యమాయకుఁడు కుముద్వతికడ కేగి తన పగవి కొఱకై యామె నాశ్రయించును. ఆమె యాతని పక్షమవలంబించి ఘూర్జునితో వాదించును. అతనిపైఁగల నీచ మగువలపుకతన ని ట్లామె వాదించుచున్నదని నే నాఘూర్జుని చెవిలో నూదెదను. అంతట కారుణ్యావశమున నామె బోధించున దెల్ల నొక్కొక్క విషబిందువై యాతని తలకెక్కును. అతని ప్రేమ యంతయుఁ గ్రోధముగా మాఱిపోవును. ఈ మాయోపాయముచేత నామె సౌశీల్యమె కౌటిల్యముగఁ గానఁబడునటులఁ జేసెద. ఆమె యొక్క యౌదార్యమునుండియే వీ రందఱఁ బూన్చి వేయఁజాలు పెద్దగొయ్యి త్రవ్వెదను.

(ప్రవేశము : రఘుపతి)

ఏమి రఘుపతీ! బాగున్నావా?

రఘు — ఈ వేటకు నన్ను బురిగొల్పితివి; గాని నేను ముందుండి పట్టుకొనుటకుఁ బనికిరాను. అది నాచేతఁ గాదు. నేను వెనుక నిలువఁబడి కేక లిడుటకు మాత్రము పనికివత్తును. నాధన మంతయు ఖర్చుబడిపోయినది. రాత్రి నాకుఁ జావు దెబ్బలు తగిలినవి. ఇంక నాకు బుద్ధివచ్చినది. ఇప్పటికి మిగిలిన నాలుగుడబ్బులైనఁ జేతఁబుచ్చుకొని కాలికి నోటికిఁ గూడ బుద్ధిఁజెప్పుకొని తెల్లవాఱఁగనే రాజధానికిఁ బ్రయాణము సాగించెదను.

ఇరా——ఓర్పు లేనివారెట్టి దురదృష్టవంతులు! గాయము పడిన వెనుక కొంచెముకొంచెముగ మానిపోవునుగాని, యంతయు నొక్కసారిగఁ బూడిపోవునా! మనము మన యాలోచనవలన గార్యసాఫల్యమునకు యత్నించుచున్నాము గాని మాయలు మంత్రములవలన గాదు. కాఁబట్టి కొంత వ్యవధి కావలసియుండును. చూడుము, ఇపు డనుకున్నట్లుగ జరిగియుండలేదా! విక్రముఁడే మోనిన్నుఁ గొట్టినాఁడు. ఆ కొంచెము దెబ్బకే నీ వాతని బదభ్రష్టునిఁ గావించినావు. నా యాలోచనలకంటె ముందు జరిగినవిగాన వివాహమాదిగాఁగల యాతని సౌఖ్యక్రీడల నరికట్టలేకపోతిమి. లేకున్న ముందుకాచినపిందె లీసరికిఁ బండ్లు పండియుండవలసినదే. ఇంకఁ గొంతతడ వోపికపట్టి యుండుము. - ఇదే తెల్లవాఱుచున్నది. ఆనందపారవశ్యమునను గార్యపరత్వమునను గంటలు నిమిషములట్లు జరిగిపోవును. ఇంక నీవు నీబస కేగుము. పొమ్ము త్వరగా పొమ్ము. మిగతవిషయములు తరువాతఁ దెలిసికొనవచ్చును. వెంటనే పొమ్ము. (నిష్క్రమించును.)

ఇరా——ఇపుడు రెండుపనులు జరుగవలెను. ఒకటి, నాభార్య కుముద్వతికడ కేగి విక్రము నుద్ధరింపుమని బోధింపవలెను; రెండవది నే నేగి ఘూర్కనితో విక్రముఁ డాతనిభార్యతోఁ దఱచుగాఁ బ్రసంగించుచున్నట్లు చెప్పి సమయముఁగనిపెట్టి యాతనికిఁ గనఁబఱచవలయు. ఉపాయము పూర్తియైనది. వేడిమీఁద జరుగవలెను. ఆలస్యా దమృతం విషం.

నిష్క్రమించును—తెరపడును.



# ముగ్ధప్రణయము.

## తృతీయాంకము

మొదటి రంగము — కోటవాకిలి ముందర.

[ప్రవేశము: భటుఁడు. విక్రమసింహుఁడు],

విక్ర—ప్రియమిత్రుఁడ వగు నామాట నించుక విందువా, నీవు?

భటు—నీకుఁ బ్రియమిత్రుఁ డెవ్వరో నాకుఁ దెలియదు. కాని నీమాట విందునులే. చెప్పుము.

విక్ర—నీ కొక హూపాయిడబ్బులు ముట్టఁ జెప్పుకుంటాను గాని నీ హాస్యముఁ గట్టిపెట్టి యిటు వినుము. రాణిగారి చెలికత్తె నిదురనుండి మేల్కాంచినదా?

భటు—ఆ, మేలుకొనియే యున్నది.

విక్ర—అటులైన విక్రమసింహుఁడు నీతోడ మాటలాడఁ దలఁచి వచ్చియున్నాఁ డని యామెకుఁ దెలిపెదవా?

భటు—నేను చెప్పుటమట్టుకు చెప్పెదను. ఆమె వచ్చునో రాదో?

విక్ర—నీవుపోయి చెప్పుము. చాల బుద్ధిమంతుఁడవు.

(భటుఁడు నిష్క్రమించును.)

[ప్రవేశము : ఇరావంతుఁడు.]

విక్రి—ఇరావంతా, సమయమునకే వచ్చితివి.

ఇరా——అయితే నీ వీరాత్రి పరుండనే లేదన్నమాట.

విక్రి—లేదు. మనము వెళ్ళునప్పటికే తెల్లవాఱ వచ్చె గదా. మిత్రమా, యిప్పుడే నీభార్యకొఱకుఁ గబురంపి తిని. కుముద్వతీదేవితో మనవి చేసికొనుటకుఁ దగిన యవకాశముఁ గల్పింపుమని యామెతోఁ జెప్పుదును.

ఇరా—నే నిప్పుడేదో మిష గల్పించి శ్యామలు నావలికిఁ దీసికొనిపోయెదను. అంత మీ రిరువురు యథేష్టముగ మాటాడుకొనవచ్చును.

విక్రి—నాకీసాయముఁ జేసిన నీకు వేయిదండములు పెట్టెదను.

(ఇరావంతుఁడు నిష్క్రమించును.)

దమ—(ప్రవేశించి) ఆర్యా విక్రమసింహా! గతరాత్రి మీకుఁ గలిగిన సంతాపమునకే నెంతయుఁ జింతించితిని. కాని మరల మీపదవి మీకు లభింపఁగల దని నమ్ముచున్నాను. ప్రభువుగారు నాతనిభార్యయు మీవిషయమై రాత్రి మాటాడుచుండిరి. ఆయమ మీపక్షమూని వాదించుచుండెను. అందులకు రాయలు మీచే దెబ్బలుతిన్న వాఁ డీర్ష్యవమునఁ బ్రఖ్యాతుఁ డనియు నిట్టినేరము లూరక పోనీరాదని యిట్లు చేయవలసివచ్చెనుగాని మీపైఁ గ్రోధముచేఁ గాదనియుఁ బలికెను. మరల సమయముఁ జూచి మీయుద్యోగము మీకిత్తు ననికూడ ననుచుండె.

విక్ర—సంతోషము. అయినను నేను కుముద్వతీదేవిగారితో నొకపరి యేకాంతమున నాసంగతి విన్నవించుకొనఁ దలఁచితిని. ఇది నీకు మంచిదే యనితోఁచినఁ దగినసమయముఁ జూచి నాకుఁ జెప్పవలయును.

దమ—అటులైన నిప్పుడే రమ్ము. నీమనసు విప్పి చెప్పుకొనుటకిదే యదను.

విక్ర—నేను నీమే లెన్నటికి మఱచిపోను.

(ఇరువురు నిష్క్రమింతురు)

(తెరపడును.)

(రెండవరంగము - కోటలో నుద్యానవనము)

[ప్రవేశము : కుముద్వతి, దమనిక, విక్రముఁడు.]

కుము—విక్రమా, నా శక్తికొలఁది నీకు మేలుచేయఁ దలఁచితిని. అందుకు సందేహము లేదు.

దమ—చేయుము, అమ్మా, అట్లే చేయుము. ఇందువలన నా భర్తకూడ ఖిన్నుఁడై యా యాపద తనకే వచ్చినట్లు భావించి విలపించుచున్నాఁడు.

కుము—ఔను. అతఁడు చాల మంచివాఁడు. విక్రమా, నీకు సందేహమక్కఱలేదు. నీకును నా భర్తగారికిని మఱల నెప్పటియట్లుండునట్లు చెలిమి గూర్చెదను. భయము లేదు.

విక్ర—చల్లనితల్లివి. ఈభారము నీపైనఁ బెట్టుచున్నాను. నీట ముంచినను సరే. పాలముంచినను సరే. నాకు మేలు కలిగినను గలుగకున్నను నేను మీకు నమ్మికబంటునే.

కుము—ఔను. నే నెఱుంగక పోలేదు. నీవు నా భర్తగారికిఁ జిరకాలమిత్రుఁడవు. ఆతని యెడ నీకు భయభక్తులు మెండు. వా రైనను నిన్నెక్కుడుకాల మెడ బాసియుండఁబోరు.

విక్రి—కాని, అమ్మా! నేను నాయుద్యోగమం దుండక మఱొక్కఁ డందుఁ బ్రవేశించెనేని, యాక్రొత్తవాఁడు తన కీయుద్యోగము శాశ్వతముగా నుండఁగలందులకై దగ్గఱఁ జేరి యేవో కొండెములు పలికి నాపై మనసు విఱుగునటులఁ జేయఁజూచును. అదియుఁగాక, రోజులు గడచినచోఁ బ్రభువుగారికి నాపూర్వపుసేఁత లెల్ల మఱపుఁదగిలిపోవచ్చును.

కుము—ఇంక నీవిషయమున సంకోచపడకుము. నీపదవి నీకుఁ దప్పక యిప్పించెద నని యీ దమనిక యెదుట నే నొట్టుపెట్టుకొనియెద. నేను తలపెట్టిన కార్యము మతురములతో నిర్వర్తించి తీరుదును.

మ॥ అనుమానింపఁగ నేల విక్రమనిధీ! యశ్రాంతము న్నే నిఁకన్
విను, నీవృత్తిపై జీవితేశ్వరుచెవిన్ వేమార్లు మ్రోగింతు భో
జనవేళన్ బవళించియున్న మఱియే సద్వృత్తియం దుండినన్;
వినలే కాతఁడు నిన్ను నీపదవికిన్ వేవేగ రప్పింపఁగన్.

కావున విక్రిమా, నీ వింకఁ జింతదక్కియుండుము. వేయిమాట లేల? మీప్రభువు నీకుద్యోగ మీయకుండ జీవించుట కష్టతరమని తలఁచునట్లుగఁ జేసెదను.

(ప్రవేశము : శ్యామలుఁడు, ఇరావంతుఁడు కొంచెము దూరమున)

దమ—అమ్మా, ప్రభువర్యు లిట కరుదెంచుచున్నారు.

విక్రి—అమ్మా, నే నింక సెలవుఁ గైకొనియెద.

కుము—ఏమీ? నీ విచ్చటనే యుండుము. నీయెదుటనే మా టాడెదను.

విక్రి—అమ్మా, నామన స్సిపుడు సరిగా లేదు. నా కేమియుఁ దోఁచకున్నది. నే బోయెదను.

కుము—అట్లయిన నీయిష్టము వచ్చిన ట్లాచరింపుము.

[విక్రముఁడు నిష్క్రమించును.]

ఇరా—ఆ, అదే నాకు సరిపడదు.

శ్యామ—ఏమంటివి?

ఇరా—ఏమియు లేదు, ఆ! కాదు కాదు.

శ్యామ—అటు చూడుము. నాసతీమణి యొద్దనుండి యాంపోవు చున్న వాఁడు విక్రముఁడు కాడా?

ఇరా—ప్రభూ, విక్రముఁడా! నే నమ్మజాలను.

శ్యామ—ఆతఁడే యని నానమ్మకము.

కుము—(ఎదురువచ్చి) హృదయేశ్వరా! నే నిప్పుడే మీ కోపాగ్ని కింధనంబైన యా దురదృష్టునితో మాటాడు చుంటిని.

శ్యామ—ఎవ రాతఁడు?

కుము—ఏమి? యెఱుఁగనే యెఱుఁగరా?

చం॥ ఎఱుఁగనివానిపోల్కి నిటు హేళనజేయుట న్యాయ్యమౌనె మీ
చిరతరమిత్రునిఁ సుగుణశేఖరునిఁ మనమధ్యనే సమున్
బఱపిన ధీవిశాలుని యవక్రపరాక్రము విక్రమాంకితున్
మఱచితె యింతలోనె జనమాన్యచరిత్ర! నిజంబుఁ బల్కుమా.

ఆతఁడు నిజముగ మీయెడ నేదేని యపరాధముగా వించియున్న నది పొరపాటువలన సంభవించియుండును. అంతేగాని యాతనికి మీయెడ భయభక్తులం దెంతమాత్రము లోపము కలిగికాదు. నేను గట్టిగా నొక్కి చెప్పఁగలను. కావున నాయందు దయయుంచి యాతని యపరాధము మన్నించి వానిని మరలఁ జేకొనుఁడు.

శ్యామ—ఆతఁ డిప్పు డెక్కడ కేగినాఁడు?

కుము—ఆతఁడు దుఃఖాతిరేకమున శిరము వంచుకొని మీ మోముఁ జూడనోడి తన దీనచరిత్ర నాతో విన్నవించుకొని యిప్పుడే యిటనుండి వెడలినాఁడు. ప్రియా, ఆతని మరలఁ బిలిపింపుము. ఆతనికై నే నిదే ప్రార్థింపుచుంటిని. ఆతఁడు చాల మంచివాఁడు.

శ్యామ—ప్రేయసీ, యిప్పు డామాటఁ దలపెట్టకుము. తరువాత నడుగుదువు గానిలే.

కుము—అనగా స్వల్పకాల మాగి యడుగవచ్చునా?

శ్యామ—ఎంతశీఘ్రముగ నైన నీ కంతసంతోసముకాఁబోలు!

కుము—ఈ రాత్రి భోజనసమయమునఁ బ్రస్తాపింతును?

శ్యామ—వలదు. ఈ రాత్రికి వలదు.

కుము—పోనీ, రేపు మధ్యాహ్నము భోజనవేళనో?

శ్యామ—రేపు మధ్యాహ్నము నే నింట భుజింపను. కోట వెలుపట సేనానులఁ గలియఁబోవవలయును.

కుము—కాకున్న రేపు రాత్రికా, లేక యెల్లుండి యుదయమా? అదియుఁ గాకున్న నెల్లుండి రాతిరియా? ఏదో

రొక సమయము నియమింపుఁడు. కాని మూఁడు నాలుగు దినములు మించి పోనీయవలదు. అతఁడు చాలఁ బశ్చాత్తప్తుఁడై యున్నాడు. అదిగాక యితరుల భయపెట్టుట కొఱకంగిన శిక్షయేగాని లేకున్న యాతఁడొనర్చిన మహా దోషము మాత్రి మేమున్నది ? ... ... ...

ఇంతకునాతని నెప్పుడు రమ్మనిమెదరు ? దయచేసి సెలవిండు. మీ మనసితిఁ జూడ నాకుఁగడు నబ్బురముగా నున్నది. నన్ను మీ రేమైన నడిగిన నే ని ట్లనుమానిం చుచు నూరకుండఁగలనా ? అందును, నేను మొట్ట మొదట మిమ్ముల వివాహమాడుటకు సందేహించినపుడు నన్ను త్సాహ పఱచి యొడఁబఱచిన సత్పురుషుఁడు గాడా విక్రి ముఁడు? నా మాట నమ్ముఁడు.

శ్యామ—అబ్బా, చాలును. ఆతనినీ యిష్టము వచ్చినపుడు రానిమ్ము. ఇంక చాలు నీ గొడవ.

కుము—నేను ప్రేమతో నడిగిన కోరికకు బదులు చెప్పురీతి యిదియేనా ? అదియు మీ కప్రియమగున దేదియుఁ జేయుమనలేదే.

ఉ॥ కమ్మనిపిండివంటలను గాటముగా భుజియింప వేడినన్
కొమ్మని రమ్యసుందరదుకూలము లిచ్చి ధరింపఁగోరినన్
నమ్మతిఁ జూపకుండుటకు సాధ్యమె? యట్టిదిగాదె! మీదు నె
య్యమ్ము సముద్ధరించుకొనుమంచు హితంబు వచింపు టారయన్.

కాఁబట్టి మీ కత్యంత సౌఖ్యప్రద మగు కార్యము నాచరింపుమనియేగదా నేనుకోరినది. ఈ భాగ్యమున

కింతటి తడఁబాటు, యింతటి దీర్ఘాలోచనయుఁ గావలసి వచ్చెనా? ఇం దేదో వైపరీత్యము న్నది?

శ్యామ—నీమాట నే నేదియుఁ గాదనను. కాని, దయయుంచి నన్నిపుడు బాధింపక విడిచిపెట్టుము.

కుము—నేను మీమాట కెదురాడఁగలనా? సెలవు గైకొని యెద.

శ్యామ—కుముదా! నే నిపుడే మరలి నీదరికి వచ్చెదను.

కుము—ఎట్లైనను నేను మీకు విధేయురాలనే. మీయిష్టము వచ్చిన ట్లాచరింపవచ్చును. దమనికా! పోవుదము పద

(ఇరువురు నిష్క్రమింతురు)

శ్యామ—ఆహా! ఎంతటి మృదులహృదయ! నిన్ను మనసారఁ బ్రేమించి యానందింప నేరకున్న నాజీవితము నిరర్థకము. నీపైని ప్రేమ మంతరించినమరునిమిషము నా కీలోక మంధకారబంధుర మైపోవును.

ఇరా—ప్రభువరా!

శ్యామ—ఇరావంతా, ఏమంటివి?

ఇరా—మీరు దేవిగారిని బరిణయమాడ యత్నించునపుడు మీ ప్రేమమును గూర్చి విక్రముఁ డెఱింగి యుండెనా?

శ్యామ—ఔను. అతఁడు మొదటినుండి కడవఱకు నెఱుంగును. ఇపుడా సంగతు లెందులకు?

ఇరా—నా కేదో యొక యోచన స్ఫురించినందువలన నడిగితిని. మఱేమియు లేదు.

శ్యామ—ఇరావంతుఁడా, ఏమి యోచన ! నీ కిపుడు స్ఫురణకు వచ్చిన దేద్ది ?

ఇరా—అతని కామెతోఁ బరిచయ మున్నదని నే నిదివఱకెనుఁగొనలేదు.

శ్యామ—బాగుగాఁ బరిచయ ముండెను. అనేక సారులు మా యిరువురమధ్య రాయబారములఁ గూడ నడిపెను.

ఇరా—అటులనా ? (తల పంకించును.)

శ్యామ—ఔను నిజమే. అం దేమైన విశేష మున్నదా యేమి ? ఆతఁడు సుశీలుఁడు కాఁడా ?

ఇరా—ఆ, కాకేమి? సుశీలుఁడే, ప్రభూ. సుశీలుఁడే- నాకుఁదెలిసినంతవఱకు.

శ్యామ—ఔను, ఆతఁడు ముమ్మాటికి సుశీలుఁడే.

ఇరా—ఔను, ప్రభూ, సుశీలుఁడే; సుశీలుఁడేనాకుఁ దెలిసినంతవఱకు.

శ్యామ—నీ యాలోచన యేమని !

ఇరా—ఆలోచనయే దేవా ? ఆలోచనయే.

శ్యామ—ఏమిది ? నీకు మతి తప్పుచున్నదా యేమి?

చం॥ పలికినమాటయే పలికి స్పష్టత లేని విధంబు దోఁపఁగా
నలజడి జెందుచుండియు హృదంతరభావతరంగమాలికల్
వెలువడనీక లో నడఁచి వేసెదు; కారణ మేమి? సర్వముం
దెలియఁగఁ జెప్పు నాయెడల నీకనురాగము నిల్చియుండినన్.

ఇంతకుముందుగనే విక్రముఁడు నా సతిని వీడి చనుచున్నపుడు నా కట్టిది సరిపడ దంటివి. అందు నీకుఁ గిట్టనిదేది?

నావివాహమున కాతఁడు రాయబారములు జరిపె ననగా "అటుల నా" యని తలపంకించితివి. బొమలు ముడివడ నేదో రహస్యము జ్ఞప్తికి వచ్చినటులఁ దోఁపజేసితివి. ఇన్నిటికి నీహృదయగతమగు తలంపుల నిప్పుడే నా కెఱింగింపవలయును.

ఇరా—ప్రభువరా, నాకు మీయెడ భక్తి శ్రద్ధలు గలవని మీకు నమ్మకమేనా?

శ్యామ—అగును. అట్లే యనుకొనుము. నీవు ప్రతిమాటయుఁ జక్కఁగ యోచించి తూఁచినట్లు మాటాడుదువు. కాఁబట్టి యీ నీసంకోచము నాకు భీతావహ మగుచున్నది. నీచులగువారియెడ నిట్టివి చూపట్టిన వారి దుస్స్వభావజన్యములని త్రోసివేయవచ్చును. అటుగాక సజ్జనునియం దిట్టివి గాన్పించుట విచారణీయము. నీవు దుర్భరమనస్తాపమును బలవంతముగ నడఁచియుంచి పైకేదోరీతిఁ గప్పిపుచ్చి మాటాడఁ జూచుచున్నట్లు స్పష్టమగుచున్నది.

ఇరా—విక్రముని విషయములో ఆతఁడు సజ్జనుఁడనియే నా తలంపు.

శ్యామ—నేనుగూడ నట్లే తలంచుచున్నాను.

ఇరా—మానవుల హృదయములు రూపముల కనుగుణముగా నుండవలయును.

శ్యామ—ఔను సత్యమే.

ఇరా—అట్లయిన విక్రముఁడు నిజముగా సజ్జనుఁడే యైయుండవలెను.

శ్యామ—ఏమి నీమాటలు! నీమనస్సునం దేమో యున్నది. నీవు దాఁపఁజూచుచున్నావు. అది యెంతమాత్రము పనికిరాదు. నీతలంపు లెట్టివైనను సరియే తత్క్షణమే నాతోఁ జెప్పితీరవలెను.

ఇరా—మహాప్రభూ! ఈ దాసుని మన్నింపుఁడు. నే నెంత మీసేవకుఁడ నైనను, నీవిషయమునఁ గుఱ్ఱిచ్చిగుఱ్ఱిచ్చియడుగకుఁడు. బానిసలకుఁగూడ మనోభావములందు స్వేచ్ఛ కలదు. ఇప్పు డవి చాల దుష్టపథంబునఁ బడిపోవుచున్నవి. ఎంతటి నిరంతరన్యాయపరిపాలనాకుతూహలుఁ డైనను, యొకప్పుడైనఁ జెడ్డతలంపుల కెడ మీయకుండునా!

శ్యామ—నీతలంపులు నాకు రుచింపవని తలంచి నాకుఁ జెప్పకుండ దాఁచుటవలన నీవు మఱింత తప్పునే చేయుచున్నావు.

ఇరా—గీ॥ ఎప్పుడైనను నాకర్మ మేమొగాని
పరులయం దుండునుగుణసంపదలకంటె
పరులదోషంబులే గానఁబడును నాకు
దోమలకు మురుకాల్వలే దొరకునట్లు.

అయినను నాకుఁ దోఁచినది పలికెద వినుఁడు. కాని యివి యెల్ల నింతటితో సత్యమని మీరు నమ్మఁగూడదు. చూచియుఁ జూడకయే చెప్పుమాటలు నమ్మి తొందరపడి మీ రేమియుఁ జేయఁగూడదు. అబ్బ! నే నీ పాడు చింతలు మీ కెందులకుఁ దెలుపవలయును?

ఇది మీకేవిధముగను లాభకారి గాకుంట యటుండ వృథా మనోవేదనకుఁ గారణ మగునేమో యని భీతిల్లుచున్నాఁడను. మఱియు దీనివలన నాకు రాఁబోవు కీర్తి ప్రతిష్ఠలును లేవు. ఇంక నే నేల చెప్పవలయు?

శ్యామ—నీమాటలు నా కర్థ మగుటలేదు.

ఇరా—మహాశయా, ఏమియును లేదు. ఇటు వినుఁడు.

గీ॥ ద్రవ్య మనునది నీచపదార్థ మరయ
జంకుగొంకును లేకయె సంగ్రహించి
నట్టివారల నెల్లర నాశ్రయించు
వగవఁబనిలేదు దాని గోల్పడితిమేని
కాని సమ్మణోపార్జితమగు కీర్తి యట్లుగాదు.

గీ॥ పుడమిజనుల కందఱ కిది భూషణంబు
పారవేసినవాఁ డధఃపతితుఁ డగును
అపహరించిన వాని కావంత యేని
ఫల మొసంగదు తత్పాపఫలమెగాని.

శ్యామ—ఈ వ్యర్థప్రసంగముతోఁ గాలయాపన సేయక నీ యూహ లేవో చెప్పుము. ఇప్పుడే చెప్పితీరవలెను.

ఇరా—నాహృదయము తీసి మీయఱచేతఁ బెట్టినను నాభావములు మీ రెఱుంగలేరు. నామనస్సు నాస్వాధీనములో నున్నంతవఱకు నేఁ జెప్పనే చెప్పను.

శ్యామ—నీ మొండితన మాశ్చర్యకరముగా నున్నది.

ఇరా—ప్రభువరా, ఈర్ష్యాపిశాచము బారిఁబడక, జాగ్రత్తగాఁ గాపాడుకొనుఁడు. ఆ భూత మెవ్వరి నాశ్రయించి పొట్ట

బోసికొనుచుండునో, వారితోనే యెక్కసక్కెము లాడు చుండును. ఏదైనఁ గష్టము సంభవించిన నది తన కర్మ ఫల మని నమ్మి తన వైరిని దూఱకుండువాఁ డెల్లప్పుడు నిర్మలానంద మనుభవించును. అటుగాక ప్రతివానితోఁ బైకి మాటాడుచు లోపల ననుమానించుచుండు మూఢుఁ డెప్పుడును మనశ్శాంతినిఁ బొందనేరఁడు.

శ్యామ—ఛీ! ఏమియవస్థ యిది. ఈ మెట్టవేదాంతములతో నన్నువిసిగించుచున్నావు.

ఇరా—ప్రభూ,

గీ॥ ధరణి సంతుష్టహృదయుఁడై తనరువాఁడు
ప్రబలనిర్ధనుఁడయ్యు సౌభాగ్యయుతుఁడె;
సంతతదరిద్రభయభ్రాంతస్వాంతునికడ
నిశ్చలాక్షీణసంపదల్ నిష్ఫలములె.

ఓ భగవంతుఁడా, మాలో నెవ్వరియందును నసూయ జనింపకుండుఁ గాక.

శ్యామ—ఏమిటీ యవకతవకమాటలు. నే నేమైన దిన దినము నీర్ష్యావిష్టుఁడ నగుచున్నా నని తలంచితివా యేమి? నా కొక్కసారి సందేహము కలిగిన మఱుక్షణముననే దానిని నివారణజేసికొనియో, లేక దృఢపఱచియో తీరెదను. లేనిపోనియనుమానములకుఁ జోటిచ్చి నా హృదయగతముల మాటిమాటికి మార్చుకొను నజ్ఞుఁడను గాను. చపలచిత్తుఁడఁగాను; నాసతీమణినిగూర్చి నాకసూయ యెందులకు? ఆమె సుగాత్రి యనియు కలకంఠి యనియు

నీలవేణి యనియు, పంకజాక్షి యనియు మృదుభాషిణి యనియు బంధుప్రియ యనియు నెవరేని పలుకుచుండిన నా కసూయ యెందులకు? సంతోషమే కలుగును. సుగుణవతులం దీగుణములు పసిడికిఁ బరిమళ మబ్బినట్లు మఱింత శోభ నాపాదించును. అంతకంటె నానతివిషయమై చెప్పఁదగినది మఱేమైనఁగలదా? అందుచే నే నెంత బుద్ధిహీనుఁడ నైనను నామెశీలమునుగూర్చి యను మానింపఁజాలను. ఏలయన నామె స్వయముగ నన్నుఁ గన్నులార జూచి వరించినది. ఇరావంతుఁడా, యిటు వినుము. నేను స్వయముగఁ జూడని దేమియు నమ్మఁజాలను. మొదట ననుమానము తగిలెనా తప్పక ఋజువై తీరవలెను. ఋజువైన వెంటనే యేదో యొకటి తేలవలసినదే. నాయనుమానము ధ్రువపడు నెడల నాప్రేమ యెల్ల నాక్షణమునుండి నశించిపోవలసినదే.

ఇరా—నా కిదిచాలసంతోషకరము. ఏలయన నా కిపుడు నిష్కళంకభావముతో మీ రెుడఁగల భక్తి విశ్వాసముల వ్యక్తపఱచుటకు సమయమే తెంచినది. ఇఁకఁ జెప్పెద నాలకింపుఁడు. కాని యిప్పుడే నే నేమియు నిదర్శనము లీయఁజాలను. ఒకటి మాత్రము చెప్పెదను. మీభార్య నొకకంటఁ గనిపెట్టి యుండుఁడు. ఆమెకును వికరమునకును గల సంబంధమును జాగ్రత్తగాఁ బరిశీలింపుచుండుఁడు. నిష్కళంకభావముతో, నిశ్చలదృష్టులతో, శాంతముగా యథార్థముఁ గనిపెట్టుచుండుఁడు. తొందరపడకుము; నిదానిం

చుము. నాకు మాదేశస్థితిగతులు బాగుగాఁ దెలియును. ఈ కాలఁపువనితలు తమ దుశ్చర్యలు భర్తల కంటఁ బడకుండిన నంతియ చాలు నని తలపోయుచుందురే కాని, యీశ్వరుని గాని తమయంతరాత్మనుగాని పాటించరు.

శ్యామ—నీమాటలు నిక్కువములేనా?

ఇరా—ఈ యమ నిన్ను వివాహమాడుటలో నామె తండ్రిని మోసగించి యుండలేదా! ఆమె తండ్రియెదుట నున్నపుడు నిన్నుఁజూచి భయపడుదానివలె నటించి తుదకు నిన్నుఁ బ్రేమించలేదా?

శ్యామ—ఔను ఆమాట నిజమే.

ఇరా—చిన్నతనముననే సొంతతండ్రినే యారీతిగఁ గనుల గప్పుటచేత నేగదా యాతఁడు వెఱఁగంది మందులని మాకులని పలవించినాఁడు పాపము. అక్కటా! నే నిపుడు చాల నింద్యుఁడ నగుచున్నాను. మీయందలి ప్రేమాధిక్యమున నిట్లని చెప్పవలసివచ్చెను. నన్ను మన్నింపుము.

శ్యామ—నే నెల్లపుడు నీకుఁ గృతజ్ఞుఁడను.

ఇరా—అక్కటా, అప్పుడే మీ యుత్సాహము తగ్గిపోవుచున్నది.

శ్యామ—లేదు. ఇసుమంతగూడఁ దగ్గిపోలేదు.

ఇరా—అయ్యో, నే నిప్పుడేమి చేయుదును. నీయుత్సాహము భంగపడినట్లు స్పష్టమగుచున్నది. కాని నా చెప్పిన దంతయు, మీయందలి ప్రేమాతిశయముచేఁ జెప్పబడినదే యని మీ రెఱుంగుదురు. అయినను నాపలుకులు

మీహృదయము సోఁకినవి. కాని నామాటలవలన నించుక యనుమానము మనసున నుంచుకోవలసినదేగాని, యింత కంటె నెక్కువ గ్రహింపరాదని మనవి చేయుచున్నాను.

శ్యామ—సరే, ఆలాగే.

ఇరా—ఒకవేళ నట్లు చేసితిరేని నేను కలనైనఁ దలంపని దుష్కర్మములకు నాపలుకు లాధారము లగునేమో యని భీతిల్లుచున్నాను. అయ్యో! విక్రముఁడు నాకూరిమి చెలికాఁడుగదా. అక్కటా, ప్రభూ! మీ మానసము చలించినది.

శ్యామ—లేదు. చలించలేదు. కుముద్వతీదేవి సాధ్వియనియే నానమ్మకము.

ఇరా—ఆమె సర్వదా యటులనే యుండుఁగాక. ఇట్టి నిశ్చయముతోనే మీ రిరువురు చిరకాలము జీవించు నట్లీశ్వరుఁ డనుగ్రహించుఁగాక.

శ్యామ—అయినను మానవప్రకృతి చంచలముగదా.

ఇరా—ప్రభూ, ఇంకొక్కమాట యున్నది. దానినిగూడఁ జెప్ప సాహసించుచున్నాను. అదేదనఁ దనజాతివారిలోఁ, దనసాటివారియిండ్లలో వన్నెచిన్నెలుగల వయసుకాం డ్రెందఱో యుండ వారిని బోనాడుటఁ చూడ, నీమె తలంపు లసాధారణమైనవని వ్యక్తము కాకపోదు. కాని నన్నుఁ గ్షమింపుఁడు, నే నేమియు నిదమిత్థమని నిర్ణయింపఁ జాలను. — ఒకవేళ జాగ్రత్తగా నాలోచించియే యామె తనదేశజులకంటె మీరే యుత్తము లని మిమ్ముఁ జేపట్టి

యుండనోపు. అట్లయినఁగూడ నిటీవలఁ బశ్చాత్తాపపడి యుండవచ్చును గదా.

శ్యామ—ఇరావంతుఁడా, ఇంకఁ జాలు నిప్పటికి. నీ కింక నెక్కుడు విశేషము లేమైనఁ గానుపించిన, నాకుఁ దెలుపుము. నీ భార్యతో నామెను గనిపెట్టియుండు మని చెప్పుము.

ఇరా—ప్రభూ, నే నింక సెలవుఁ గైకొనియెద.

(నిష్క్రమణము.)

శ్యామ—అక్కటా, నే నెందులకు వివాహమాడితిని? ఈ సత్పురుషున కింకను నెక్కువవిశేషములే తెలిసియుండ వచ్చును. కాని నాయెదుటఁ జెప్ప సాహసింపఁ జాలకున్నాఁడు.

ఇరా—[తిరిగివచ్చి] ప్రభూ, ఈ విషయమై, మీ రూరక యాలోచించుచుండవల దని నేను ప్రార్థించుచున్నాను. మీ కెందులకు. మీ రూరకుండుఁడు. అంతయుఁ గాలమే తీర్పఁగలదు. ... ... ... విక్రముఁడు సేనానాయక పదవి కెంతయుఁ దగినవాఁడు. కాఁబట్టి యాతనిపదవి నాతనికిఁ దిరిగి యిచ్చివేయుటే యుత్తమము. కాని కొన్నినా ళ్లాతని దూరముగ నుండనిచ్చిన నాతనిచారిత్రముయొక్క నిజస్థితి బోధపడఁగలదు. మీ యిష్ట మాలోచించుకొనుఁడు. అయితే యొక్కసంగతి మాత్రము కనిపెట్టుచుండుఁడు. మీ భార్య పట్టుదలతో నాతని విషయమై పలుమారు వాదించెనేని యందుండి కొంతవిశద

పడఁ గలదు. ఈ లోపల నాకు మిగుల భయము గలుగు చున్నది. కాని దయచేసి యామెగారితో మాత్రము యథాప్రకారముగ మెలంగుచుండుఁడు.

శ్యామ——నీ కావిషయములో భయ మక్కరలేదు.

ఇరా——నే నింక సెలవుఁ గైకొనియెదను.

[నిష్క్రమించును.]

శ్యామ——ఈతఁడు సత్పురుషుఁడు. జాగ్రత్తగఁ బరిశీలించి మానవులస్వభావము గుర్తించు నేర్పుఁగలవాఁడు. ఈ మాట నిజమై కుముద్వతి దుశ్శీలయే యైన నాహృదయము భగ్నమైపోయినను సరే విసర్జించివైచెదను. నేను చూడ నల్లనివాఁడను. తళుకుబెళుకువిటకాండ్రవలె, మంజుభాషలు, నర్మోక్తులు నాఁ చేఁతగావు. మీఁదుమిక్కిలి వయసుమీఁరినవాఁడను. ఆమె నన్నుఁ ద్రోసివేయఁజూచిన నివి కారణములు కాఁజాలవా? ఇంక నామనస్సునకు శాంతి లేదు. ఈ తుచ్ఛురాలిని సంహరించియే యాత్మశాంతిఁ జేసికొనవలయును. ...... ఛీ! ఈ వివాహబంధ మెంతటి దుఃఖకరము! దీనివలన భార్యను జూచి "ఈ పూఁబోఁణి నాది" యని నోటితోఁ జెప్పుకొన వచ్చునేగాని వారిరుచులకు బాధ్యత వహింపఁ జాలముగదా! నాప్రేమంపు వస్తు వన్యులకు సౌఖ్యదాయి యైనదని తెలిసికొనుటకంటెఁ గప్పనై పాడునూతఁ బడి చచ్చుట మేలు. ఎప్పుడును మహనీయులకే యిట్టి పాట్లు దాపరించుచుండును. ఈవిషయమున రాజులకంటె బీదకాపులే యెక్కువ

సౌఖ్యవంతులు. ఏదో యింత పేరుప్రతిష్ఠలతో బ్రతుకఁ దలఁచియుండ నిట్టిపిశాచములు దాపరించుట గ్రహచారము. అక్కటా, అవిశ్వాసిని యగు భార్యతోడి కాపురము సేయుటకంటె మరణమే వేయిమడుంగు లెక్కువ సౌఖ్యదాయకము. అదుగో, ఆమె యిటేవచ్చుచున్నది.

ఆహా! ఏమి యీ మాయాప్రపంచము! ఈమె యేమి! దుశ్శీల యగుటయేమి! లోకములు తలక్రిందులు గావా. అట్టిమాట నే నెంతమాత్రము నమ్మఁజాలను, నమ్మఁజాలను.

[ప్రవేశము : కుముద్వతి - దమనిక.]

కుము—మనోనాయకా! శ్యామలరాయా! భోజనమునకు వేళ కాలేదా! ఇంకను నాలసించెద రేల? మీచే నాహూతులైన నాయకులు విచ్చేసియున్నారు.

శ్యామ—ఔను, నా దే లోపము.

కుము—నాథా! ఇట్టిహీనస్వరమున మాటాడెద రేల? శరీర మారోగ్యముఁ దప్పెనా?

శ్యామ—నాకుఁ దలనొప్పి యెత్తుచున్నది. ముఖ మూడిపడుచున్నట్లున్నది.

కుము—అయ్యో, తెల్లవారులు నిదుర లేనందున వచ్చియుండవచ్చును. కట్టుఁగట్టెద నిటు రండు. గడియసేపులో మాయమై పోఁగలదు.

[అని చేతిరుమాలుతోఁ గట్టు కట్టఁబోవ నది చాలకపోవును.]

శ్యామ—ఈచేతిరుమాలు చాలదు. మిగులఁ జిన్నది.

ఇంక లోని కేగుదము రమ్మి.

(అని వదలివేయ కుముద్వతి క్రిందికిఁ ద్రోసివేయును.)

కుము—అయ్యో, మీ కీ పాడుతలనొప్పి యెందుండి వచ్చె. నాకైన రాకపోయెనే.

(ఇరువురు నిష్క్రమింతురు.)

దమ—బలే, బలే! ఈచేతి రుమాలు నా కిపుడు దొరకినది. పరమానందముగా నున్నది. ఇది మా కుముద్వతీదేవికి రాయలు తన ప్రథమసందర్శనకాలమందు దొసంగిన దగుటచే నామెకు దీనిపై మక్కువ మెండు. ఆతఁడు దగ్గఱ లేనపు డీ రుమాలుతో మాటాడుకొనుచు సంతసించుచుండును. ఇట్టి యమూల్యవస్తు విపు డామెచే విడువఁబడి నాకు లభించినది.

గేయము॥ సంతసంబు గలిగె నాకుఁ జాలగా మదిన్
వింతగొల్పు నీదు పూలు వివర మెద్దియో
యెంత మహిమ దీనిలోన నిమిడియున్నదో
యెఱుగఁ జాలనైతిఁగదా యింత కాలమున్
ఎట్టులైన దీనిఁ దెచ్చి యి మ్మటంచు నా
భర్త నన్నుఁ బెక్కుసార్లు ప్రార్థించుటన్
సమయమునకు వేచియుండి సంగ్రహించితిన్
సంతసంబు గలిగె నాకుఁ జాలగా మదిన్.
దీని గొంపోయెదన్ నాదు భర్తకిచ్చెదన్
అతని మెప్పించెదన్ మోహంపు ముద్దులందెదన్
హాయ్, హాయ్, హాయ్, హాయ్, హాయ్, హాయ్,

[ ప్రవేశము : ఇరావంతుఁడు ]

ఇరా—ఓసీ, నీవిట నొంటరిగ నేమి చేయుచుంటివి ?

దమ—కోపపడకుము. నీకుఁ గావలసిన దానిని సాధించితిని.

ఇరా—నాకు గావలసినదా? అది సహజముగ నున్న దేగదా.

దమ—ఏది ?

ఇరా—బుద్ధిహీనయగు భార్య.

దమ—ఇదేనా, మీరు కనుగొన్నది? మీరు పలుమారు నన్ను దెచ్చిపెట్టుమని యడిగిన చేతిరుమాలును మీ కొసంగిన నా కే మిచ్చెదరు ?

ఇరా—ఏ రుమాలు ?

దమ—ఏదా, మీకుఁ దెలియనే తెలియదా! రాయలు మొట్ట మొదట తన సతీమణి కొసంగిన బహూకరణము. దాని నెటులైనఁగొనిరమ్మని మీరు నా కెన్నిమారులు చెప్పితిరి.

ఇరా—అయితే యిప్పు డామెయొద్దనుండి దొంగిలించితివా యేమి?

దమ—కాదు, కాదు. ఆమె తొందరలో నిచట జారవిడిచి లోని కేగినది: నే నిక్కడనే యుండుటచే దానిని దీసికొంటిని; ఇదిగో చూడుము. (చూపించును.)

ఇరా—అయితే నీవు చాల గట్టిదానవే. నా కిచ్చుటకేగదా దీనిని సంపాదించినది.

దమ—దీనితో నేమి చేయఁదలఁచితివో చెప్పుము. దొంగతనముగ నైన దీనిఁ గొనిరమ్మని నాతోఁ బలుమార్లు చెప్పిన దెందులకు?

ఇరా—ఆగోడవ నీకెందులకు? ఇటు తెమ్ము (అనిలాగుకొనును).

దమ—దీనితో నీకేమైన ముఖ్యమైన పనియుండిన సరే, లేకున్న మరల నాకిచ్చివేయుఁడు. పాప మిది కనఁబడకపోయిన నామె పిచ్చియెత్తినట్లు కొట్టుకొనును.

ఇరా—దీనితో నాకు ముఖ్యమైన పనియేయున్నది. కాఁబట్టి దీనిని నీవు తీసిన ట్లామె కెంతమాత్రముఁ దెలియఁగూడదు. ఇంక నీవు లోపలికిఁ బొమ్ము.

( దమనిక వెడలిపోవును. )

నేను దీనిని గొంపోయి విక్రమునింటఁ బడవేసెదను. ఆతని కిది దొరకును. ఇట్టి స్వల్పవిషయములే యనుమానాస్పదము లగు హృదయములకుఁ బ్రబలప్రమాణములుగఁ బొడకట్టును.

కావున దీనివలనఁ గొంతప్రయోజన ముండకపోదు. ఈ ఘూర్కన కిప్పటికే నా విషము తల కెక్కినది. ఇట్టి చెడ్డతలంపులు మొదట చెవి కింపుగనే కానుపించి క్రమక్రమముగ రక్తమున జీర్ణించి, కొలఁది దినములలో గంధకధృతివోలె శరీరము నంతటిని దహించుచుండును. నే చెప్పిన ట్లంతయు జరిగినది. అదుగో ఆతఁ డిటే వచ్చుచున్నాఁడు.

(స్వగతము) శ్యామలా! నీ సౌఖ్యదినములు నిన్నటితో నంతరించినవి. ఇంక నే దివ్యరసాయన సేవనముగాని, యెట్టి యాసవనిషేవణముగాని నీకు గాఢనిద్రఁ గలిగింపఁజాలదు సుమీ.

[ప్రవేశము : శ్యామలుఁడు]

శ్యామ—ఆ! ఆ! నా యెడలనా, అవిశ్వాసము !

ఇరా—ఏమి టిది ప్రభూ! ఆ సంగతి యింకఁ దలపెట్టకుఁడు.

శ్యామ—ఛీ, యావలికిఁ బొమ్ము. నన్ను భయంకరదావానలమధ్యమునఁ బడద్రోసిన ద్రోహివి నీవు. ఏ దోషము లెట్లు జరిగినను నే నెఱుంగకుండిన నా కీచిక్కు లేదుగదా.

ఇరా—ప్రభూ! ఏమని సెలవిచ్చితిరి ?

శ్యామ—రహస్యముగ నే నిముషమున నే దోష మాచరించినదో నా కే మెఱుక. నేను కనియుండను. వినియుండను. తలంచియుండను. దానివల్ల నా కేహానియుఁ గలుగదు. నే నీద్వీపమునకు వచ్చినమరునాఁటిరాత్రి పరమానందముతో సుఖనిద్రఁ జెందితిని. విక్రముని స్పర్శచిహ్నము లేమియు నామెయందు నా కగుపడలేదు. దొంగిలింపఁబడినవస్తువును గూర్చి తలపెట్టని మనుజునికి దొంగతనమువలని నష్ట మేమున్నది?

ఇరా—ఈ మాటలు మీనోటినుండి వెడలుటఁజూడ నాకు సంతాపము గలుగుచున్నది.

శ్యామ—అక్కటా, చిత్తశాంతి నన్ను సంపూర్ణముగఁ బాసిపోయినదిగదా! ఇంక నా కీలోకమున సంతృప్తి యెందున్నది ? నాకీ పదవు లెందులకు ? ఈ సైన్యము లేల? ఈ యుద్ధ మెందులకు ? రాచరికమా, ఇంక నీకును నాకును ఋణముదీరె. భేరీభాంకారములు, మృదంగవాద్యములు నన్నియు నన్నిపుడు వదలిపోవలసినదే. వైరిసంహార

మొనర్చు నీఫిరంగులు, నీకత్తులు కటారులు, నాయుధములు నన్నియు నావలఁ బాఱవేయవలయును. సైనికులారా, నాయకులారా, మీ రింక మీదారిని బోవచ్చును. వందిమాగధులారా, మీ రీశ్యామలుని వీడిపొండు. వెందేని పోయి వేఱొక్కని నాశ్రయింపుఁడు. నే నిదే మీ యందఱయొద్ద సెలవుఁ గైకొనుచున్నాను. నేటితో శ్యామలుని ప్రభుత్వ మంతరించినది. అందఱును వెడలి పొండు.

ఇరా—అ దెట్లు సంభవించును ?

శ్యామ—ఛీ, నరాధమా! జాగ్రత్త. నీవు నాసతి యవిశ్వాసమును బ్రబల నిదర్శనములచే నిరూపింపవలయు. లేకున్న నీపాట్లు కుక్కలు బడవు.

ఇరా—ఆహా! ఇంతవఱకు దిగినదా ?

శ్యామ—ఆ ద్రోహమునాకుఁ జూపించి తీరవలెను. అది సాధ్యపడకున్న విస్ఫుటములగు నిదర్శనములచే రుజువుపఱచవలెను. కించిత్తైనను సందేహ ముండఁ గూడదు. అంతయు స్పష్టముగఁ దేల్చి చూపించవలెను. ఇందుకుఁ దప్పితివేని నీ ప్రాణములు దక్కవు. జాగ్రత్త.

ఇరా—చిత్తము ప్రభూ! చిత్తము.

శ్యామ—ఛీ దుర్మార్గుఁడా! పరమసాధ్వీమణిని నిందపాలు జేసి నా కీమనోవేదనఁ గల్పించి నీవేమి మూటఁగట్టుకొంటివి? దైవమును ద్రోసిపుచ్చి యంతరాత్మ నడఁగఁ ద్రొక్కి, ఛీ! యెంతటి పాపకర్మమునకుఁ బాలుపడితివి?

ఇంతకంటె నిన్నధోగతికిఁ ద్రోయుట కిం కేపాతకములు గావలెను!

ఇరా—మహాశయా! పాపము శమించుఁగాక. ఈశ్వరుఁడు కాపాడుఁగాక. నీవు పురుషుఁడవేనా? నీ కింకను నంత రాత్మ నిలిచియున్నదా? లేక మతి తప్పిపోయెనా! పర మేశ్వరుఁ డింతటనైన నీపై నిగరుణించుఁగాక. నాయుద్యోగము నీవే గైకొనుము.

(అని యుద్యోగ చిహ్నమును నూడఁ బెఱుకును.)

ఓరి మూర్ఖుఁడా! నీ పవిత్రచరిత్రము నెల్ల బాప పంకిల మొనర్పఁ బాలుపడు చుంటివా? ఆహా, నిన్ననినప్రయోజన మేమి? మాయావిష్టమగు నీప్రపంచము ననవలెఁగాక. ఇది సజ్జనుల కెంతమాత్రము కాలము గాదని లోకమెల్ల గుర్తించుఁగాక. నా కీనీతిపాఠ మెఱిఁగించినందులకు వేయిదండములు. ఇంక మీఁదట నే నెవ్వరి తోడను సఖ్యముఁ జేయకుండెదను. చాలుఁ జాలు. బుద్ధి వచ్చినది. నే నింకఁ బోయెదను.

శ్యామ—ఆగు మాగుము. కాదు కాదు, నీవు సాధుశీలుఁడవుగనే యుండవలయు.

ఇరా—ఎందు కిట్టి పోట్లాటలకేనా? లేదు లేదు. నేను తెలిపిఁ దెచ్చుకొంటిని. సాధువృత్తినుంట బుద్ధిహీనత యనియుఁ గార్యహాని యనియు నేను గ్రహించితిని.

శ్యామ—నా మానసము పరుగులెత్తుచున్నది. కొంచెము సేపు నా భార్య సాధుశీలయని కానుపించును. మఱికొంత తడవు కాదని తోఁచును. ఒక్క నిముసమున నీవు సజ్జ

నుండ వనిపించును. మఱొక్క నిమిషమునం గాదని భీతి జనించెడిని. నాకుం బ్రబలనిదర్శనములు కావలెను. ... శరల్లక్ష్మీ ముఖమ్మునుంబోలె నిష్కళంకమగు నీమె యశశ్చంద్రిక విరూపమగు నా ముఖమువలెనే కళంకితమై నల్లంబడిపోయినది. ... ... ... ఇంక నిట్టి పాతకిని నగ్నిం ద్రోచినను నీట ముంచినను, శూలములం బొడిచినను, సురియలం గ్రుచ్చినను, విషముం ద్రావించినను నాకుం దృప్తి కలుగదు.

ఇరా—అయ్యో! నీవు క్రోధావేశముచే మైమఱచి యున్నట్లున్నావు. నీ కిట్టిగతిం గలిగించినందులకు నేను మిగులం జింతించుచున్నాండను. కాని, నిదర్శనములవలన నీకుం దృప్తిం గలిగించెదను.

శ్యామ—ఔను, నాకు రుజువు కావలెను.

ఇరా—కావచ్చును. కాని యదెట్లు ? నిన్నెట్లు తృప్తిపఱచవలెను. నీవు నోరుం దెఱచుకొని యంతయుం జూచునట్లు చేయవలెనా ? నే నేమి చెప్పుదును ? నీకుం దృప్తి యెటులం గలుగును ? నీవు చూచుట యెట్లు సంభవింపంగలదు. గోడలకుం గూడ చెవులుండునేమో యనుభయమ్మున జాగరూకులై గోప్యముగం బిల్లులవలె నర్తించు కాముకులు నీ కంటం బడుదురా ? అయినను నమ్మకుండుటకు వీలుగానంతటి పరిస్ఫుటములగు హేతువులం జూపి నిరూపించెదను. నమ్మిన నమ్ముము. లేకున్న మఱియు మంచిదే.

శ్యామ—ఆమె నాయెడ విశ్వాసఘాతుకి యని ప్రత్యక్షముగ నిరూపింపవలెను.

ఇరా—ఈకార్యము నాకెంతమాత్రమును మనస్కరించుట లేదు. కాని నీపైఁ బ్రేమచేతను నాయొక్క సహజ సాధు స్వభావముచేతను తెలిసియో, తెలియకయో పైనవేసి కొన్న పాపమునకై యిట్టిబాధలుపడవలసి వచ్చినది..... నే నీమధ్య నొకరేయి విక్రముని ప్రక్కనఁ బరుంటిని. పుప్పిపంటి బాధచే నాకు నిద్రపట్టలేదు. కొందఱు దుర్బల హృదయులు తమ సంగతులెల్ల నిదురలో బిగ్గరగాఁ గలువరించుచుందురు. అట్టివారిలో విక్రముఁ డొకఁడు. ఆనాఁటి నిదురలో నాతఁడు, "ప్రేయసీ, కుముద్వతీ! యొక్క ముద్దిమ్మా, మన యిరువుర ప్రేమము పరిపూర్ణమందుఁ గాక" యని నా చేయి గట్టిగ నొక్కుచు, "నామనోహారిణీ!" యని నాపెదవులపై ముద్దులు వెులక లెత్తుచుండ వ్రేళ్ల తోఁ బెల్లగించినట్లు గట్టిగా నన్ను ముద్దు పెట్టుకొనెను. అంతట నాపైనఁ గాలువేసి మరల ముద్దుఁబెట్టుకొని యొక్క నిట్టూర్పు విడిచి, "అక్కటా! మాలదైవము నిన్నాఘూర్ఝుని పాలఁబడవైచెఁగా" యని పలికెను.

శ్యామ—ఘోరము! ఘోరము!

ఇరా—ఇదంతయు నిద్దురలోనే.

శ్యామ—అయినప్పటికి నది ముందుజరిగిన కథనే తెలుపు చుండును. కలయైన నేమి? మిగుల సందేహాస్పదముగనే యున్నది సుమా.

ఇరా—అస్ఫుటములగు నితర నిదర్శనముల కిది మిగుల సహకారిగా నుండఁగలదు.

శ్యామ—ఇంక నీ తుచ్ఛురాలిని ఖండఖండములుగా నఱికివైచెదను.

ఇరా—ఆగుమాగుము. త్వరపడకుము. తెలివిఁ దెచ్చుకొమ్ము. ఇంతవఱ కేమియు జరిగినట్లు మనకు స్పష్టపడలేదు. ఇంకను నామె సుశీలగనే యుండియుండవచ్చును. అయితే నే నొక్కసంగతి యడిగెదను తెలుపుము. పూలు తీఁగెలతో నంచులుకుట్టఁబడిన చేతిరుమాలు నొకదానిని నీభార్య యొద్ద నెప్పుడైనఁ జూచియుంటివా?

శ్యామ—దానిని నేనే యామె కొసంగియుంటిని. అదియే నాప్రథమ బహూకరణము.

ఇరా—అటులనా! నే నెఱుంగను సుమా. అయితే యటువంటిదే యొకటి, అంతేయు నాలాగే యుండునది, అదే యని నానమ్మకము. విక్రముఁ డీనాఁడు ముఖముఁ దుడుచుకొనుచుండఁగాఁ జూచినట్లున్నాను.

శ్యామ—అదే గనుకయితే.........

ఇరా—అదే గనుకయితే, లేకయామెవస్తువు మఱేది యాతని దగ్గఱ నున్నను యామె దుష్ప్రవర్తనకు దృఢచిహ్నమగును గదా.

శ్యామ—ఇంక నాతుచ్ఛునకు వేయిజీవము లున్నను సరే నాక్రోధాగ్ని ముందర నిలువనేరవు. ఇప్పు డీద్రోహ మెల్ల నాకన్నులఁ గట్టినట్లగపడుచున్నది. ఇరావంతా! ఇటు

జూడుము. నా వెఱ్ఱిమోహము నెల్ల నింతటితో దగము జేసి వైచితిని. ... ... కాళరాత్రిని దలపించు క్రోధమా! కలిరాజు నాశ్రయము వీడి కొన్నాళ్లింక నన్నాశ్రయించి యుండుము. ప్రణయమా! నామానసపీఠమునుండి లేచి యెందేని పొమ్ము. ఇంక నీవిట నుండఁదగదు. నీ వేగి నీమాఱుగ నీకవచకిరీటాదుల లోకముల దిగమ్రింగఁజాలు మాత్సర్యదేవత కొసంగి నన్నావేశింపఁ బంపుము. హృదయమా! నిశ్చలత మాని కూ్రరాహిజిహ్వాలంబో లె విహ్వాలతఁ దాల్చుము.

ఇరా— తాళుము, తాళుము.

శ్యామ—రక్తము, రక్తము, రక్తము కండ్లఁ జూడవలెను.

ఇరా—ఆగు మాగుము. ఇంచుకఁ దాలిమి వహింపుము. నీ మానసము మరల మాఱి పోవచ్చును.

శ్యామ—ఇరావంతా! ఇంక నట్టి దసాధ్యము. తుంగభంగ మగు సంద్రంబునందలి యుత్తుంగతరంగమ్ములభాతి నా భావములు మిన్నంటి పరువెత్తి పోవుచున్నవి. సంపూర్ణ మగు ప్రతీకారము నెఱవేఱువఱకుఁ నాభావములు వెనుదిరుగవు. నే నిదే భూమ్యాకాశములసాక్షిగఁ బ్రతి నఁబట్టితిని.

ఇరా—నిరంతరసంచారులగు సర్వసాక్షులు చంద్రతారార్కులసాక్షిగ నీ యిరావంతు డీనిమేషమునుండి తన జీవితవాంఛ లెల్లఁ గట్టిపెట్టి దుఃఖితుఁడగు శ్యామలరాయని ప్రత్యేకసేవకొఱకుఁ దనజీవితము నిదే ధారబోయు

చున్నాఁడు. (అని శ్యామలుని పాదములంటి) ఈ మీదాసుఁ డింక నెట్టివైనను సరే, మీయాజ్ఞలెల్ల శిరసావహించి నిర్వర్తించువాఁడు. ఇదే మీపాదములాన. ఎట్టి ఘోర కార్యములైనను సరే మీ రనుజ్ఞ యొసంగిన మరుక్షణ మునఁ దీర్చివచ్చెదను.

శ్యామ—ఇరావంతా! నీభక్తికి సంతసించితిని. ఊరక సంత సించుటే కాదు. నిన్నొక ముఖ్యకార్యముపై నియోగించు చున్నాను. నేఁటి నుండి మూఁడుదినములు ముగియు లోపల విక్రమునిమరణవార్త నా కెఱింగింపవలయు. నేనునీ కపుడు చాలఁ గృతజ్ఞుఁడ నయ్యెదను.

ఇరా—మీకోరిక ననుసరించి నామిత్రుఁడు చచ్చినాఁడన్న మాటే. కాని యామెను మాత్రము జీవింపనిండు.

శ్యామ—ఛీ! యా నీచురాలి మాటఁ దలపెట్టకుము. పోవు దము రమ్ము. రూపవతియగు నీ రాకాసిని దత్క్షణమే వధించుటకుఁ దగినమార్గ మాలోచింపవలయు. పోవు దము రమ్ము. ఇటుపై నీవే నా సేనానివి.

ఇరా—నే నెల్లప్పుడు నీ దాసుఁడనే.

(ఇరువురు నిష్క్రమింతురు.)

(తెరపడును.)



నాలుగవ రంగము - కోటలోని రాజనగరు.

[ప్రవేశము : కుముద్వతి, దమనిక, భటుఁడు.]

కుము—ఓరీ! విక్రమసింహుఁ డున్నచోటికిఁ బోయి, యాతని విషయములో నేను భర్తగారితోఁ బ్రసంగించితి ననియు, నంతయు జక్కఁబెట్టఁబడు ననియుఁ జెప్పి యాతని నిటకుఁ దోడుకొనిరమ్ము.

[భటుఁడు 'చిత్తము' అని వెడలిపోవును.]

కుము—దమనికా! నాచేతిరుమా లెక్కడ బోయినదో కనఁబడ లేదుగదా.

దమ—నే నెఱుఁగనమ్మా.

కుము—నా యాభరణపేటిక పోయినను నా కింత చింతయుండదు! మాఘూర్జరసింహము మత్సరహృదయులవలె నిట్టివానికిఁ గోపగింపఁడు కాని యిదిమాత్రము సామాన్యవిషయముగాదు. ఆతఁ డన్యథా భావించుట కిందువలన వీలుగలదు సుమా.

దమ—అయితే, యీతనికి మత్సర మనునది లేనే లేదా?

కుము—ఎవరికి నాభర్తకా? ఆతఁడు జన్మించిన ముహూర్తముననే యిట్టి దుర్గుణముల నెల్ల నాతని శరీరమునుండి సూర్యుఁడు హరించినాఁడు.

దమ—అదుగో, ఆయన యిటే వచ్చుచున్నాఁడు.

కుము—ఈసారి విక్రమునిపదవి నాతని కిచ్చెద ననువఱకు విడువను. మొండిపట్టు పట్టెదను.

(ప్రవేశము : శ్యామలరాయఁడు.)

కుము—నాథా మీ దేహస్థితి యెట్లున్నది?

శ్యామ—ప్రియా! బాగుగనే యున్నది. (స్వగతము) ఎంతటి మోసగత్తె యిది. (ప్రకాశముగ) కుముదా! నీకును గుశలమేగదా.

కుము—ఆహా! కుశలమే ప్రభూ.

శ్యామ—నీచేయి నిటు దెమ్ము. (చేయి పట్టుకొని) ఈచేయి తడిగా నున్న దెందులకు?

కుము—ఎందుకని? ఇంతవఱకు వార్థక్యముగాని విచారముగాని యెఱుంగదే.

శ్యామ—ఇది ఫలప్రద మగు నుదారహృదయమునకుఁ జిహ్నము. ఈచేయి వేడిగాఁగూడ నున్నది. ఈహస్తము స్వేచ్ఛాప్రియుల కుండఁదగినదిగాదు. తపోపవాసములతోఁ బ్రొద్దుపుచ్చు యోగినుల కనువైనది. నీవు భక్తురాలవుగా నుండఁదగుదువు. కాని యీమధ్యఁ జెమట లూరు నొక్కర క్కసి యున్నది. అది యెప్పుడు నెదురు దిరుగుచుండును. మొత్తము మీఁద నీచేయి మంచిదే.

కుము—మీ రట్లే చెప్పవలయును. ఏలయన-నే నీహస్తము ద్వారముననే గదా నాహృదయమును మీ కర్పించినది.

శ్యామ—ఔను, తెగువఁగల చేయి. పెద్దలకాలములో హృదయములే చేతుల నొసంగెడివి. కాని యీ కలికాలములో నట్లుగాక చేతులుమాత్రి మిచ్చి యూరకుందురు.

కుము—నే నీరీతిగ వ్యర్థప్రసంగము సేయనోపను. ఇప్పుడు మిమ్ము విడువను. నాకొసంగిన వాగ్దానమేమి చేసితిరి.

శ్యామ—ప్రియసీ, వాగ్దాన మేమిటి?

కుము—విక్రమునివిషయమై మీరు చేసినది. ఇవుడు వచ్చి మీతో మాటాడి పొమ్మని యాతనికిఁ గబు రంపితిని. కావున విక్రముఁ డిపు డిచ్చటకు వచ్చును.

శ్యామ—నా మనస్సిపుడు సరిగా లేదు. చీకాకుగా నున్నది. ఏదీ, నీ చేతిరుమా లిటు దెమ్ము.

కుము—ఇదే గైకొనుము.

శ్యామ—ఇది గాదు మున్ను నే నొసంగినది.

కుము—అది యిపుడు నా యొద్ద లేదే!

శ్యామ—ఏమీ! నీ యొద్ద లేదా?

కుము—లేదు. నాథా లేదు.

శ్యామ—అటులైన నీదోషము మన్నింపఁ దగినదిగాదు. దానిని మొట్టమొదట నొక యెఱుకలసాని మాతల్లి కొసంగెను. ఆ యెఱుకలది గొప్ప మాంత్రికురాలు. ఇతరుల మనసులోని భావములఁ గనిపెట్టు శక్తిగలది. అదిమాతల్లి కీరుమాలు నిచ్చుచు "ఇది దగ్గఱ నుంచుకొనినవారికి భర్తవశం వదుఁ డగును. అది పోగొట్టుకొందువేని నీ భర్తకు నీపై మనసు విరిగిపోయి క్రోధము జనించును" అని గట్టిగాఁ జెప్పెనఁట. నేనువివాహమాడినపుడు నాభార్య కీయవలసినదిగాఁ జెప్పి మాతల్లి మరణకాలమున దీనిని నాకొసంగెను. నే నట్లే యొసగ్చితిని. అట్టి మహిమఁ గల దగుటచే దానిని భద్ర

ముగా నెల్లపుడు గాపాడుచుండవలెను. దానిని బారవేసి నను మఱియొకరి కిచ్చినను నే నోర్వఁ జాలను. అది మహా దోష మనిపించుకొనును. అందువల్ల నీపై నాకు మనసు తిరిగి పోయిన పోవచ్చును. అది నాతప్పు గాదు.

కుము—అటుల నిజముగ సంభవించునా?

శ్యామ—ఔను, అట్లే జరిగి తీరును. దాని యల్లికయం దొక మహామంత్ర మిమిడియున్నది. ఆ మాంత్రికురాలు దేవీ ప్రసాదమువలన ననేకమంత్రరాజములకుఁ జెందిన బీజా క్షరములఁ జమత్కారముగ నాయల్లికయం దిమిడ్చి దానిని మిక్కిలిశక్తివంతముగ నిర్మించెను.

కుము—అటులనా?

శ్యామ—కాఁబట్టి దానిని భద్రపఱచవలసిన యావశ్యకత మఱింత గలదుగదా.

కుము—అక్కటా, అట్టిది నాకసలు కంటఁబడకయే యుండిన బాగుండెడిది.

శ్యామ—ఏమి? ఎందుచేత?

కుము—ఏమినాథా! అట్లబ్బురపడెద వేల? అంత భయంకర దృష్టు లేమిటికి?

శ్యామ—ఇప్పు డారుమా లేమైనదో చెప్పుము. పోయినదా? నిజము చెప్పుము. ఎప్పుడు పోయినది? ఎక్కడపోయినది?

కుము—దైవానుగ్రహమునఁ బాపము శమించుఁగాక!

శ్యామ— ఏమి పోయినట్లునా?

కుము—పోలేదు కాని యొకవేళ దొరకకుండిన—

శ్యామ—ఎందుకని?

కుము—ఇంత తొందరయేల? పోలేదని చెప్పుచుంటిని గాదా?

శ్యామ—అటులైన నేది యిటు తెమ్ము.

కుము—ఏమి? తెచ్చి చూపఁగలను. కాని యిప్పుడు గాదు. (నవ్వుచు) ఆ! నే నెఱుంగుదును లెండి. నాకు మీ సంగతి తెలిసినది. నా కోరికఁ దీర్పకుండుట కిది యొక పన్నుగడ. మి మ్మిదే ప్రార్థించెదను. విక్రమున కాతని యుద్యోగముఁ దిరిగి యిచ్చివేయుఁడు.

శ్యామ—ముందు నా చేతిరుమాలిటు తెమ్ము. నా కనుమానము తట్టుచున్నది.

కుము—ఈ మాటకు జవాబు చెప్పఁడు. అంతకంటెఁ దగినవాఁడు వేఱొకఁడు లభింపఁడు.

శ్యామ—ఏదీ చేతిరుమాలు?

కుము—నాకు విక్రమునిసంగతి చెప్పఁడు.

శ్యామ—నాకు చేతిరుమాలు సంగతి చెప్పుము.

కుము—ఆతఁడు చిన్ననాఁటనుండియు మీ దయకుఁ బాత్రుఁడై కష్టనష్టములందు మీతోఁ గలిసి యుండినవాఁడు.

శ్యామ—చేతిరుమాలు!

కుము—ఇంక మీమాట నమ్మఁగూడదు.

శ్యామ—ఛీ, యవతలకుఁ బొమ్ము.

(నిష్క్రమించును.)

దమ—ఈతఁ డిప్పుడు మత్సరగ్రస్తుఁడై యున్నాఁడు.

కుము—ఇట్టి చిత్రమును నే నెన్నఁడును గని యెఱుంగను. ఆ చేతిరుమాలులో నేదో మాహాత్మ్య మున్నది. అది పోయి నందులకు నామనసు మిగులఁ బరితపించుచున్నది.

దమ—అమ్మా, మగవారిహృదయము గ్రహించుట కేండ్లక్కరలేదు. వారు లంబోదరులవలెఁ గూర్చుండి మనల నాహారముగఁ బరిగణించి వేపుకొనితినుచుందురు. కడుపు నిండినవెనుక మనల నావలికి గెంటివేయుదురు. అల్లదే నా భర్తయు, విక్రముఁడును వచ్చుచున్నారు.

[ ప్రవేశము: ఇరావంతుఁడు, విక్రముఁడు. ]

ఇరా—(అపవారితము) వేఱొండు మార్గము లేనేలేదు. చేసిన నామెయే చేయవలయు. ఆమెనే వేడుకొనుము. తప్పక కార్యము ఫలించును.

కుము—ఏమి విక్రమా, విశేషము లేమి ? నీ సమాచార మెట్లున్నది.

విక్ర—అమ్మా ! క్రొత్త లేమియు లేవు. వెనుకటి విషయమే. మీ దాక్షిణ్యమువలన నాకుఁ దిరిగి జీవనోపాధి లభించు భాగ్యము గలుగునేమో యని మిమ్ము వేడుకొనవచ్చితిని. ఎవరినిఁ జిరకాలమునుండి నేను మనసారఁ బ్రేమించు చుంటినో, అట్టి మీ భర్తగారికిని నాకును మరలఁ జెలిమిఁ గూర్పుమని నా ప్రార్థన. అమ్మా, నే నెక్కువకాల మిట్లూరక వేచియుండఁ జాలను. నే నింక ముందెన్నఁడు నిట్టి యపరాధములఁ జేయనని ఘోరప్రమాణ మాచరించెదను. నా పూర్వపుసేవను జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. ప్రస్తుత

దైన్యమును బాటింపుము. భవిష్యత్తు విషయమై నేఁజేయు ప్రమాణముల నాలింపుము. ఆపై నే నొనర్చిన నేరమును మన్నింపుఁడు. నా కొసంగినశిక్ష నుపసంహరింపుము. అట్లైనను సాధ్యపడ దేని, ఆమాట తెలియఁజెప్పిన సంతోషించెదను. అటుపై నెట్లో మనస్సు కుదుర్చుకొని నాయదృష్టమెట్లో యట్లొనర్చి, కండ్లుమూసుకొని కాలముఁబుచ్చెదను.

కుము—అక్కటా, సాధుశీలా, విక్రమసింహా! నే నేమని చెప్పుదును. నాప్రయత్న మిపుడు కొనసాగునట్లు లేదు. నీకై పోరాడి యాతనికోపమునకుఁగూడఁ బాల్పడితిని.

ఉ॥ కాలము మారిపోయినది కారణ మేమొ దురూహ్యమయ్యె నా
పాలిటికల్పవృక్ష మని పాయకనమ్మిన జీవితేశ్వరుం
డేలొకొ నాదుమాట గణియింపక నిర్దయఁ ద్రోసిపుచ్చె "చా
ల్జాలు"నటంచు; నింకెటుల సాయముజేయుదునయ్య విక్రమా!

నీ వింకను గొన్నాళ్ళు తాలిమిఁబూని యుండవలయును. అటుపిమ్మట మఱియొకసారి ప్రయత్నించెదను. అపుడు మరల నాచేయఁ గలిగినదెల్లఁ జేసెదను. నాకొఱకు నేఁ జేయుప్రయత్నముకంటె నీకై యెక్కుడాచరించెదను. అటుపైని నీ యదృష్టము.

ఇరా—అమ్మా, నీ విభుఁడు కోపముఁబూని యున్నాఁడా?

దమ—ఆయన యిప్పుడే యిటనుండి యేదో విచిత్రమగు కోపభావముతో వెడలిపోయిరి.

ఇరా—ఏమి, ఆయనకుఁగూడఁ గోపమనునది కలదా? సైన్యములు ఫిరంగి గుండ్లకుఁ దుత్తునియలై యెగిరిపోయిన

నాఁడు నేఁ జూచియుంటిని. ఒక దారుణాస్త్రము తనసరస నున్న బాల్యమిత్రునిదహించుకొనిపోయినప్పుడేని యాతఁ డాగ్రహమందియెఉంగఁడే. ఏదో యొకతెప్పపాటాతని చిత్త మన్యథాయత్త మయ్యె నేమో. లేకున్న నేదో ప్రబలకారణ ముండియుండవలెను. నే బోయి విచారించి వచ్చెదను.

కుము—నాయందు దయయుంచి యట్లే చేయుము.

(ఇరావంతుఁడు నిష్క్రమించును.)

నిక్కముగ నేదో రాజకీయవ్యవహారమునఁ జిక్కులు గలిగియుండును. ఆంధ్రపురినుండి యేదేని దుర్వార్త లరు దెంచెనేమో? లేకున్న నిచటివా రేదేని తెలివితక్కువ పనులఁ జేసి యాతనిమనసుఁ గలవరపెట్టిరేమో.

గీ॥ పురుషులకు రాజధర్మానుచరణమందు
నాగ్రహము గల్గ దానినే యందఱియెడఁ
గనబఱచుచుందు రేవివక్షతయు లేక
ఒక్కవేళలిపై వగ్గె మొక్క టుద్భవిల్ల
నన్నివేళల బాధించు నట్టిఫంగి.

పురుషులుమాత్రము మానవులు గారా? లోపము సేయరా? ఎల్లప్పుడును పెండ్లినాఁడు మాటాడినట్లు నను సిగ్గుతో మృదువుగా మాటాడుచుందురా? అదియుఁగాక నేను గడుసుదానివలె వెంటఁబడి వేధించితిని. ఆతని మనసు నొప్పించితిని గాఁబోలు.

దమ—నీవు తలంచిన ట్లేవో, వ్యవహారపుచిక్కులే యాత నికిం గోపకారణమై యుండును. అతనికోపమునకు వేఱే రేమియుం గారణము కాకుండునుగాక.

కుము—అక్కటా, నే నాతనిమనస్సు నొప్పింపకుండ నుండ లేకపోయితినే.

దమ—కాని కోపిష్ఠులకుం గారణ మక్కరలేదు. వారూరక నె కోపగించుకొనుచుందురు. ఈ కోప మొక పిశాచము వంటిది. దానియంతటదియే వారిని దఱచుగా నావే శించుచుండును.

కుము—ఈశ్వరుని కృపవలన నట్టి పిశాచము, మా రాయల నావేశింపకుండుం గాక.

దమ—తథాస్తు.

కుము—నేను బోయి కనుంగొనియెదను. విక్రమా, ఈపొంతనే వేచియుండుము. అనుకూలముగా నుండిన నీ విషయమై మనవిచేసెదను.

విక్ర—ఇదే వందనములు. (వంగి నమస్కారము చేయును).

(కుముద్వతి, దమనిక నిష్క్రమణము)

[ప్రవేశము : కళావతి]

కళా—ప్రియా, విక్రమా, నీ కభివందనములు.

విక్ర—చక్కనిచుక్కా, నీ విల్లు విడిచి యిప్పు డేల వచ్చితివి? ఇప్పుడే నీయింటికి రాందలంచి యుంటినే.

కళా—నేను నీకొఱకే బయలువెడలితిని. అక్కటా, నిన్నుం జూచి యెంతకాల మైనది? వారముదినములనుండి కంటి కగుపడక పోయితివిగదా !

విక్ర—కళావతీ, ఎక్కడిదే? వారము! మొన్ననేగదా రాత్రి యెల్ల నీతోఁ గడపితిని. మూఁడు దినములైనఁ గాలేదే?

కళా—మూఁడు దినములు గాలేదా? అటులైన నరువది గంటల కెక్కువయినదిగదా. నాలుగువేల నిమిషములైనది; నాకు నిమిషమొక్క యుగముగా నున్నది. నేను నీకొఱకు వేచియుండి విసిగి వేసారితిని.

విక్ర—కళావతీ, నన్ను మన్నింపుము; ఇపు డవసరమగు పని తొందరచే నిచట నుండవలసి యున్నది. ఈ వార తీర్చెదనులే; నీ వింటి కేగుము. ముద్దులాడీ, తడయకపొమ్ము. ఇదుగో, యిటు జూడుము. (చేతిరుమాలుఁ జూపును.) ఇట్టిది నా కొకటి యల్లిపెట్టుము.

కళా—విక్రమా, దీని నెక్కడ సంపాదించితివి. ఇన్ని దినముల నుండి నాకంటి కగుపడక మఱొక్కతెతో స్నేహము చేయఁగా, నది యిచ్చినదా యేమి? ఇంతవఱకు వచ్చినదా? కానీ లెమ్ము.

విక్ర—చెలీ, నీపిచ్చియూహలఁ గట్టిపెట్టుము. ఇంతలోనే మాత్సర్యము పెరుగుచున్నదా? కాదులే, యింకఁ బొమ్ము. వెంటనే పొమ్ము.

కళా—అటులైన నిది యెవరిది?

విక్ర—ఆసంగతి నాకుఁ గూడ తెలియదు. ఇది నాగదిలోఁ బడియుండఁగాఁ గైకొంటిని. ఈ యంచునందలి యల్లిక చాల బాగుగ నున్నది. దీని సొంతగాఁడు వచ్చి యడుగులోపల నీ మాదిరి దొకటి నా కల్లియిత్తువని దీనిని నీ కిచ్చు

చున్నాను. దీనిఁ గొంపోయి వెంటనే యిట్టిది తయారు చేయుము. త్వరలోనే వచ్చెదను. త్వరగా నిచ్చోటు విడిచి వెడలుము. నీ విటఁ దడయరాదు. ఆలసించక పొమ్మా.

కళా—నిన్ను విడిచిపోవలయునా! ఎందుచేత?

విక్రి—నేను ప్రభువుతో నొక మనవి చేసికొనుట కిచటికి వచ్చితిని. నీతోఁ గలిసియుండఁగా నాతఁడు చూచుట నా కిష్టములేదు.

కళా—నన్ను దఱిమి వేయకుఁడు. బతిమాలుకొందును.

విక్రి—సందర్భ మట్టిదిగానఁ జెప్పితినిగాని నీపైఁ బ్రేమలేక కాదు.

కళా—అటులైన నీరాత్రి పెందలకడఁ దప్పక వచ్చెదవుగదా? ప్రియా, నన్ను గొంచె మీవీథి చివరవఱకుఁ బంపించి పొమ్ము.

విక్రి—దగ్గఱలోనే గదా. ఇంతలో నేను వచ్చుటెందులకు? ఇక్కడ నేను కనిపెట్టుకొనియుండవలయును. ఈ చోటుఁ బాసిపోఁగూడదు. త్వరలోనే వచ్చెదనులే, పొమ్ము.

కళా—సరే. అట్లే కానిమ్ము. సందర్భము తప్పివచ్చినపుడు సమయానుకూలముగ వర్తింపవలయుఁ గదా.

(నిష్క్రమణము.)

[తెరపడును.]

---



# ముగ్ధప్రణయము.

## చతుర్థాంకము

మొదటిరంగము - కోటవాఁకిటమంటపమున

[ప్రవేశము: శ్యామలుఁడు, ఇరావంతుఁడు.]

శ్యామ—ఈ నిగూఢచర్యలు దోషావహమ్ములుగావా మఱి?

ఇరా—కాని, నేనేగనుక నా భార్య కొకచేతిరుమాలు నొసంగితినేని —

శ్యామ—ఒసంగిన నేమి ?

ఇరా—ఏమున్నది? అది యామెదగును. ఆమె తన యిష్టము వచ్చినవారికి దాని నిచ్చుకొనవచ్చును.

శ్యామ—అట్లిచ్చివేసిన యామెమానము దక్కునా?

ఇరా—"మానము!" మాన మనునది యొకరి కగుపడునది గాదు. సామాన్యముగ మానహీనలే మానవతులని కొనియాడఁబడుచుందురు. కాని చేతిరుమాలు మాత్రము -

శ్యామ—అబ్బ, మరల దానిని నాకు జ్ఞప్తికిఁ దేకుము. పాడుబడ్డకొంప కరుదెంచు ఘూకమ్ము వలె మాటిమాటి కీమాట తలఁపునకు వచ్చుచున్నది. ఇంతకును నీవు చెప్పి నది నా చేతిరుమాలు నాతనికడఁ జూచితి ననిగదా!

ఇరా—ఔను, అమాటే.

శ్యామ—ఆ విషయమున నింకను నిశ్చయము తెలియలేదు గదా?

ఇరా—అటులైన నీ కాతఁడు ద్రోహము సేయుచుండఁ గండ్లారఁ జూచితి నని చెప్పిమాత్రము ప్రయోజన మేమి? ఆతఁడు పలుమా రనుచుండును.

శ్యామ—ఏమని?

ఇరా—"కొందఱు నీచులు తమడాంబికపు మాటలచేత నొక యందగత్తెను వశపఱుచుకొని యటుపై నది యాడించిన ట్లెల్ల నాడుచుందు"రని.

శ్యామ—ఆ! యింకేమి చెప్పెను.

ఇరా—ఇంక ననేకము చెప్పెను కాని యిప్పు డడిగిన లేదనకుం డునా?

శ్యామ—తున కేమి చెప్పెను.

ఇరా—ఆయశ్లీల మాచరించితినని యొప్పుకొనెను.

శ్యామ—అక్కటా, యేమి యీ వైపరీత్యము! తా నొప్పు కొనెనా?...హా, చేతిరుమాలు! వ్యభిచారము!! ఒప్పు కొనుట!!!.........నిష్కారణముగ నిట్టి వింతపుట్టునా? ..............ఆహా! లోక మెంత మాయావృతము!!

.........నాయొడలెల్లఁ గంపమెత్తుచున్నది. కన్నులు, ముక్కులు, చెవులు, అన్నియు నదరిపోవుచున్నవి. హా, మోసము! మోసము!! భరింపజాలను, భరింపజాలను!! ఛీ, రాక్షసీ!

[మూర్ఛిల్లును.]

ఇరా—(జనాంతికముగా) ఇప్పటికి బాగాయెక్కినది....... నావిషము బాగుగఁ దలకెక్కినది. పన్నుగడ యనిన నిట్లు గదా యుండవలయు. ఈ యమాయికుల వలలో వేసికొనుట కదియే మార్గము. పూతచరిత్రలగు సాధ్వీమణులఁ గళంకితలనుగాఁ దోపఁజేయుట కింకెవ్వరితర మగును. (ప్రకాశముగ) ప్రభూ, శ్యామలరాయా, లెమ్ము లెమ్ము.

[ప్రవేశము: విక్రముఁడు]

ఇరా—ఏమి, విక్రమా, ఇటు వచ్చితివి ?

విక్ర—ఏమి సంభవించినది ? ఏమి టిది ?

ఇరా—ప్రభువర్యులు మూర్ఛిల్లియున్నారు. ఈ మూర్ఛ నిన్న నొకసారి వచ్చినది. అప్పుడే యిది రెండవసారి.

విక్ర—కణతలఁ జేయిఁబెట్టి రుద్దుము.

ఇరా—అక్కరలేదు. కొంచె మాగుము; దానియంతట నదియే పోవును. లేకున్న నోట నురుగులు గ్రక్కుకొనుచుఁ బిచ్చిపిచ్చి మాటలు మాట్లాడును. అదుగో, యిప్పుడు చూడుము, కదలుచున్నాఁడు; కొంచెము సే పావలి కేగుము. ఇప్పుడే స్మృతి గలుగుచున్నది. ఆతఁడు లేచి

యావలి కేగినవెంటనే వచ్చి నీతోఁ జాలసేపు ముఖ్యమగు విషయములఁ బ్రసంగించెదను.

(విక్రముఁడు వెడలిపోవును.)

శ్యామ—(లేచుచున్నాఁడు.)

ఇరా—ప్రభూ, శిరమునకు దెబ్బ తగిలినదా ?

శ్యామ—నన్నెగతాళిజేయుచున్నావా ?

ఇరా—ఆ! మిమ్ములనా యెగతాళిజేయుట! దైవసాక్షి, అట్లెన్నటికిఁ జేయను. నీవు పౌరుషము వహింపుము. విధి వ్రాఁత యెట్లున్న నట్లు జరుగును.

శ్యామ—అయితే, యాతఁడు తన నేరము నంగీకరించెనా?

ఇరా—రాజా, పురుషునిభంగి ధైర్యముతో నిలువుము. వివాహితుఁ డగు ప్రతివృద్ధుఁడును నిట్టిగతినే యనుభవించుచుండును. ప్రతిరాత్రియు నోరు లెఱుంగకుండ నన్యులశయ్యలఁ బవ్వళించువనితలు వేనవే లున్నారు. ఇంకను నీనసంగతియము. ఇదంతయుఁబురాకృతకర్మఫలము భీతిదక్కి యన్యుని ముద్దుగొనుదానినిగూడ మానవతి యని చెప్పుకొనుట యీకలికాల మర్యాద. పద. బాగుగ యోచించి యథార్థము గ్రహింతము.

శ్యామ—ఆమాట నిజము.

ఇరా—మీరిటదుఃఖాతిశయమునఁ బడియుండఁగా విక్రముఁడు కామాతురుఁడై యిటకు వచ్చెను. నే నాతనితో నేదో స్మృతితప్పి యున్నారని చెప్పి మరలవచ్చి నాతో నిచ్చటనే మాటలాడ వలసిన దని చెప్పితిని. ఆతఁడు తిరిగి వచ్చిన

పిదప నెన్నిసారు లెప్పుడెప్పుడు నీ సతినిఁ గూడెనో అంతయు నాతని నోటిమీఁదుగఁ జెప్పించెదను. నీ విచ్చోట దాగియుండి యాతనిముఖలక్షణములఁ బరీక్షించుచు నాతనిహృదయస్థితిని గ్రహింపుము. ఆతని ముఖమునఁ గాన నగు చిఱునగవులు, బొమవిఱుపులు, నన్నియు జాగ్రత్తగాఁ బరిశీలింపు చుండుము. కాని మిగులఁ దాలిమిఁ బూని యుండవలయును. లేకున్న నీవు వట్టి నిరర్థకుఁడ వనిపించుకొందువు.

శ్యామ—ఇరావంతా, ఇటు వినుము. నే నతినిపుణతతోఁ దాలిమిఁ బూనెదను; నీవే చూడఁగలవు. కాని యెంతటి నీచ కార్యము ?

ఇరా—అటుగాకున్న సమయభంగ మగును. సమయస్ఫూర్తి నెఱింగి మెలంగవలయు. ఇంక నావలకుఁ బొమ్ము.

[శ్యామలుఁడు ప్రక్క కొదిగి చాటుగ నిల్చును.]

ఇప్పు డున్నది నాపని. విక్రముని జేరబిలిచి యాతనితోఁ గళావతివిషయమై ప్రస్తావించెదను. కళావతి పేరు చెప్పఁగనే యాతఁడు నవ్వకమానఁడు. ఇదుగో, విక్రముఁడు వచ్చుచున్నాఁడు. ఆతఁడు నవ్వినకొలఁది శ్యామలునకుఁ గ్రోధ మతిశయించును. ప్రేమతత్త్వ మెఱుంగని యీ శ్యామలుఁ డాతనిచిఱునగవుల కెల్ల నపార్థము లూహించుకొనును.

[ పునః ప్రవేశము : విక్రముఁడు. ]

ఇరా—సేనానీ, ఏమి సమాచారము ? బాగున్నావా ?

విక్రి—నా కాబిరుద మిపు డెందులకు ? దాని పేరుఁ జెప్పిన నా కడుపు మండుకొనిపోవుచున్నది.

ఇరా—నీ కెందుకు కుముద్వతిని బట్టుకొనుము. అంతయు నెఱవేఱుఁ గలదు. (నెమ్మదిగ) ఇదే గనుక కళావతి చేతి లోని పనియైనయెడల గంతువేసి సాధించియుందువుగదా.

విక్రి—పాపము; అది వట్టి వెకలి మనిషి (అని యించుక నవ్వును.)

శ్యామ—(స్వగతము) అప్పుడే నవ్వుచున్నాఁడే!

ఇరా—ఎట్టి పురుషునైనను నీరీతిగఁ బ్రేమించు స్త్రీని నే నెందును జూడలేదు.

విక్రి—ఈ ముద్దరాలికి నామీఁద ప్రేమ మెండు.

శ్యామ—(స్వగతము) ఈ దొంగ నెమ్మదిగఁ బైకి లేదనుచుఁ దనలోఁ దాను నవ్వుకొనుచున్నాఁడు.

ఇరా—విక్రమా, నే చెప్పినది వినఁబడినదా ?

శ్యామ—(స్వగతము) ఇరావంతుఁడు మరలఁ జెప్పింపఁ జూచుచున్నాఁడు. కానీ, మంచిదే.

ఇరా—నీ వామెను వివాహమాడఁదలఁచితి వని యామె చెప్పినదే, నిజమేనా ?

విక్రి—అహ్హాహ్హా (అని సిగ్గుతో నవ్వును.)

శ్యామ—(స్వగతము) ఛీ! ఛీ! నీకు నవ్వుగా నున్నదిగా ! ఊఁ! చూచెదవుగానిలే.

విక్రి—నేనా ! దానిని వివాహమాడుటా! నన్నంతటి మూర్ఖునిగా నెంచకుము. హహ్హాహ్హా.

శ్యామ—(స్వగతము) ఊ! ఊ! చేఁజిక్కినదనియా, యీ పగలఁబాటు?

ఇరా—నిజముగ నేనీ వామెను బరిణయమాడుదు వని యందఱుఁ జెప్పుకొనుచున్నారు.

విక్రి—ఆ! నిజముగనా?

ఇరా—నిజముగాకున్న నన్ను మాఱుపేరునఁ బిలువుము. నీతో నే నబద్ధము చెప్పుదునా?

శ్యామ—(స్వగతము) ఈ పలుకు లేమో, నాకు హృదయ శల్యములుగ నున్నవి.

విక్రి—అట్లయిన నాకోతియే యెల్లరకుఁ జెప్పుచుండ వలయును. తనప్రేమ కాశించి తన స్తుతులఁ బాటించి నేను దన్ను వివాహమాడుదు నని దాని తలంపు. అంతేగాని నే నంగీకరించినఁ గదా.

శ్యామ—(స్వగతము) ఇరావంతుఁడు కనుసైగఁజేయుచు న్నాఁడు. అసలు కథ యింక మొదలుపెట్టును గాఁబోలు.

విక్రి—ఇంతకుముందే, ఆమె యిక్కడ నిలిచియుండెను. నే నెక్కడకుఁ బోయిన నక్కడ కెల్ల వచ్చుచుండును. మొన్న నే నొకసారి సముద్రతీరమునఁ గొందఱు పెద్ద మనుష్యులతో మాటాడుచుండగా నీ వన్నెలాడి యటకు వచ్చి నాభుజముపైఁ జేయివేసి నిలిచెను.

శ్యామ—(స్వగతము) ఏమి యీనటన! "ప్రియా" యని తనపైఁ జేయివేసెనని కాఁబోలు.

విక్ర—ఆరీతిగ నెల్లపుడు నాయొద్దకు వచ్చి తనముద్దుమురిపెములఁ జూపుచుండును.

శ్యామ—(స్వగతము) తన్నామె పడకకుఁ గొంపోయె నని కాఁబోలు చెప్పుచున్నాఁడు. ఛీ, ఛీ, ఏమిరా, నీముక్కు? నీముక్కు ముక్క ముక్కలుగాఁ గోసి కుక్కలకు వేయుదును.

విక్ర—ఇంకమీఁదట దానిసఖ్యము విడనాడవలయును.

ఇరా—నాముందరనా యీమాటలు! అదుగో, యిటు చూడుము. ఇపుడే వచ్చుచున్నది.

విక్ర—ఏదీ! అహ్హా హా. పట్టి వెట్టికోతి. కాని కడుచక్కనిది సుమా!

(ప్రవేశము: కళావతి.)

విక్ర—ఏమిటిది? ఇట్లు నావెంటఁ బడుచున్నావేమి?

కళా—నేను భూతమునా, పిశాచమునా, నీ వెంటఁబడుటకు? ఏమని యిందాక నాకీచేతిరుమాలు నిచ్చినది? నేనుగూడ వెఱ్ఱిదాననై దాని నందుకొంటిని. ఆలాఁటి యంచు నల్లవలయునా? చాలుఁజాలు, మంచిపనిఁ బెట్టితివి. మీకుఁ దెలియకుండ మీగదిలోఁ బడియున్నందుకు మంచిదే దొరకినది. దాని నేదో పిశాచము పడవేసియుండును. దానిని నే నెట్లనుకరింపఁగలను? నీ కది యెవతె యిచ్చినదో దానినే మఱొకటి యిమ్మని యడుగుము. ఆ యల్లిక నావలనఁగాదు.

విక్ర—ఏమే! ముద్దులగుమ్మా, కళావతీ, ఇంతయసహానము.

శ్యామ—(స్వగతము) దైవసాక్షిగ, నది నారుమాలే.

కళా—ఈ రాత్రి భోజనమున కింటికి వచ్చెదరా? తప్పక రండి. ఈనాఁడు రాకపోయిన మఱియెప్పటికిని రానక్కఱలేదు.

(నిష్క్రమించును).

ఇరా—పోపో, దానితో నీవుగూడఁ బొమ్ము,

విక్ర—అవును. పోవలసినదే. లేకపోయిన వీధులలో గల్లంతు చేయును.

ఇరా—ఈ రాత్రి కక్కడేనా భోజనము!

విక్రి—ఆ! అన్నమాటే.

ఇరా—సరే, నేను గూడ యీ రాత్రి కక్కడకే వచ్చెదను నీతో మాటాడవలసిన విషయములు చాలఁ గలవు.

విక్రి—అటులైనఁ బరమసంతోషము. తప్పక రమ్ము. ఏమి, వచ్చెదవా?

ఇరా—ఇఁక నీవు మాటాడక పొమ్ము. నాకిక్కడ పని యున్నది.

(విక్రముఁడు నిష్క్రమించును.)

శ్యామ—(వెలికివచ్చి) ఇరావంతుఁడా, వీని నెట్లు సంహరించుట!

ఇరా—చూచితిరిగదా, వాని నవ్వు. తన ఘనకార్యమును గుఱించి చెప్పునప్పుడెల్ల పట్టలేక పగులబడి పోయినాఁడు.

శ్యామ—ఔను, చూచితిని. ఇరావంతుఁడా, అంతయుఁ జూచితిని.

ఇరా—ఆ చేతిరుమాలును గనిపెట్టితిరా ?

శ్యామ—అది నిశ్చయముగ నాదేనా ?

ఇరా—ఇంకను సందేహమా, దానిని దన కిచ్చిన తెలివితక్కువ దగు నీ భార్యనుగూర్చి వానిపలుకులు వింటివి గదా. ఆమె తన కిచ్చినదఁట. తాను తన యుంపుడుగత్తె కిచ్చినాఁడు.

శ్యామ—ఈ దుర్మార్గునిఁ బట్టి పదియేండ్లు పీకుకొని తిన వలెను. ఆ! ఆ! అది యెంతరూపవఁతి! చక్కని చుక్క! అందపుతునక! పంచదారచిలుక! ఆహా! ఆహా!

ఇరా—నీ విదంతయు మఱచి పోవలయును.

శ్యామ—ఆ! ఆమె యీరాత్రియే, చివికి చివికి చావవల యును. ఇంక బ్రతుకఁగూడదు. నాహృదయము పాషా ణమై పోయినది. దానిపై దెబ్బకొట్టిన నాచేయి నొప్పి పెట్టుచున్నది. కాని యీ ప్రపంచమున నింతటియంద గత్తెలేదు. అక్కటా, చక్రవర్తిప్రక్కనఁ బరుండి యీ తని శాసింపగలసౌందర్యవతి.

ఇరా—నీ వట్లు తలఁపఁగూడదు.

శ్యామ—తలఁచినఁ దప్పేమి? నే నున్న సంగతియే చెప్పితిని. ఆమె కుట్టుపనియందు దారి తేరిన నేర్పరి. ఆమె కంఠస్వరము మిగుల మనోహరము. గాంధర్వమున శిలలఁ గరగించు నామె. ఆమెబుద్ధి మహాతీక్ష్ణమైనది. ఆమె వాక్చాతుర్య మద్వితీయము.

ఇరా—ఇన్ని గుణములు నామెయందు నిరర్థకములై పోయె నుగదా.

శ్యామ—ఔను నేయిట్లుగా—ఇవి యిట్లుండ మహావినమ్ర స్వభావ మాంమెది.

ఇరా—ఆ! అతివినయము!

శ్యామ—ఆమాట నిజమే; కాని ఇరావంతుఁడా, యిది మిగుల సంతాపకరము.

ఇరా—నీ కామెయం దిట్టి గాఢానురాగ మున్న యెడల నామె యపరాధముల సహింపుము. అనగా నామె యిచ్చవచ్చి నట్లు తప్పుజేయుట కొప్పుకొనుము. ఆమె చర్యలు నిన్ను బాధించవేని మఱెవ్వరికి నవి కష్టములు గానే కావు.

శ్యామ—లేదు లేదు. దానిని ముక్కలు ముక్కలుగ నఱికి వేసెదను.

ఇరా—ఎట్టి పాపమును కొడిఁగట్టుకొనెను!

శ్యామ—అందును నాకడ నుద్యోగితోడనా?

ఇరా—అది గొప్ప పాతకము.

శ్యామ—ఇరావంతుఁడా, నాకీరాత్రి కొంత విషముఁ దెచ్చి యిమ్ము. ఆమె సౌందర్యము మఱల నన్ను మోసగింప కుండుటకై నే నింక నామెతో మాటలాడుట మానివేసి దను. దృఢముగా నిశ్చయించితిని. తప్పక యీరాత్రియే తెమ్ము.

ఇరా—విషముతో వలదు. అది చెఱచిన యాశయ్యతోఁ గూడ గొంతు నులిమివేయుము.

శ్యామ—ఔనౌను. న్యాయశాస్త్రమునం దట్లేయుండును.

ఇరా—విక్రముని నా కొప్పగింపుము. ఈ రాత్రియే వాని యంతము వినఁగలవు.

శ్యామ—భళీ మంచిది. అట్లే కానిమ్ము.

[తెరలో మేళములు.]

ఈ మేళము లేమి?

ఇరా—ఆంధ్రపురమునుండి యెవరో వచ్చినట్లున్నది.

[ప్రవేశము : లక్ష్మణసింహుఁడు, కుముద్వతి, పరిచారకుఁడు.]

లక్ష్మ—జయము, జయము. నాయకోత్తమా, జయము, జయము.

శ్యామ—మనఃపూర్వకముగ నామోదించితిని.

లక్ష్మ—ఆంధ్రపురమంత్రివర్గమువారు మీ కభినందనములఁ దెలుపుచు నీ జాబుల నందీయుమనిరి. (అని యొక కట్ట జాబు లందించును.)

శ్యామ—వారి యానందచిహ్నమగు దీనిని గన్నుల కద్దుకొనియెద.

(అని జాబులువిప్పి చదువుచుండును.)

ఇరా—మహాశయా, మిమ్ముఁ జూచుటవలన మా కానందము గలుగుచున్నది. ఈ ద్వీపమునకు స్వాగత మర్పించుచున్నాము.

లక్ష్మ—చాల సంతోషము. సేనాని విక్రముఁ డేమిచేయుచున్నాఁడు?

ఇరా—జీవించియే యున్నాఁడు?

కుము—బాబుగారూ, ఆతనియెడ భర్తగారి కించుక యాగ్రహము జనించినది. మీరు కొంచెము దీనిని సర్దుబాటు చేయవలయును.

శ్యామ—అటుల జరుగఁగల దనియే యింకను దలంచెదవా?

కుము—నాథా! ఏమంటిరి?

శ్యామ—(చదువుచు) "దీని నతిక్రమింపఁ జనదు."

లక్ష్మి—అమ్మాయీ, నీ మాటగాదు. అతఁ డేమో చదువుకొనుచున్నాఁడు. అయితే విక్రముని మాట యేమిటి? ఆతనికిని వీరికిని వైరము సంభవించెనా?

కుము—అది చాల విషాదకరమైన గాథ. నాకు విక్రముని పైఁగల వాత్సల్యముచే దానిని బోనాడ యత్నించితిని కాని—

శ్యామ—ఛీ, నోరు మూయుము.

కుము—నాథా, అదేమి?

శ్యామ—నీకు బుద్ధి యున్నదా?

కుము—ఇదేమి? ఇట్టి కోపమేల కలిగె?

లక్ష్మి—ఆగుము. ఆజాబునం దేదైన నాతనిమనసుఁ గలంచెనేమో. ఏలయనఁ దన యాధిపత్యమును విక్రమున కొప్పగించి యాతని నాంధ్రపురికిఁ దిరిగి రమ్మని ప్రభువు నాజ్ఞ యని నే నచట వినియుంటిని.

కుము—అది నాకుఁ జాల సంతోషదాయకము.

శ్యామ—ఔను నిజమే!

కుము—నాథా!

శ్యామ—నీకుఁ బిచ్చియెత్తిన బాగుండును.

కుము—నాథా, ఎంతమంచి కోరిక!

శ్యామ—ఛీ, రాక్షసీ, నోరు మూయుము.

(అని కొట్టును.)

కుము—ఇదియేమి? నే నేపాపమెఱుంగనే.

లక్ష్మి—శ్యామలరాయా, మా కుముద్వతిని నీవిట్లు కొట్టితి వని నేను ప్రమాణముచేసి చెప్పినను, ఆంధ్రపురమం దెవ్వరును నమ్మరు. ఇది నీకుఁ దగునా? పాపమామె యే డ్చుచున్నది. నీవేగి యోదార్పుము.

శ్యామ—ఇది రాక్షసి, బ్రహ్మరాక్షసి. ఈ మోసగత్తె భూదేవికిఁ గూడ భారమై పోవుచున్నది. ఓ రాకాసీ, యావలికిఁ బొమ్మి.

కుము—నే నిచట నిలిచి మీ కాగ్రహముఁ గలిగించు టెందు లకు? పోయెదను.

(వెడలిపోవును.)

లక్ష్మి—ఆమె చాల వినయవిధేయతలు గలది. నామాటఁ బాటించి యామెను వెనుకకుఁ బిలువుము.

శ్యామ—సఖీ!

కుము—ఏమిటికి నాథా?

శ్యామ—ఈ మెతో నీ కేమిపని యున్నదయ్యా?

లక్ష్మి—ఏమి నాకా? నా కేమిపని?

శ్యామ—ఔను నీవేకదా వెనుకకుఁ బిలువుమన్నది. అది యిట్లే తిరిగి చూచుచుఁ బోవుచుండఁగలదు. వగలేడ్పు

లెన్నియేని యేడ్వఁగలదు. నీ వన్నట్లు వినయముగలది. అతివినయముగలది. మాయలాడీ, నీ కెందుకు, నీ వేడ్చుచుండుము— నీ విటనుండఁ దగవు పొమ్ము. కావలసియున్నఁ బిలిపించెదనులే, పొమ్ము. ప్రభువునాజ్ఞ శిరసావహించి నే నాంధ్రపురికి మరలి వచ్చెదను. ఓసీ నీవింకను నిచట నిలిచియే యున్నావా? పొమ్ము పొమ్మావలకు.

(కుముద్వతి వెడలిపోవును.)

విక్రమునకే నాపదవి యొప్పగించెదనులే! అయ్యా, యీ రాత్రి మాయింటికే దయచేయుఁడు భోజనమునకు - కోతులు కొండముచ్చులతో నిండియున్న యీ పురమునకు మీకు స్వాగతము.

(అని నిష్క్రమించును.)

లక్ష్మ—

ఉ॥ కోప మొకింత లేని గుణకోవిదుఁ డంచుఁ బ్రశాంతబుద్ధిచే
నేపనినైనఁ దీర్పఁగల నేర్పరి యంచును నమ్మకంబుతో
మాపురరాజసభ్యు లొకమాటుగ నున్నతిఁ గూర్చినట్టి వాఁ
డీపురుషుం డనంగ మది కెక్కునె? చోద్యము వీని చైదముల్.

అక్కటా, యెవ్వాని సౌశీల్యమును భంగపఱుచుటకుఁ గాలపురుషునికిఁ గూడ వశముకాదని తలఁచితిమో, ఆ పుణ్యపురుషుఁ డితఁడే యగునా?

ఇరా—ఆతఁ డిపు డంతయు మాఱిపోయినాఁడు!

లక్ష్మ—ఆతనికి మతిదప్పి యుండలేదుగదా!

ఇరా—ఏమో, ఎవరు చెప్పఁగలరు?

లక్ష్మి—లేకున్న నిదేమిటి? కులకాంతను బైఁబడి కొట్టఁ బోవుచున్నాఁడే!

ఇరా—ఔను, అదేమో బాగుండలేదు. మఱింత కష్టదాయకమే యగును.

లక్ష్మి—ఆతఁ డెప్పుడు నింతియేనా? లేక, నే తెచ్చిన జాబులవల్ల నేదేని కలఁత యేర్పడియెనా?

ఇరా—నేను విన్నది కన్నది, అంతయు మీకుఁ దెల్పుట నాకు మర్యాదగాదు. మీరే యంతయుఁ బ్రత్యక్షముగఁ జూడఁగలరు. కనిపెట్టి యుండుఁడు. మీకే సర్వము బోధపడఁగలదు. నేను వృథాగాఁ జెప్ప నెందులకు? మీరాతని ననుసరించియుండి యేమేమి చేయుచుండునో కనిపెట్టి యుండుఁడు.

లక్ష్మి—ఈతని విషయమున మేము మిక్కిలి మోసపోయితిమి. నాకు చాలవిచారముగ నున్నది.

(నిష్క్రమించును.)

[తెరపడును.]

రెండవరంగము - కోటలో నొకగది.

[ప్రవేశము: శ్యామలుఁడు, దమనిక]

శ్యామ—అయితే నీ వేమియు నెఱుఁగనే యెఱుఁగవు!

దమ—నేను కనలేదు, వినలేదు, తలఁపలేదు.

శ్యామ—ఈమెయు విక్రముఁడును గలిసియుండఁగ నీ వెప్పుడును జూడలేదా?

దమ—చూడ కేమి? ప్రభూ, చూచితిని. కాని యందు దురుద్దేశ మణుమాత్రమును లేదు. వా రాడుకొనిన ప్రతిమాటయు నేను జెవులార వినియుంటిని.

శ్యామ—అయిన వా రిరువు రెన్నఁడును రహస్యముగ మాటాడనే లేదా?

దమ—అట్టి దెన్నడును లేదు దేవరా?

శ్యామ—నిన్ను దగ్గఱ నుండవలదు పొమ్మని యా సమయములం దెప్పుడును బంపలేదా?

దమ—లేనే లేదు.

శ్యామ—వీవనఁ దెమ్మనిగాని, అద్దముకొఱకుగాని, దువ్వెనకనిగాని—మఱేమిషపైనఁ గాని యెప్పుడును బంపియుండలేదా?

దమ—లేదు, లేదు; దేవా, లేదు; అట్టు లెన్నఁడును జరుగలేదు.

శ్యామ - అటులైన నాశ్చర్యముగ నున్నదే!

దమ—ప్రభూ, ఈమె నిష్కళంకపతివ్రతయని నేను వక్కాణింపఁగలను. ఇందుకు నా ప్రాణమాన. మీ రన్యథా తలంచియుండిన నట్టిచెడుతలంపుల నావలఁ బాఱఁదోలుఁడు. లేకున్న నది మహాపాపకరమ్మయి మీ కీర్తికిఁ గళంక మాపాదించును. ఏ నీచుఁడు మీ కిట్టి మాటలఁ జెప్పెనో యాతుచ్ఛుఁడు నాశముపొందుఁగాక! ఏలయన నీమెనే పతివ్రత కాదనిన నింక లోకమునఁ

బాతివ్రత్య మనునది సంపూర్ణముగ నశించినదని చెప్ప వలయును.

శ్యామ—ఆమె నిట కొకపరి పిలుచుకొని రమ్ము.

[దమనిక నిష్క్రమించును.]

ఇది వట్టి ముద్దరాలు. అయినను కావలసినమాట లేమో చెప్పినది. ఇంతకంటె నెక్కువ చెప్పఁజాలదు. అదో, అటుగాదు.

చ॥ అది నెఱజాణ దుర్భరరహస్యములన్ గడు నప్రమత్తయై
హృదయనిగూఢపేటికను నెప్పుడు భద్రముజేసి తాళమున్
బదిలముగా బిగించుకొను ప్రౌఢ, పతివ్రతభంగిఁ బూజలన్
వదలకచేయు నా కుటిలభామిని చర్య లెఱుంగశక్యమే.

[ ప్రవేశము : దమనిక, కుముద్వతి ]

కుము—నాథా, మీ యభీష్టమేద్ది ?

శ్యామ—చాలుఁ జాలు, యిటురా.

కుము—మీ మనోరథ మేమి ?

శ్యామ—ఏదీ నా ముఖమువంకఁ గన్నులఁ దెఱచి చూడుము.

కుము—ఇదియేటి వాంఛ !

శ్యామ—దమనికా, నీవు పోయి ద్వారముకడ నిలిచియుండి యెవరేని వచ్చుచున్నయెడల దగ్గియో, తుమ్మియో, యేదో సవ్వడిచేయుము. ఇట్టివి మీకు బాగుగ ననుభవమేగదా. (దమనిక వెడలిపోవును.)

కుము—నాథా, నే నిదే మీపాదము లంటి వేడుకొందును. మీ మనోగత మేమో తెలుపుఁడు. నా కూహింపరా

కున్నది. మీ మాటలయం దత్యంతభయంకరభావము మాత్రము కానగుచున్నది; కాని వాని యర్థము నాకు బోధపడుటలేదు.

శ్యామ—ఓసీ, నీ వెవ్వతెవు?

కుము—ఏమినాథా! నేను మీయర్ధాంగిని, మీచరణదాసిని కుముద్వతిని గానా ?

శ్యామ—అటులైన నిట నిలిచి "సచ్చరిత్ర"నని ప్రమాణము సేయుము. చేసి మహాపాతక మొడిఁగట్టుకొని యమదూతల పాలికేగుము. ఒకవేళ నీచక్కదనముఁ గాంచి నీవు సురాంగనవని భ్రమించి యమభటులు నిను దాఁకవెఱతురేమో !— అందు కని నీవు ప్రమాణము చేసి నీపాతకము రెట్టించుకొమ్మి.

కుము—జగదీశ్వరుఁడు సత్య మెఱుంగఁడా ?

శ్యామ—ఔను. ఎఱుగ కేమి ? నీవు మహాపాతకిని వను సత్యమును జగదీశ్వరుఁ డెఱుంగును.

కుము—నే నెట్లు పాతకి నైతిని ? ఎవరియెడ నేపాతకముఁ జేసితిని ?

శ్యామ—(రుద్ధకంఠుఁడై) కుముదా, కుముదా! పొమ్మి, పో మ్మావలకుఁ బొమ్మి.

కుము—ఇదియేమి దుర్దినము! ఏల విలపించెదరు ? నాథా ఈ మీబాష్పాంబువులకు నేనే కారణమా ? మిమ్ముల వెనుకకు మరలించుటకు మాతండ్రి కారకుఁ డని మీరు తలంచిన నన్నుదూరకుఁడు. అతఁడు మీకెట్లుకానివాఁడో,

నాకు నక్లే లేనివాఁడగును. మీకపకారి యగువాఁడు నాకు మాత్రముగాఁడా!

శ్యామ—హా, పరమేశ్వరా.

మ॥ నను హింసించుటె నియభీష్టమయినన్ నామీఁద నే యుట్టినిం
దను మోహించి పరాభవించి కడుసంతాపంబు చేకూర్చినన్
నను దారిద్ర్యగభీరసాగరములోనన్ ముంచి వేథించి చం
పిన సైరించెదఁగాని సైపఁదగ దీవిభ్రాంతి సర్వేశ్వరా!

(అని కూలఁబడును.)

అకటా, నన్ను బాధించుట కింతకంటె వేఱుమార్గము నీకు గోచరింపలేదా? నన్నొక బానిసఁగాఁ జేసి బంధములఁ బడఁద్రోసిన నోరెత్తక పడియుందునే...కాని, కాని,...నేను నాభావమర్మముల నెల్ల నెచ్చట భద్రమని నమ్మి దాచియుంచితినో, నాహృదయసర్వస్వ మెవ్వరి ప్రేమపాత్రమున ధారవోసితినో, యెవ్వరిని నా సౌఖ్యములకెల్లఁ గేంద్రస్థానముగఁ జేసి యానందించు చుంటినో, యెవ్వరు లేకుండిన లోకమెల్ల నంధకారమయం బని భావించియుంటినో; అట్టి నాభావములబర్హణి, నా ప్రేమంపులత, నాజీవితవాంఛాఫలంబు, నా తేజోమూర్తి నాకూరిమిచెలి...............అక్కటా! యేమని విలపింతును? నన్ను మోసగించి, నన్నుఁ దిరస్కరించి, నన్నుఁ బరాభవించి, యన్యసీమల విహారము సేయుట, నేను సహింపఁగలనా? ఏమానవుఁడైన సహింపఁగలఁడా? లేదు. లేదు. దుర్భరము, దుర్భరము! ...శాంతమా, నీవన్ని

చిన్నెలు నాయెడ నిరర్థకము లయ్యె. నన్ను వీడి యెందేని బొమ్ము, ఆగ్రహ పిశాచమా, నన్నావరించియుండుము.

కుము—నా హృదయేశ్వరుఁడు నన్ననుమానించియుండ లేదుగదా!

శ్యామ—ఆ! ఏమి నంగనాచివే. నీకొంగజపములు, నీ నక్క వినయములు, కుక్కబుద్ధులు, నింకఁ గట్టిపెట్టుము. జగదీశ్వరా! ఈ సుకుమారగాత్రిని, ప్రేమంపు మొలకను, నవ కంపుతీగను, ఏటికి సృష్టించితివి? ఇది జన్మింపకున్న బాగుండెడిదిగదా!

కుము—అజ్ఞానవశమున నే నేమైనఁ బాపకార్య మాచరించి యుంటినా యేమి? నాథా!

శ్యామ—ఛీ, ఈ లావణ్యశరీరలాలిత్యము, ఈకోమలావయవ సౌకుమార్యము, స్వైరవిహారమునకా? ఎంతటి మోసము! ఇంకను సిగ్గు లేక యేపాపముఁ జేసితి నని యడుగు చున్నావా? ఏమో యెఱుఁగనే యెఱుఁగవా? ఛీ! కులటా! నీ చెక్కిళ్ళు కోఱవిఁబెట్టి కాల్చినను పాప మన వచ్చునా? నీ పాపములు నేను వివరించి చెప్పవలెనా? నీ వెఱుంగవా? ఈ లోక మెల్ల నీ నోట నుమియుట లేదా? నీ చర్యకు దేవత లెల్ల ముక్కున వ్రేలిడుకొను చున్నారు. చంద్రుఁడు మొగముపై నీలిముసుగుఁ వేసి కొన్నాఁడు. అందఱకుఁ జక్కిలిగింతలఁ బెట్టు మలయపవ నము నిన్నుఁ జూచి ఛీంకారము వెట్టుచుఁ దొలఁగి

పోయెనే? ఇంకను నీ వేమి చేసితివో యెఱుంగవా? ఛీ! మాయలాడీ! యావలకుఁ బొమ్ము.

కుము—అయ్యో, ఏమిది! మీరు దైవసాక్షిగ నా యెడ నపచారముఁ జేసిరి.

శ్యామ—ఏమీ! నీవు జారిణివి గావా!

కుము—ఈశ్వరసాక్షిగ నే నట్టిదానఁ గాను. నాథా, ముమ్మాటికిని గాను.

గీ॥ పరులసంస్పర్శనుండి కాపాడుకొనుచు
నంఘుప్రేమవికాస నిష్యందిమధువుఁ
గోమలశరీరపాత్రను గూర్చియుంచి
నాథునకు సమర్పించుటె నాదునియతి.

నేయము ఈ నియతి దోషమైనగదా, యేను దోషిని నగుట, నాథా!

శ్యామ—ఇది దోష మెట్లగును?

కుము—అటులైన నే నెంతమాత్రము దోషిని గాను. నిస్సంశయముగ వక్కాణించెదను. ఇందునకు సకలదేవతలు సాక్షులు.

శ్యామ—ఇది నిక్కువ మేనా?

కుము—దైవము మనలఁ గాపాడుఁగాక.

శ్యామ—అటులైన నన్ను మన్నింపుము. నిన్నుఁ జూచి యానాఁడు శ్యామలుని వెంబడించిన యాంధ్రపురజారిణి యని తలంచితిని. నరకద్వారమునకై వేచియున్న యా రాకాసి యని భ్రమించితిని. దమనికా, యిటురా.

[ ప్రవేశము : దమనిక ]

ఓసీ, యింక నాపని ముగిసినది. నీకష్టము నే నెంచు కొనను. (అని యొకయూకను జేత నిడి) నే నిక్కడ నాడిన మాట లెల్ల మిగుల రహస్యముగ నుంచవలయు. ఒక్క మాట పైకివచ్చిన నీ ప్రాణములు దక్కవు.

[నిష్క్రమించును.]

దమ—ఏమి యీయన తాత్పర్యము? అమ్మా, నీ వెట్లున్నావు? ఇదేమి గ్రహచారము?

కుము—నేను నిద్రావస్థ నున్నాను.

దమ—నాథున కట్టి కోప మేటికి వచ్చెను?

కుము—ఎవరికి?

దమ—నాథునకు.

కుము—నీ నాథుఁ డెవ్వరు?

దమ—నీ నాథునకే, తల్లీ!.

కుము—నాకెవ్వరును లేరు దమనికా నన్నుఁ బలుకరింపకుము. నే జెప్పఁగొనదగినది యేమియు లేదు. ఈ రాత్రికి నా మధు పర్కపుచీర నా పడకపైఁ బఱచుము. మఱచిపోకుము. నీవు పోయి నీభర్తను దోడితెమ్ము.

దమ—ఇం దేదో చిత్రము గానఁబడుచున్నది.

(నిష్క్రమించును.)

కుము—ఎంతయుఁ దగియున్నది. ఇట్టి నిందకే నిర్భాగ్యురా లెంతయుఁ దగియున్నది.

చ॥ కలవర మందె మానసము, కర్కశమై హృదయంబు దుఃఖమున్
జెలువడనీదు...కన్నులకు నీరము రా దిటు లెంత యేడ్చినన్
పలుకఁగనోరురాక...యపవాదదవానలమందు జిక్కి గా
సిలు మని మూఁడుపంక్తులను జెక్కితె నానుదుటన్ బరాత్పరా.

నిష్కారణముగ నే నిట్టి నిందపా లగుటకుఁ దొలిబామున నేపాప మాచరించియుంటినో గదా!

(ప్రవేశము: దమనిక, ఇరావంతుఁడు.)

ఇరా—అమ్మా, కుశలమా, నన్ను బిలిపించిన దెందులకు? ఆజ్ఞాపింపుము.

కుము—చెప్పుటకు నోరాడకున్నది. బిడ్డ లేదేనితప్పుఁ జేసిన నెమ్మదిగ బుద్ధిజెప్పుట సహజమే. నేనుమాత్రము చిన్న దానునుగానా? నాకుఁగూడ నట్లే బోధింపరాదా? ఈ కఠోరవాక్యము లెందులకు?

ఇరా—అమ్మా! యిప్పు డేమి జరిగినది?

దమ—నాథా, ఏమని చెప్పుకొందును? ప్రభువుగా రీమెకు జారత్వదోష మారోపించి కులాంగనలు విననోర్వని దుర్భాషల నీమెను దూషించి చనియె.

కుము—ఇరావంతుఁడా, నే నట్టిదాననా? నీ వెఱుంగవా?

ఇరా—ఎట్టిదానవు?

కుము—నా నాథుఁ డాడెనని దమనిక చెప్పెఁగదా. అట్టిపలుకులు నా యెడ వర్తించునా?

దమ—ఆతఁ డీమెను జారిణియని దూషించెను. తప్పఁద్రాగిన బిచ్చగాఁడుగూడఁ దన భార్య నిట్లనఁడు.

ఇరా—అయితే యాతఁడి ట్లెందుకనియెనో!

కుము—ఏమో నా కేమియుఁ దెలియదు. కాని నే నట్టి దాన నెంతమాత్రమును గానని నొక్కి చెప్పఁగలను.

(ఏడ్చును).

ఇరా—అమ్మా, ఏడువకుము, ఇదిచాల దుర్దినము.

దమ—ఉన్నతపదవి నధిష్ఠించియున్నతండ్రిని, తదితరబంధు మిత్రులను, స్వదేశమును, ఇన్నిఁటిఁ బరిత్యజించి యీ విరూపుని జేపట్టినది జారిణి యనిపించుకొనుటకా? మానవతియగు యువతి కింతకంటె నవమాన మింకేమి కావలయు?

కుము—ఇ దంతయు నా పూర్వజన్మదుష్కృతము.

ఇరా—ఆతఁ డిట్లనుట చాలఁ గ్రూరత్వమే యగును. ఆతని కిట్టి దుర్బుద్ధి యేల కలిగె?

కుము—పరమేశ్వరునకే యెఱుక.

దమ—ఓర్వఁజాలని నీచుఁ డెవ్వడో యొకఁడు తనకేదో లాభము కలుగు నను తలంపున నీకుషాకార్య మాచరించియుండును. ఇందువలనఁ దనకేదో పదవి లభించునని యాశించి యొకతుచ్ఛుఁడు వీని చెవిలో నేమో యూది వీని మనసు మార్చి వేసినాఁడు. ఇది నిక్కువము.

ఇరా—ఛీ! అది నట్టిమాట. అట్లెన్నటికిని జరుగదు. అయినను నట్టివాఁ డెవఁ డున్నాఁడు?

కుము—ఒకవేళ నెవఁడైన నుండిన నీశ్వరుఁడాతని మన్నించుఁ గాక!

దమ—అట్టి దుర్మార్గునా మన్నించుట! యమభటు లాతనిఁ బట్టి మెముకలు కొఱుకుదురుగాక. ఆతఁడు జారిణి యని యీమెను నిందించుట కేమిపనియున్నది? 'ఆమె యేమి తప్పుఁ జేసినది? ఎక్కడ? ఎప్పుడు? ఎవరితోడ? ఇట్టి యకార్యమున కవకాశ మెట్లు లభించినది?' అని ముందు వెనుకలు విచారింపక, యిట్టి యసందర్భప్రసంగ మేల చేయవలె? మహాపాతకియగు నరాధముఁ డెవ్వఁడో యాఘూర్కుని మోసగించినాఁడు. పరమేశ్వరా, నీవైన నాదుర్మార్గుని బయలుపఱచి తగినశిక్ష వేయింపుము. ప్రతి సజ్జనునిచేతి కొక్కొక్క కొరడా నిచ్చి యట్టి చండాలుని విగతవస్తునిఁగాఁ జేసి చావమోదునట్లు చేయవలయును.

ఇరా—ఇంక నోరుమూసికొని లోని కేగుము.

దమ—ఆ పరమనీచుఁడు నాశనము గుఁగాక. అట్టివాఁ డెవఁడో మీకుఁ గూడ కొంచెము తలకెక్కించినాఁడా యేమి?

ఇరా—ఛీ, నీకు బుద్ధిలేదు. ఇటనుండి లేచిపొమ్ము.

కుము—ఇరావంతుఁడా, నా భర్తను బ్రసన్నునిగాఁ జేసికొన దగు నుపాయ మేదైనఁ గలదేని యోచింపుము. ఆతఁ డిట్లు విరక్తుఁ డగుటకుఁ గారణంబేమో నే నెఱుంగను. నేనో,

చ॥ మనమునఁ గాయకర్మముల మాటలయందున నాదుభర్తగా
వినుతి యొనర్తు శ్యాములుని, వేఱుతలంపను, దైవమాన; నఱ
గనికర మింత లే కతఁడు గాఱియవెట్టి పరిత్యజించినన్
వినుము మదీయమానసము వీడదు నాథునిపైని ప్రేముడిన్.

ఆతనిపై నాకుఁ గల ప్రేమ యఖండము, అగాధము, నిష్కళంకము. ఆతని క్రూరచర్యలు, నా శరీరమును బలురీతుల హింసించి నా జీవితము నిరర్థకముగాఁ జేయ వచ్చును గాని, నా నిశ్చలప్రేమప్రసవమ్మును దుంపఁ జాలవు. "జారిణి"యా! ఆ పదమే నే నుచ్చరింపఁజాల కున్నాను. నా యొడలు కంపమెత్తుచున్నది. సకలవిధ భోగభాగ్యముల నా కొసంగెద మనినను గొనగోటఁ ద్రోచివైచెదఁగాని నే నట్టినైచ్యమునకుఁ బాలుపడ నొల్లను.

ఇరా—ఇంచుక తాళుము. ఆతని స్వభావ మట్టిది. రాజకీయ వ్యవహారములలో నాతని కేదో కోపము గలిగినది. అది నీపైఁ జూపుచున్నాఁడు. అంతియేగాని వేఱుగాదు.

కుము—అంతకంటె వేఱేమియు లేదుగదా!

ఇరా—అదే కారణము. మఱేమియుఁ గాదని నేను దృఢముగాఁ జెప్పఁగలను.

(తెరలోఁ గలకలము, గంటలమ్రోఁత.)

అల్లదే వైతాళికులు భోజనవేళయని ప్రకటించుచున్నారు. నేఁ డాంధ్రపురరాయబారులు మీతోఁ గలిసి భుజింపనున్నారు. దుఃఖింపక లోని కేగుము. ఱేపటి కన్నియుఁ జక్కఁబడఁగలవు.

(కుముద్వతి, దమనిక, నిష్క్రమింతురు.)

(ప్రవేశము : రఘుపతి.)

ఇరా—ఓరీ రఘుపతీ, వచ్చినావా! విశేషము లేమి?

రఘు—నీవు నా కన్యాయముఁ జేసితి వని నాతలంపు.

ఇరా—నీ కెందులో నన్యాయము కలిగినదో చెప్పుము.

రఘు—అట్లనెద వేల! ప్రతిదినము నాచేత నేమో పనులఁ జేయించుచుంటివి. అందువలన నేమో లాభము కలుగు నని నే నాశించుచుండ లాభము లేక పోఁగా నా యాస లడుగంటిపోవుచున్నవి. నే నిట్లెంతకాలము గడపఁగలను? నావలనఁగాదు.

ఇరా—రఘుపతీ, నా మాట విందువా!

రఘు—దైవసాక్షిగ నింతవఱకు నీమాటలు విని విని నేను చెడిపోయినాను. నీవు చెప్పునదొకటి, చేయునదొకటి.

ఇరా—నీవు నిష్కారణముగ నన్ను నిందించుచున్నావు.

రఘు—నే నన్న ప్రతిమాటకు నిదర్శనములు చూపఁగలను. నా కున్నధన మంతయు నాశనము చేసికొంటిని. కుముద్వతి కిమ్మని నీ కిచ్చిన మణిహారము యోగినులఁగూడ నాకరిషింపఁగలదు. దాని నామె గ్రహించిన దనికూడ నాతోఁ జెప్పితివి. నాతో సఖ్యముఁ జేయు నాతురతఁ జూపెననికూడ నీవే చెప్పితివి. కాని యింతవఱ కేమియు నగుపడలేదు.

ఇరా—చాలుఁజాలు. బాగుగనేయున్నది. ఇంక నూరుకొనుము.

రఘు—ఊరుకొనవలెనా! నే నూరుకొనను. న న్నొకమాయలోఁ బడవేసినావు.

ఇరా—సరే.

రఘు—సరే యేమిటి? సరే...... నేను కుముద్వతికడ కేగి నన్ను నేనే తెలుపుకొనియెదను. ఆమె నా మణిహారము నాకుఁ దిరిగి యిచ్చివేసెనా నా మూర్ఖతకు నన్ను నేనే నిందించుకొనుచు నాదారినిఁ బోయెదను. లేకపోయిన నీపైఁ గసితీర్చుకొందును.

ఇరా—ఇంతకుముందే చెప్పితివిగా, కానీ.

రఘు—నే నేమి చెప్పితిని? చేయఁదలఁచుకొన్న దేమో చెప్పితిని.

ఇరా—నీవుగూడఁ గొంత ప్రయోజకుఁడవని నా కిపుడు బోధ పడినది. నాకు నీపై నిపుడు సదభిప్రాయము గలుగుచున్నది. ఏదీ నీ చేయి నిటు తెమ్ము. నిజ మాలోచించిన నీవు నన్నుఁ దిట్టుట న్యాయమే; కాని నే నింతవఱకు నీకొఱకే చాల శ్రమ పడుచుంటినని గట్టిగాఁ జెప్పఁగలను.

రఘు—అదేమో నాకుఁ దెలియదుగాని ఫలితముమాత్రము సున్న యని నాకుఁ దెలియును.

ఇరా—ఔను, ఆమాట నిజమే కాని యిప్పుడు చెప్పేది వినుము. నీకే గనుక ధైర్యసాహసము లుండిన, బుద్ధికుశలత యేమైన నిలిచియుండిన, ఈరాత్రి యన్నియుఁ జూపింపవలయును. లేపు కుముద్వతిని నీ కొప్పగింపకపోయిన నన్ను ముక్క ముక్కలుగాఁ గోసి కాకులకు గ్రద్దలకుఁ బాఱ వేయుము.

రఘు—సరే చెప్పుము.

ఇరా—జాగ్రత్తగా వినుము. శ్యామలునిస్థానమున విక్రముని నిలువఁబెట్టు మని నిన్న నాంధ్రపురమునుండి కబురువచ్చినది.

రఘు—నిజముగనా ? అటు లయిన నీకుముద్వతీశ్యామలు లిరువురు మరలనాంధ్రపట్టణమునకుఁ బోవుదు రన్నమాటె.

ఇరా—లేదు, లేదు. వా రిరువురు కర్ణాటకమునకుఁ బోవుదురు. కాబట్టి యిప్పుడు వారిప్రయాణమునకు భంగము గలిగింపవలెను. ఆలోచింపఁగా విక్రముని దొలఁగించు టొక్కటే యిందుల కుపాయము.

రఘు—తొలఁగించు టేమిటి? ఎట్లు తొలఁగింపవలెనని.

ఇరా—ఎట్లా? ఆతని శ్యామలునిపద మధిష్ఠించుట కసర్హునిఁగాఁ జేయుటే.

రఘు—అంటే.

ఇరా—సరే, పలుమాట లెందులకు? చెప్పెదను వినుము. ఆతని తల బ్రద్దలుగొట్టవలెను.

రఘు—ఇంతకు నిదియా నన్నుఁ జేయుమనునది?

ఇరా—ఔను, నిజముగా నీ క్షేమైన మేలుకలుగవలె ననిన దీనిని నీవు చేసితీరవలెను. ఈ రాత్రి యాతఁడు కళావతి యింట భుజించును. నే నిపు డక్కడికే పోయెదను. వాని కిప్పుడు పట్టఁబోవు మహాదశనుగురించి వాని కింకను దెలియదు. ఆతఁడు రాత్రికి షుమా రొంటి గంటవేళ నక్కడనుండి బయలుదేరునట్లు నే నేర్పాటుజేసెదను. అప్పుడు నీవు దారిలోఁ గనిపెట్టియుండి వానిని గడ తేర్పవలయు. నేను నీకు సాయపడుటకై నీ బాసటనే యుండెదను. సందేహింపక నాతో రమ్ము. అందువలనఁ గలుగు

లాభమేమో నీకు వివరించి చెప్పెదను. ఇది తప్పక నెఱవేర్ప వలెనని నీ వొప్పుకొందువు. పోవుదము పద.

రఘు—ఆ వివర మేమిటో నాకు నచ్చఁజెప్పవలెను.

ఇరా—నీకు నచ్చఁజెప్పి యొప్పించెదను లెమ్ము. పొద్దుపోవు చున్నది. పోవుదము, పద.

[ఇరువురు నిష్క్రమింతురు.]

(తెరపడును.)

---

మూడవరంగము - కోటలోని వేఱొక గది.

(ప్రవేశము : శ్యామలుఁడు, పరిచారకుఁడు, కుముద్వతి, దమనిక.)

శ్యామ—కుముదా, కుముదా.

కుము—ఏమి ప్రభూ.

శ్యామ—నీవు శీఘ్రముగఁ బరుండఁ బొమ్ము. నేనును లక్ష్మణ సింహుఁడును గలిసి త్వరలోనే తిరిగి వచ్చెదము. నీ పరిచారిక నింటికిఁ బంపివేయుము. తప్పక పంపివేయవల యును.

కుము—నాథా, అట్లే చేయుదును.

(శ్యామలుఁడు పరిచారకునితో నిష్క్రమించును.)

దమ—అతఁడిప్పుడు కొంచెము శాంతి వహించినట్లున్నాఁడు.

కుము—ఆయన యిప్పుడే తిరిగి వచ్చెద నని చెప్పినాఁడు. ఈ లోపల నిన్నుఁ బంపివేసి నన్నుఁ బరుండుమని యాన తిచ్చె.

దమ—నన్నుఁ బంపివేయు మనెనా ?

కుము—అది వారియాజ్ఞ. కావున దమనికా, నీ వింటికిఁ బొమ్ము. ఇప్పు డాతనిమనస్సు నొప్పింపరాదు.

దమ—అక్కటా, ఆతఁడు మొదట నీ కంటెఁ బడకయే యుండిన బాగుండెడిది గదా.

కుము—నే నట్లనుకొనను.

గీ॥ అతనిపై నాకుఁ బ్రేమ మత్యధిక మగుట
నతనికోపమున నొక సోయగము గాంతు
నాతనికఠోరవచనమ్ములందుఁగూడ
నారికేళసలిలరుచి నాకుఁ దోఁచు.

దమ—సరే, నీవు చెప్పిన మధుపర్కపుచీరనే నీ పడకపైఁ బఱచితిని.

కుము—ఏదైన నేమి? అన్నియు నొక్కటే, కాని యిది యొక పిచ్చి. నీ కంటె నేను ముందు మరణించిన ఈ చీరనే నాపైఁ గప్పుము.

దమ—చాలుఁజాలు. ఏటికీ వెడఁగుమాటలు?

కుము—నా తల్లికడఁ బద్మయను నొక్కదాసి యుండెడిది. అది యొక్కని మనసారఁ బ్రేమించెను. కాని యాతఁడు పిచ్చియెత్తుటచే నీమెను వీడి యెచటికో పోయెను. అప్పు డామె ప్రేమార్తయై యొక్కపరిణయగీతము రచించి దానిని గానముసేయుచు మృతినొందెను. నా కీరాత్రి యామెచరిత్ర మాటిమాటికి జ్ఞప్తికి వచ్చుచున్నది. ఇంక నీవు పొమ్ము. నే నాపద్మచరిత్రను బాడుకొనియెద.

కుము—(వీణను జేతఁ బుచ్చుకొని)

గీ॥ పాడువాటిన మామిడిమోడుచెంతఁ
బాఱు సెలయేటియొడ్డునఁ గూరుచుండి
వేడినిట్టూర్పు గాలిలో విస్తరింప
నెదను చెయిఁ జేర్చి తలవంచి హీనరవళిఁ
బాడుకొంటివి నీమనోభావసరళి
పద్మ! ముకుళితముఖపద్మ! ప్రణయసద్మ!!
పాడుకొంటివి నీమనోభావసరళి
ఆలకింపఁగ మనసయ్యెనమ్మ! నీదు
ప్రాణనాథతిరస్కృతప్రణయచరిత

* * * * *

దమనికా, ఆతఁడు వచ్చువేళయైనది నీవింకఁ బొమ్ము.

పద్మ! ముకుళితముఖపద్మ! ప్రణయసద్మ!
పాడుకొంటివి హృదయతాపమ్ముఁ దీర
దీనవై దుఃఖభాజన మైనకతను
బాడుకొంటివి హృదయతాపమ్ము దీర
నీమకన్నుల నొలికిన నీటిధార
చేతఁ గరగి స్రవించె శిలాతలమ్ము.
ఎఱిఁగి యెఱుఁగనిగతి సెలయేటిజలము
మారువల్కెను నీదు సీత్కారములకు.

* * * * *

(ఉలికిపడి) తాళుము, తాళుము. ఆతలుపుఁ దట్టిన దెవ్వరు?

దమ—ఎవరును లేరు. అది గాలిచప్పుడు!

కుము—

గీ॥పద్మ! ముకుళితముఖపద్మ! పణయసద్మ!
కంటి వకలుషప్రణయరాగమ్మ నీవు
మృదులహృదయంపు టార్తితో మేళవించి
పాడుకొంటివి హృదయతాపమ్మదీర ప్రాణనాథ...చరిత.

పాడుబెట్టిన పచ్చికబయలులోని
గడ్డిపూలను సమకూర్చి కంఠహార
మొంటి నిర్మించి ధరియించుకొంటి వీవు
ప్రియతిరస్కృతి కిసుమంత బెంగగొనక
పాడుకొంటివి హృదయతాపమ్మదీర ప్రాణనాథ...చరిత.

దమనికా ఇంక నీవు వెడలిపొమ్మ నా కుడికన్నదరు చున్నది. ఇది యాపద సూచించుఁగదా.

దమ—మ తేమియుఁగాదు.

కుము—అట్లనఁగా వింటిని, పోనిమ్ము. ఆహా, పురుషు లెంతటి వారు! ఎంతకైన దగుదురు! ఎవ్వతెయైన స్త్రీ యీరీతిగఁ దనభర్తను నిందింప సాహసించునా?

దమ—ఎక్కడనైన నొకతె యుండవచ్చును.

కుము—ఏమీా, అట్లనెదవు; నీ విట్టికార్యమున కొడిఁగట్టు దువా?

దమ—సమయమువచ్చిన నీవుమాత్రము చేయవా?

కుము—ఏమో, నావలనఁగాదు; లోకము తలక్రిందైనను నే నిట్టిపనిఁ జేయనొల్ల. నీవుకూడ చేయవని నా నమ్మకము.

దమ—ఒకప్పుడు కొంచెపుతప్పునకే గొప్పబాధలు సంభ వించుచుండును.

కుము—నీ వెన్ని చెప్పినను సరే, నీవుకూడ నట్లు తిట్టఁజాల వనియే నాతలంపు.

దమ—అదేలా! అవసరము వచ్చినప్పుడు నే నట్లు చేసెదను. కాని చీటికి మాటికిని గాదు. ఒకచీరకు, నొక రవికకునుఁ గాదు. అట్లు నిందించినయెడల నాభర్తరాజగునను కొనుము. అప్పుడు చేయఁగూడదా? అట్టిచో నేను దేనికిని వెనుదీయను.

కుము—ఈ ప్రపంచమెత్తివచ్చినను సరే నేను మాత్ర మిట్టి పాపము చేయఁజాలను.

దమ—ఏమయిన నేమి? పాపకార్యము పాపమే యగుఁగాక. ప్రపంచ మంతయు నొక్కటైనప్పుడు దానిని ప్రతిఘటించుటకంటె, నీ పక్షమున నేచేరి పిదపఁ బాపమునకుఁ దగిన యుపకృతిఁ జేయవచ్చును.

కుము—ఏమో, ఎవ్వతెయు చేయ దనియే నా తలంపు.

దమ—కాదు, కాదు. అది పొరపాటు. కాని స్త్రీ లట్లు చేయ వలసివచ్చుటకుఁ బురుషులే కారణభూతులు. వారు సతుల యెడఁ దమధర్మము వీటఁబుచ్చి వేశ్యాలోలురై మనకు భోగ్యము లగుముద్దుముచ్చటలఁ బరులపాల్సేయుచు, నంతటఁబోక, మనల నిష్కారణముగ ననుమానించుచు, దూషించుచుండినఁ బడియుండవలసినదేనా? మన చేతి కొక్కకాసైన నొసఁగక, యడిగిన పైఁబడి కొట్టఁబోవు చుండిన సహించి యుండవలెనా? స్త్రీ హృదయ మెంత మృదులమైనను నించుకేని కోపము జనింపకుండునా

తమవలెనే తమ సతులకుఁగూడ జ్ఞాన ముండుననియు, వారుకూడ తమవలెనే మానవులేయనియు, భర్తలు గ్రహింపవలదా? తన ధర్మపత్నిని వీడి పురుషుఁ డేల పరకాంత కాశింపవలయు? అది విలాసమా? విలాసమైనఁ బ్రేమసంజనితమా, లేక భోగలాలసతయా? అట్లే స్త్రీలకు మాత్రము ప్రేమ జనింపరాదో! ఎప్పుడును భర్తలు భార్యలయెడ బుద్ధిఁగలిగి సంచరింపవలయు. లేకున్న స్త్రీలో నర్చు దోషముల కెల్లఁ బురుషులే బాధ్యు లగుదురు.

ఇరా—ఇంక నీవు పొమ్ము. ఈశ్వరుఁడు నాపై నా భర్తకుఁ గూడ నట్టి సదభిప్రాయముఁ గలిగించుఁగాక.

[నిష్క్రమింతురు.]

(తెరపడును.)



# ముగ్ధప్రణయము.

## పంచమాంకము

మొదటిరంగము - సింహళమున రాజధానీనగరమున నొక వీథి.

[ప్రవేశము: రఘుపతి, ఇరావంతుఁడు]

ఇరా—రఘుపతీ, ఈ చెట్టుమాటున డాగియుండుము. ఆతఁడిపుడే వచ్చును. ఈ పదనుకత్తి నొరనుండి పెఱికి సమయముఁ గనిపెట్టి యాతనిశరీరమున లోతుగ నాఁటుకొను నట్లు పొడువవలయును. ఏమియు భయములేదు. ధైర్యముగ నుండుము. నేను నీ వెనువెంటనే యుండెదను. ఇంతవఱకు మనము చేసినప్రయత్నముల ఫలితమెల్ల నేఁటి విజయముపై నాధారపడియుండును. ఈ కార్యముఁ దీర్చితిమా, మనము సంపూర్ణముగ విజయముఁ గాంచినట్లే. లేదేని మనము కడు దురవస్థలపాలుగావలసివచ్చును. ఈ మాట మనసున నుంచుకొని గుండె ఱాయి చేసికొని సిద్ధసంకల్పుఁడవు గమ్ము.

రఘు—నీవు దగ్గఱనే యుండుము, నేను గుఱితప్పుదు నేమో?

ఇరా—నే నిక్కడనే, నీ చేతిక్రిందనే యుందును. ధైర్యము, పూని వెనుకకు నక్కియుండుము.

(వెనుక కొందిగి దాగియుండును.)

రఘు—(స్వగతము) నా కీపని చేయ మనసొప్పుట లేదు. కాని యీతఁడనేక విధముల నన్నాడఁబఱుచుచున్నాఁడు. కానిమ్ము. ఈ యొక్కనినే గదా. ఒక్కపోటుతోఁ జచ్చి క్రిందఁబడును.

ఇరా—వీనికి బాగుగాఁ బురెక్కించినాను. ఇప్పుడు వీఁడు విక్రమునిఁ జంపినను సరే, లేక విక్రముని చేత వీఁడు చచ్చి నను సరే. లేక యొకరి నొకరు పొడుచు కొని యిరువురు జచ్చినను సరే! ఎటులైననాకు లాభమే. రఘుపతి బ్రతికి యుండిన కుముద్వతికిచ్చెద నని చెప్పి నేను కాఁజేసిన సొమ్ము లన్నియుఁ దెచ్చి యిమ్మని వేధించును. విక్రముఁడు బ్రతికి యుండిన మరల నాకుఁ జైయధికారి కాఁగలఁడు. నేను మధ్య నిరర్థకుఁడనై పోవలయును. నే నెంతమాత్రి మది సహింపఁజాలను. ఇదిగాక యీఘూర్కుఁడు నేను దనతోఁ జెప్పినరహస్యములఁగూర్చి వీని నడిగినయెడల నాగుట్టు బయటఁబడి నాపుట్టి మునుఁగును. కాబట్టి యెటులైన నీయిరువురును గడ తేఱవలసినవారే. ఇదే విక్రముఁడు వచ్చుచున్నాఁడు.

[ప్రవేశము : విక్రముఁడు.]

రఘు—వాని నడక నే నెఱుంగుదును. ఈవచ్చునది వాఁడే. దొంగా చచ్చితివిరా !

(అని పరుగెత్తుకొనివచ్చి విక్రముని కత్తితోఁ బొడుచును.)

విక్ర—ఈ దొంగపోటు నన్ను చంపెడిదే కాని, నా కవచము కాపాడినది. ఓరీ ! హంతకుఁడా, ఇదే చచ్చితివి కాఁచు కొమ్ము.

(కత్తి దూసి రఘుపతిని దఱుముకొనివచ్చి పొడుచును.)

రఘు—చచ్చితి, చచ్చితి.

(ఇరావంతుఁ డొక్క-దాఁటున వెనుకనుండి విక్రముని కాలిని నఱికి మఱల వెంటనే పరుగిడిపోవును.)

విక్ర—అయ్యో, అయ్యో, నా కాలు విరిగినది. చచ్చితి, చచ్చితి. హత్య, హత్య!

(పడిపోవును.)

(ప్రవేశము : శ్యామలుఁడు దూరమునుండి.)

శ్యామ—(స్వగతము) ఇది విక్రముని స్వరమువలెనే యున్నది. ఇరావంతుఁడు తనమాట నిల్పుకొనియుండును.

రఘు—అయ్యో, అయ్యో, నే నెంతటి దుష్టుఁడనైతిని.

శ్యామ—(స్వగతము) అందులకు సందేహ మేమి ?

విక్ర—తోడ్పడుఁడు. చికిత్సకుని బిలిపింపుఁడు, తోడ్పడుఁడు.

శ్యామ—(స్వగతము) అతఁడే, అతఁడే! భళీ, ఇరావంతుఁడా, భళీ. భృత్యుఁ డన, నీవుగదా భృత్యుఁడవు. స్వామికార్యమును నీదిగ భావించి యిట్టి సాహస మొనర్చితివి. నా

యెడ జరిగిన యపరాధమును నా కెఱిగించుటయే కాక ప్రతీకారముఁగూడ నీవే తెలిపి రిపుణ్యముఁ గట్టుకొంటివి. ఆహా, నీ యౌదార్యమును నే నెంతని కొనియాడఁగలను! ... ... ... ఓమాయావీ, కుముదా, ఇదే, నీవిటుఁడు నరకకూపమునకుఁ గూలిపోయినాఁడు నీకు గూడ నట్టిగతియే మూడనున్నది. ఇదిగో, వచ్చుచున్నాను. ఇంక నీ మాయవలపులకు నేఁజిక్కను. నీకులుకులకు నే నులుకను. నీచూపులకు నే బెదరను. భోగాసక్తమగు నీ పడక యొక్కతుత్రిటిలో రక్తసిక్తమై పోఁగలదు.

[నిష్క్రమించును.]

[ప్రవేశము: లక్ష్మణ సింహుఁడు, భటుఁడు.]

విక్రి—ఏమిది ఇచట నెవ్వరును లేరా? దిక్కులేక చావవలసినదేనా? (గొంతెత్తి) హత్య, హత్య! తోడ్పడుఁడు.

లక్ష్మణ—ఏదో దీనారవము వినవచ్చుచున్నది. ఎవరికో కష్టము సంభవించినది.

విక్రి—అయ్యా, యించుక తోడుపడరా?

రఘు—ఛీ, నీచాధమా!

లక్ష్మ—ఇరువురు ముగ్గు రున్నట్లున్నారు. ఇది చాల దుర్దినము. ఒకవేళ వీరే దొంగలేమో!

రఘు—ఎవ్వరును. రారా దిక్కులేక, రక్తముకాఱి చావవలసినదేనా!

లక్ష్మ—తాళుము, తాళుము, (ఇరావంతుఁడు, దీపముతో సాయుధుఁడై ప్రవేశించును) ఇదిగో! యెవ్వరో సత్వ

రుషుఁ డాయుధపాణియై దీపముఁ దీసికొని వచ్చుచున్నాఁడు.

ఇరా—ఎవ రక్కడ? "హత్య హత్య" అని కేకలుబెట్టిన వారెవ్వరు?

లక్ష్మ—నే నెఱుంగను.

ఇరా—మీరా రా కేకలు విన్నారు గదా!

విక్రి—ఇక్కడ, ఇక్కడ, నా కించుక తోడుపడి పుణ్యము గట్టుఁ కొనుఁడు.

ఇరా—ఏమి సంభవించినది? నీ వెవ్వరవు. ఇట్లనదవై యేడ్చెద వెందులకు?

విక్రి—ఇరావంతుఁడా, నేను. నేను విక్రముఁడను. దొంగలచేఁ గొట్టబడితిని. నా కించుక సాయపడుము. నేను లేవఁజాలను

ఇరా—అయ్యో, అయ్యో, విక్రమసింహా, నీవా? ఏ చండాల హాతకు లిట్టి పనిఁ జేసిరి?

విక్ర—అందులో నొక్కఁ డిచటనే లేవలేక పడియుండనోపు.

ఇరా—ఓరి హాంతకులారా. (లక్ష్మణునిఁ జూచి) ఓయీ, నీ కచ్చట నేమిపని. ఇచటికి వచ్చి కొంచెము సాయపడరాదా?

రఘు—నే నిక్కడ పడియున్నాను. కొంచెము లేవఁదీయుఁడు.

విక్రి—అడుగో, వాఁడే యా దొంగలలో నొకఁడు.

ఇరా—ఓరీ, కిరాతకుఁడా! నీకు సాయపడవలెనా? ఇదిగో, నీ బాధ తొలఁగింప సాయపడెదను. (అని రఘుపతిని కత్తితో నఱికివేయును.)

రఘు—ఓరీ, పాపిష్ఠా! మానవహంతకా, ఇరావంతా!

ఇరా—ఛీ, ఛీ, అంధకారమున హత్యలు గావింపఁ బాలుపడితిరా? మిగిలినదొంగ లేరి? ఈ పట్టణ మింకను నింత నిశ్శబ్దముగ నున్న దేమి? హత్య, హత్య. ఎవ్వరును లేవ రేమి? అయ్యా, మీ రెవ్వరు? పలుక రేమి? మిత్రులా? శత్రులా?

లక్ష్మ—పిదప విచారింపవచ్చును. ఇప్పు డేమి కావలె నీకు?

ఇరా—అయ్యా, తమరా! దయయుంచి క్షమింపుడు. దొంగలచేఁ గొట్టబడి విక్రమసింహుఁడిటఁ బడియున్నవాఁడు.

లక్ష్మ—ఏమి? విక్రమసింహుఁడా?

ఇరా—అన్నా, దెబ్బ లెక్కడ తగిలినవి?

విక్ర—నాకుడికాలు రెండు తుండెము లైనది.

ఇరా—అయ్యో, యెంతటి దుర్దశ! అయ్యలారా, దీపము కొంచెము చూపుఁడు. నా చొక్కాయ చించి కట్టు కట్టెదను.

[ప్రవేశము: కళావతి.]

కళా—ఏమి జరిగినది? ఆ యఱచిన దెవ్వరు?

ఇరా—అఱచిన దెవ్వరా?

కళా—ఆహా, నా ప్రియా, విక్రమా, నీవేనా! హా నాథా.

ఇరా—ఛీ, టక్కులాడీ, అవతలికిఁ బొమ్ము. విక్రమా, ఇంతకును నీ కిట్టి చేటుఁ దెచ్చిన దెవ్వరో యెఱుంగుదువా?

విక్ర—ఏమో నాకుఁ దెలియదు.

ఇరా—త్వరలో నేదేని సవారి దెప్పింపుఁడు. ఈతని మోసికొని పోవుదము.

కళా—అయ్యో, మూర్ఛిలుచున్నాఁడే. హా విక్రమా, హా ప్రియా. [సమీపమున నే క్రిందఁ బడును]

ఇరా—అయ్యో, ఈ వగపులాడి కిందులోఁ దప్పక జోక్య ముండి యుండునని నా నమ్మకము. విక్రమసింహా, ఇంచుక యోపికపట్టుము. ఏదీ దీపమిటు చూపుఁడు. ఈ హంతకుఁడు మన మెఱిఁగినవాఁడేమో చూతము. [సమీపించి] అక్కటా, యిదేమి చోద్యము! నా బాల్యమిత్రుఁడు రఘుపతి యిందుఁ బడియున్నవాఁడు. వీఁ డెట్టి నీచకార్యములకుఁ బాలుపడియెను.

లక్ష్మి—ఏమీ, రఘుపతియా!

ఇరా—ఔను, అతఁడే. మీరుగూడ వాని నెఱుంగుదురా?

లక్ష్మి—ఎఱుఁగ కేమి?

ఇరా—విక్రమా, యిపు డెట్లున్నది? సవారి తెండు. శీఘ్రమే కొనిరండు. [సవారి తేఁబడును] బుద్ధిమంతు లెవరైన వీని నందుఁ జేర్పుఁడు. నే నిదే పోయి చికిత్సకునిఁ దోడుకొని వచ్చెదను. మా యింటికిఁ దీసికొనిపొండు. ... ... ... ఓసీ, కళావతీ, నీదారిని బొమ్మమ్మా. నీసాయ మెవ్వరికి నక్కర లేదు పొమ్ము. ... ... విక్రమా! ఈ చచ్చి పడి యున్నవాఁడు నా చెలికాఁడు సుమా. మీ యిరువురకు విరోధ మెట్లుకలిగె.

విక్రి—ఏమియు లేదు. ఆతఁ డెవ్వరో నే నెఱుఁగను కూడ నెఱుఁగను.

ఇరా—(కళావతిని జూచి) ఏమే తెల్లబోయెద వేమి?(భటుని జూచి) ఇక్కడనుండి శీఘ్రముగ నీతని, గొంపోవుఁడు. (లక్ష్మణసింహుని జూచి) మహాశయా, ఈ కులటను దిల కింపుఁడు. ఎటులఁ దెలతెలపోవుచున్నదో! దాని కన్నులఁ జూడుఁడు. ఎటుల భీతిల్లుచున్నవో! దీనివంకఁ దేఱిచూచిన కొలఁదియు మనకు విశేషములు బోధపడఁగలవు. నాలుక మాటాడకపోయినను జేసినదోషము ముఖమునఁ గానఁ బడుచున్నది. (విక్రముఁడు సవారిలోఁ గొని పోవఁబడును.)

[ప్రవేశము : దమనిక]

దమ—ఏమి నాథా? ఏమి ఘోరము జరిగినది.

ఇరా—ఈ కటికిచీఁకటిలో రఘుపతియు మఱి కొందఱును గలసి విక్రముని దలపడి గాయపఱచిరి. రఘుపతి మృతుఁ డయ్యెను. మిగిలినవారు పారిపోయిరి.

దమ—పాప మెంతమంచివాని కెట్టిగతి పట్టినది.

ఇరా—వేశ్యాలోలురగతి యెప్పటికి నింతే. అయినను నీవు పోయి రాత్రి విక్రముఁ డెచ్చట భుజించెనో కనుఁగొని రమ్ము.

ఇరా—(కళావతిని జూచి) ఏమే వడవడ వడఁకెద వెందులకు?

కళా—ఈరాత్రి నాయింటనే భుజించెను. కాని నే నందు లక్కై పడఁకుటలేదు.

ఇరా—ఆఁ! అలాగా! సరే; అయితే నీపైన నేరారోపణ చేయఁబడవలసి యున్నది. ఇంక నా వెంట నడువుము.

దమ—ఛీఛీ! కులటా!

కళా—నే నెంతమాత్రి మట్టిదాననుగాను. నన్ను దూషింప వచ్చిన నీకంటె నుత్తమురాలనే.

దమ—నాకంటెనా? పో పో; చాలుఁ జాలు.

ఇరా—అయ్యలారా, నే నేఁగి విక్రమునకుఁ గట్లు గట్టించి వచ్చెదను. ఓసీ, కళావతీ, నీ విటురా. నీ కథయేమో పూర్తిగఁ జెప్పుము. దమనికా, నీవు వెంటనే కోటలోని కేగి రాయలవారి కీ వృత్తాంతమతయుఁ దెలుపుఁము. పొమ్ము, శీఘ్రమే పొమ్ము.

(స్వగతము) ఈ రాత్రియే నా యదృష్టమో దురదృష్టమో బయటపడవలసి యున్నది.

[నిష్క్రమించును.]

[అందఱును మరియొక దారిని వెడలి పోవుదురు.]

(తెరపడును.)

---

రెండవరంగము - రాచనగరునఁ బడకగది.

[కుముద్వతి పడకపైఁ బరుండి నిద్రించుచుండును. దీపము సన్నగ వెలుఁగుచుండును.]

శ్యామ—(ప్రవేశించి దిశలఁ బరికించి) ఔను, దుష్టసంహారమే నాకు ముఖ్యసంకల్పము. అవినీతి యెచ్చోట మొలకయెత్తినను దానిని వేరంటఁ దెగనఱకవలసినదే. సాధ్వీమణులు అరుంధతి, అనసూయాదులు తారకలై మింట వెలయుచున్నారు. ఈ పవిత్రమూర్తులయెదుట నీ నీచురాలి పాప

మును జేరొక్కనఁజాలను. అట్లయ్యు దీనిరక్తమును నేఁ జూడఁజాలను. ఈ లావణ్యరాశి దేహమును నే గాయపఱచఁజాలను. అక్కటా! శిరీషకుసుమపేశలమగు నీ శరీరమును నేను శోషింపఁజేయఁగలనా! ... ... ... కాని యీ మాయావి జీవించియుండిన ని క్లెందఱినైన మోసగించును. కాఁబట్టి యీ రాకాసి యిప్పుడు చచ్చి తీరవలె. ... ... ... ఈ దీపము వెలుఁగుచున్నది. ఇది యుండరాదు. ఔను, ముందుగా నీదీపము నార్పివేయవలెను. ... ... మినుకు మినుకుమని వెలుంగు నీ దీపమును నే నార్పివేయఁగలను. పిదపఁ బశ్చాత్తప్తుఁడ నగునెడలఁ దిరిగి యథారీతి నుండునట్లు వెలిగింపఁగలను. కాని,యిది యట్టిదిగాదు. ఈ నిరుపమానసౌందర్యరాశియం దిమిడియుండి మెఱయుచున్నది ప్రకృతియొక్కసృష్టివైచిత్ర్యమెల్లఁ బ్రతిబింబించు జీవకళ. ఈశ్వరచిద్విలాసమును బ్రకటించు తేజోదీపము ఒక్క వ్రేటున దీనినిగూడ నార్పివేయఁగలను; ఈ తేజము నాహరింపఁగలను. కాని, కాని...పిదపఁ గావలెననిన మరల వెలిఁగింపఁగలపవిత్రాగ్నికణంబు లెందున్నవో నా కెఱుంగరాదు. ఈ దేహమున మరలఁ బ్రాణము పోయఁగల జీవరేణువును బ్రసాదించు జీవకళావిస్ఫూర్తి యెందున్నదో నా కెఱుకలేదు! ... ... ఇంతయేల? చెట్టునుండి కోసిన యీ గులాబిపువ్వునకు జీవముపోసి నిలువఁబెట్ట నాతర

మగునా! ఇది నేలఁబడి వాడిపోవలసినదేగాని. కావునఁ జెట్టున నుంచియే పరిమళ మాస్వాదించుట వివేకము. అట్లే

ఈ కోమలశరీరశిరీషసుమ మెండిపోవకమున్నె
ఈ కపోలములయరుణకాంతి యెగిరిపోవకమున్నె
ఈ ముఖేందుబింబసుధారస మింకిపోవకమున్నె
ఈకవోష్ణనిశ్వాసముల వేడిమి యెల్ల చల్లారకమున్నె
ముద్దుగొనియెదఁ, ఒక్కముద్దు గొనియెదఁ;
హృదయతాపమ్ము దీఁగ, నధరసుధారసముఁ గ్రోలెదఁ.

(అని ముద్దుపెట్టుకొనును. పారవశ్యము నటించును.) అక్కటా! మనోహరసౌరభవిలసిత మ్మగు దివ్యసుమమ్ము భాతి మోదావహమ్మగు నీచుంబనము ముందట న్యాయవివేచన మంతరించి పోవుఁగదా! ఇంకొక ముద్దిమ్ము! (అని మరల ముద్దుగొనును)... ... కుముదా, కుముదా! నే నిప్పుడు నిన్ను సంహరింప వచ్చితిని. నీవు మరణించి గూడ నిట్లేయుండుము. అపుడు నేను నిశ్చయముగ నిన్నుఁ బ్రేమింతును. ఇంకొకసారి ముద్దుగైకొననిమ్ము. (ముద్దిడుకొని) ... ... కుముదా, మహానందదాయకమగు నీచుంబనమునం దింతటిమహావిషాద మిమిడియుండునని నేను కలనైనఁ దలంపనైతిని గదా — అయ్యో! నే నెంతని విలపింతును? నా హృదయము కఠోరపాషాణ మైనది. నాయశ్రువులు కరుడుగట్టుచున్నవి. నాదుఃఖము మహాపవిత్రమైనది. ఎచ్చట నిష్కళంకమగు విశుద్ధప్రణయ ముద్భవించి వికసించెనో, అట్టి హృద

య్యాంతరాళము నుండియే యీ శోకము వెల్లివిరియుచున్నది.........ఇదిగో యీమె కదలుచున్నది. మేలకువ వచ్చినట్లున్నది. కుముదా!

కుము—ఎవరది? నాథా!

శ్యామ—ఔను కుముదా, నేనే.

కుము—నిమురింపవచ్చితిరా?

శ్యామ—కుముదా, నీ వీరాత్రి దేవిని స్మరించితివా?

కుము—ఆ! స్మరించితిని.

శ్యామ—నీ విదివఱకేమైనఁ బాపము చేసియున్నచోఁ దత్పరిహారమునకై మరల నొకసారి జగన్మాతను సంస్మరించుకొనుము.

కుము—ఇదేమి ప్రసంగము నాథా?

శ్యామ—ఈమాటలతో నేమిలే. అరగడియకాలము పరాత్పరుని స్మరింపుము. నిన్ను హఠాత్తుగఁ జంపనోల్లను. శీఘ్రమే ముగింపుము.

కుము—చంపుటేమిటి?

శ్యామ—ఔను చంపుటయే... చంపుట - సంహరించుట!

కుము—హా! పరమేశ్వరా! నాపైఁ గరుణింపుము.

శ్యామ—తథాస్తు.

కుము—ఆపలుకు మీహృదయమునుండి వెలువడినదేయైన మీరు నన్నుఁ జంపరు.

శ్యామ—అటులనా? (తల పంకించును)

కుము—నాథా, ఏమది? మిమ్ముఁజూడ నా దేహము కంపించు చున్నది. మానసము భయాకుల మగుచున్నది. అట్లు గ్రుడ్లురిమెదలేల? నే నేమపరాధ మొనర్చితిని? నే నేపాప మెఱుంగనే! ఏల యీ కాఠిన్యము? నేను నిరపరాధి నగుటచే ధైర్యము గలుగుచున్నది? కాని మీ ఘోర రూపముఁ జూడఁజాలకున్నాను.

శ్యామ—నీ పాపముల నెల్ల నొక్కసారి తలంచుకొమ్ము.

కుము—మిమ్ము మనసారఁ బ్రేమించుట దక్క తదన్య మెఱుంగను.

శ్యామ—ఆఁ! అందులకే యిప్పుడు ప్రాణముల వీడవలయును.

కుము—ప్రేమించుటకు ఫలము ప్రాణములఁ గొనుటయా? ఇదెక్కడిధర్మము? పండ్లు పటపట కొఱికెదరేల? ఏలొకో దురహంకారము మిమ్మావేశించి యున్నది. మీయొడలు కంపించుచున్న దెందులకు? మీ కోపమునకుఁ గారణము నేను గానుగదా?

శ్యామ—ఇంకఁ జాలు నోరు మూయుము.

కుము—చిత్త మట్లే యుండెదను. కాని మీ ఘోర రూపము నుపశమింపఁజేయుఁడు.

శ్యామ—నాకు బ్రియతమమగు చేతిరుమాలును నీవు విక్రి మున కిచ్చివేసితివి.

కుము—నే నీయలేదు. నే నెంతమాత్రి మెఱుంగను. అతనిఁ బిలిపించి యడుగుఁడు.

శ్యామ—వన్నెలాడీ, నీవు మరణావస్థ నున్నావు. అసత్య మాడి దుర్భరనరకకూపమునఁ బడిపోకుము. నిక్కము పలుకుము.

కుము—నేను సత్యమునే పలికితిని. కావున నే నింతలోఁ జావను.

శ్యామ—లేదు. ఇప్పుడే చచ్చెదవు. నీ వొనర్చిన పాపము లన్నియు నొప్పుకొనుము. నీ విపుడు లేదన్నను నా యను మానము తీరదు. నీ విపుడు దండధరుని కట్టెదుట నున్నా వని గ్రహించి నిక్కము వచింపుము.

కుము—హా, దైవమా, నాపైఁ గరుణింపుము.

శ్యామ—అట్లె యగుఁగాక !

కుము—అట్లె మీరుగూడఁ గరుణింతురు గాక. నాజీవితము నందెల్ల మీయెడ నే నే మపరాధముఁ జేసియెఱుంగను. నేనుసామాన్యముగనుద్యోగియెడనుండఁదగినవాత్సల్యముఁ జూపితినే గాని విక్రముని నే నెన్నడును బ్రేమించియుండ లేదు. నే నాతని కెట్టి బహూకరణమును జేసియుండలేదు.

శ్యామ—ఇవన్నియు నాకక్కఱ లేదు. నాచేతిరుమాలు నా తనికడఁ జూచితిని. నాకంతియె చాలును. ఛీ, మానహీనా! నిన్నుఁ జూచినకొలఁదియు నా హృదయము కాఠిన్యము వహించి నన్ను మఱింత స్థిరసంకల్పునిఁగాఁ జేయుచు న్నది. నేను స్వయముగనే నా చేతిరుమాలును విక్రముని కడఁ జూచితిని. నీనేరము ధ్రువపఱచుకొంటిని.

కుము—అటులైన నాతని కది యెందేని దొరికియుండ వచ్చును. నే నాతని కిచ్చియుండలేదు. ఆతనిఁ బిలిపించి నిక్క మొప్పుకొను మని శాసింపుఁడు.

శ్యామ—ఆతఁ డొప్పుకొనినాఁడు.

కుము—నాథా, ఏమని!

శ్యామ—నీ ప్రేమఁ జూరఁగొన్నట్లు.

కుము—అక్రమచర్యలకా?

శ్యామ—ఔను.

కుము—హరి, హరీ! అసత్యము- అక్రమము- అన్యాయము. ఆతఁడ శ్లైన్నటికిని వచింపఁజాలఁడు.

శ్యామ—ఔను, ఇంకమీఁదట వచింపఁజాలఁడు. ఆతని నోరు మూయఁబడినది. బుద్ధిమంతుఁ డిరావంతుఁ డాపనిఁ దీర్చినాఁడు.

కుము—నాకు భయ మగుచున్నది. ఏమి! ఆతఁడు గతించినాఁడా!

శ్యామ—ఆతని దేహమున నెన్ని రోమము లున్నవో అంత మంది విక్రములై వెలసినను వారి నందఱ రాకాసివలె పట్టిమ్రింగినను నాకసి తీరదు.

కుము—అయ్యో, ఆతఁడు మోసగింపఁబడినాఁడు. ఇంక నా మాటకు సాక్షి యెవ్వరు?

శ్యామ—ఛీ, మానహీనా, నాముఖము నెదుటనే వానినిఁ దలంచి యేడ్చుచున్నావుగా?

కుము—నాథా, నన్నిపుడు చంపవలదు. ఈరాత్రికి బ్రతుక నిండు, రేపు వధించెదరుగాని. నా సౌశీల్యమును ఋజువు పఱచుకొనుట కొక్కదిన మవకాశ మీయవలెనని నే నిదే వేడుకొనుచున్నాను.

శ్యామ—నీ వెంత కొట్టుకొనినను నే నిపుడు విడిచిపెట్టను.

కుము—పోనీ, ఒకగంట తాళుఁడు.

శ్యామ—నిశ్చయించిన వెనుక నాలసింపరాదు.

కుము—అయిన నన్నొక్కమాఱు దేవిని స్మరించుకొననిండు.

శ్లో॥ వందే పద్మకరాం ప్రసన్నవదనాం సౌభాగ్యదాం భాగ్యదాం
హస్తాభ్యా మభయప్రదాం మణిగణై ర్నానావిధై ర్భూషితాం
భక్తాభీష్టఫలప్రదాం హరిహరబ్రహ్మాదిభి స్సేవితాం
పార్శ్వే పంకజశంఖపద్మనిధిభి ర్యుక్తాం సదా శక్తిభిః.

శ్లో॥ నవదుర్గాం మహాకాళీం బ్రహ్మవిష్ణుశివాత్మికాం
త్రికాలజ్ఞానసంపన్నాం నమామి భువనేశ్వరీమ్.

శ్యామ—ఇదివఱకే యాలస్యమయినది.

(అని శ్లోకము ముగియకముందే క త్తితో నఱికివేయును.)

(దమనిక లోపలినుండి "ప్రభూ, ప్రభూ" అని కేకలువేయును.)

శ్యామ—ఏమి టాధ్వని? (ఉలికిపడి) ఎవరది? ఇది యింకను జావలేదు. ఇంకను జీవ మున్నది. నా హృదయ మెంత కాఠిన్యముఁ దాల్చినను గరుణను బూర్తిగ విడనాడ లేకున్నది. కావున ని న్నెక్కువసేపు బాధపడనీయను.

(అని కుముద్వతిని మఱియొకపోటు పొడుచును.)

దమ—రాజేంద్రా, శ్యామలరాయా, పలుకరేమి? ఎవ రింట్లో, పలుకరేమి!

శ్యామ—ఎవరక్కడ ?

దమ—మహాప్రభూ, నేను దమనికను. మీతో నొకమాట చెప్పవలసి యున్నది.

శ్యామ—(స్వగతము) ఇప్పటికీపాతకిని చచ్చినట్లున్నది ? ... ... ... ఆ వచ్చినది దమనిక. ఈమె విశ్రమునిమరణవార్త నా కెఱింగింప వచ్చినది. బిగ్గఱగాఁ గేకలువేయుచున్నది. ఆ యుల్లాసముచేత నైయుండ నోపు. ఇపుడు దమనికను లోనికి రానిత్తునా? ......... లోనికివచ్చిన నా భార్యతో మాటాడుదును. ... ... ... అయ్యో, నా కెక్కడిభార్య! ఇంక నాకు భార్య యెక్కడ ? ఈ లోకమున నా కింక నాప్తు లెవ్వరు ? నే నేకాకి నైపోతిని. నా కన్నులు తిరుగుచున్నవి. జగ మెల్ల నంధకారపరివృత మై పోవుచున్నది—సూర్యచంద్రుల కిరువుర కొక్కసారిగ గ్రహణము సంభవించిన ట్లున్నది!! ప్రళయకాల మాసన్నమైన దేమో !!! ...

దమ—ప్రభూ, దయయుంచి తలుపుతీయుఁడు. మీతో నొక్కమాట చెప్పవలెను.

శ్యామ—ఓహో ! నీ సంగతి మఱచిపోయితిని. దమనికా, నీవా? ఇటు రమ్ము. (స్వగతము) ఈ దుప్పటి పైనఁ గప్పెదను. (కుముద్వతిపై రంగుదుప్పటి కప్పును) (ప్రకాశముగ) దమనికా, నీ వెక్కడ నుంటివి ? త్వరగా రమ్ముఁ

[తలుపు తెఱచును. దమనిక ప్రవేశించును.]

దమ—మహాప్రభూ, అచట నొక ఘోరహత్య జరిగినది.

శ్యామ—ఇప్పుడేనా ? ఎక్కడ!

దమ—ఇప్పుడే ప్రభువరా, ఇప్పుడే- రాజవీథిలోనే.

శ్యామ— ఇ దంతయు గ్రహచారదోషము. చంద్రుడు క్రిందికి దిగి యందఱకుఁ బిచ్చియెత్తించుచున్నాఁడు.

దమ—దేవా, విక్రముఁడు రఘుపతి యను నొకయువకుని హత్య చేసినాఁడు.

శ్యామ—ఏమీ, రఘుపతి చంపఁబడియెనా ? విక్రముఁడు చావలేదా !

దమ—లేదు. విక్రముఁడు చంపఁబడలేదు.

శ్యామ—ఏమీ, విక్రముఁడు చావలేదా? అటులైన నన్నీ ఘోరవార్త క్రోధవివశునిఁ జేయుచున్నది.

కుము—(మరణవేదనతో) హా నిష్కారణముగ వధింపఁబడితినిగదా. తుద కిట్టి యమానుషహత్యకుఁ బాలైతినే.

దమ—ఎవరా యేడ్చునది?

శ్యామ—ఏదీ, యేమున్నది.

దమ—అయ్యో, అయ్యో! అది మాయమ్మ కంఠస్వరము గాదా? అమ్మా, ఇంకొకసారి పలుకుము. తల్లీ, కుముద్వతీ! మరలఁ బలుకుము.

కుము—నేను నిష్కళంకనై దేహము వీడుచున్నాను.

దమ—అక్కటా! ఈ ఘోరకార్య మెవ రాచరించిరి?

కుము—ఎవ్వరును లేదు. నేనే తెచ్చుకొంటిని. ఇంక నే బోవు చున్నాను. దయామయుఁడగు నాభర్తకు నా విన్నపము లెఱిఁగించుము. ఇంక నే నేగుచున్నాను. శ్రీరామ రామ రామ......[అని హీనస్వరమునఁ బలికి మంచమునుండి క్రిందకు దొర్లి చచ్చిపోవును.]

శ్యామ—ఏమిది! ఈమె యెటుల వధింపఁబడియె?

దమ— ఏమీ, నీ వెఱుఁగవా ? అయ్యో! అయ్యో!

శ్యామ—తానే యని యామెయే చెప్పుకొనియెఁగదా. నేను గాదనుట స్పష్ట మయ్యె.

దమ— ఆమె యట్లే పలికినది. కాని నేనది నమ్మఁజా లను. సత్యముఁ జెప్పుము.

శ్యామ—ఆమె మరణావస్థలోఁ గూడ నసత్యమాడుచు నర కమునఁ గూలుచున్నది. ......నిక్క మారయ నామెను జంపినది నేను. నే నే!

దమ—నీవు బ్రహ్మరాక్షసుఁడవు - ఆమె దేవవనిత.

శ్యామ—ఆమె ద్రోహియై జారత్వమునకుఁ బాలుపడినది.

దమ—నీవా మహాసాధ్వి నన్యాయముగ దూషించుచు న్నావు. పరమమూర్ఖుఁడవు.

శ్యామ—హరిణమువలెనే చంచలయై యీ మోహనాక్షి నన్ను మోసగించినది.

దమ—ఆమెయా మోసగించుట! నీనాలుక యగ్నిజిహ్వవలె ననుచితజ్ఞత లేక చాంచల్యమునఁ బ్రేలుచున్నది. ఆమె మహావిశ్వాసవతి.

శ్యామ—నేను న్యాయము పరిశీలింపకయే యీ పనిఁ జేసి యున్నమహాపాపినే యగుదును—కాని యంతయు నీ భర్త యెఱుంగును?

దమ—నాభర్తయా?

శ్యామ—ఔను, నీ భర్తయే.

దమ—ఆతఁ డేమెఱుంగును? ఆమె వ్యభిచరించుట యాతఁ డెఱుంగునా?

శ్యామ—ఔను.

దమ—ఎవరితోఁడ?

శ్యామ—ఎవరితోనా? విక్రమునితో. ఆమెయే సాధ్వీమణియైన నాకు స్వర్గసౌఖ్యము లఱచేతఁ బెట్టినను నామెను విడిచియుండను

దమ—విక్రమునితోనా! వ్యభిచరించెనా!!నాభర్తచెప్పెనా!!!

శ్యామ—ఔను. సజ్జనపుంగవుఁ డీరావంతుఁడే నాకు మొదటఁ దెలిపినవాఁడు. పాప మాతఁడు దుష్కార్యములఁ జూచి యోర్వఁజాలఁడు.

దమ—నా భర్తయా?

శ్యామ—ఔను, నీ భర్తయే. మరల మరల నడిగెద వెందులకు ? నామాటలు వినఁబడుటలేదా ?

దమ—అయ్యో, దేవీ, నా కన్నతల్లీ ! నీ నిష్కళంక ప్రేమ దౌర్జన్యదూషితమై భంగపడి పోయినది. ఓయీ ! ఘూర్కుఁడా, ఏమంటివి ? ఆమె దుశ్శీల యని నాభర్త చెప్పెనా ?

శ్యామ—ఔను, అతఁడే నీ భర్తయే - ముమ్మాటికి నీ భర్తయే. ఇప్పుడైన బోధపడినదా ? నీకు భర్తయు నాకు మిత్రుఁడును నగునిరావంతుడు - ఏమట్లు తెల్లఁబోయెదవు.

దమ—ఆఁతడే యట్లుసెప్పిన, ఆతనినాలుక వేయిచీలికలై పోవుఁగాక. ఎంతటి దారుణంపుటబద్ధము! అయ్యో; తల్లీ! ఇట్టినీచునిఁ గట్టుకొనియు నుత్కృష్టపాతివ్రత్యము నెఱపితుద కిట్లు దుర్మరణముపాలైతివా, తల్లీ.

శ్యామ—ఆ ! ఆ ! ఏమంటివి? నేను నీచుఁడ ననియా?

దమ—ఔను నాకేమియు భయములేదు. నీయిష్టము వచ్చినట్లు చేసికొనవచ్చును. నీ వామె కెంత తగినవాఁడవో, ఈ దుష్కార్య మీశ్వరున కంతియే.

శ్యామ—ఇంకఁ జాలు. నోరు మూయుము.

దమ—నే నిపుడు సర్వవిధముల సంసిద్ధురాలనై యున్నాను. నీవు న న్నేమియుఁ జేయఁజాలవు. ఛీ, పాపీ! తలతిక్కచే నొడ లెఱుంగక యెట్టిఘోరకార్య మాచరించితివిరా! నీ కత్తికి నే జడియను. న న్నిరువదిసార్లు చంపినను సరే.

యీ సంగతి వెల్లడిచేసి తీరెదను. అయ్యో, రండు. రండు. ప్రజలారా, రండు ఈ ఘూర్కుఁడు మా యమ్మను హత్య గావించినాఁడు. హత్య, హత్య, రండి. రండి.

(ప్రవేశము: మలిదేవుఁడు, లక్ష్మణుఁడు, ఇరావంతుఁడు.)

మలి—ఏమి, యీ కేకలు! రాజా, ఏమిది?

దమ—నాథా, వచ్చితివా! మంచిపనిఁ జేసితివే? ఈఘూర్కుఁడు చేతులార హత్యఁ గావించి నీపై మోపుచున్నాఁడే! ఇదేమి యాగడము?

లక్ష్మ—ఇప్పు డేమి జరిగినది? హత్య యేమిటి?

దమ—నాథా, ఈ నీచునిమాట ముందు ప్రతిఘటించి నిజము పలుకుము. లేకున్న మనకు మర్యాద లేదు. ఈతని భార్య మంచిది గాదని నీవుచెప్పితివంట నిజమేనా? నేను నమ్మలేను. నీ వట్లు చెప్పియుండవని నానమ్మకము. నిజము చెప్పుము.

ఇరా—నే ననుకొన్న దేమో యాతనితోఁ జెప్పితిని. ఆతనికి రుజువుపఱచితిని. అటుపైని నాతఁడే స్వయముగఁ జూచుకొని సంతుష్టిపడెను. అంతకంటె నే నేమియు నెఱుంగను.

దమ—అదేమో నాకుఁ దెలియదు. ఆమె ద్రోహిని యని యాతనితో నెప్పుడైనఁ జెప్పితివా?

ఇరా—ఔను, చెప్పియుంటిని.

దమ—అటులైన నీ వబద్ధమాడితివి. ఘోరమైన యబద్ధమాడితివి. మహాపాతక మొడిఁగట్టుకొంటివి. ఆమె వ్యభిచరించెనా? విక్రమునితోనా? అంతేనా నీవు చెప్పినది?

ఇరా—ఔను. నీ వింక నోరుమూసికొనుము.

దమ—నేను మూసికొనను. నే నిపుడు మాటాడితీరవలయును. మా తల్లి కుముద్వతి యిపుడు చిత్రవధ గావింపఁబడి యింటఁ బడియున్నది. నేను జూచి సహింపఁజాలను.

అందఱు—పాపము శమించుఁగాక!

దమ—నీ చెప్పాటలే యీహత్యకుఁ గారణ మఁట!

శ్యామ—అయ్యలారా, అబ్బురపడకుఁడు. ఆమాట నిజమే?

లక్ష్మి—ఇది కడు విచిత్రముగా నున్నది

మలి—ఎట్టి యకృత్యము! ఎంతటి ఘోరము!

దమ—రాక్షసము, దుర్మార్గము, దౌర్జన్యము! అయ్యో, అయ్యో, దుర్భరము, దుర్భరము. నే నీదుఃఖము భరింపఁ జాలను.

ఇరా—ఏమిది? నీ కేమైనఁ బిచ్చియెత్తినదా యేమి? ఇంక నోరు మూసికొని యింటికిఁ బొమ్ము.

దమ—అయ్యలారా, నేను చెప్పవలసినది చాలఁగలదు. నా కనుజ్ఞయిండు. ఇప్పుడు నే నాకేసియాజ్ఞకు లోఁబడఁ జాలను. ఇరావంతుఁడా, ఇంక నే నింటికిఁ బోనేపోను. ఇంక నా కెక్కడి యిల్లు!

శ్యామ—హా, హా! మోసము, మోసము! [అని కూలఁ బడును]

దమ—ఛీ ఛీ! క్రిందఁబడి గుట్టువెట్టుము. కాలసర్పమా, నిష్కళంకయగు ననన్యసామాన్యసాధ్వీమణిని నీ వాఁత వేసికొంటివి.

శ్యామ— (లేచుచు) ఛీ, కాదు. అది దుర్మార్గురాలు. మామా, లక్ష్మణసింహా, ని న్నింతవఱకు గుర్తింపఁజాలనైతిని; క్షమింపుము. మీ కుముద్వతి యిచ్చటఁ జచ్చిపడియున్నది. ఇప్పుడే నేను చంపితిని. ఇది మీ కిపుడు కూ్రిర మనిపించవచ్చును.

లక్ష్మ—హా, కుముద్వతీ! మమ్ము వీడిపోయితివా ? నీ తండ్రి గతించిపోవుటయే మేలైనది. నీ వివాహమే యాతని మనోవ్యథకుఁ గారణమై తుద కాతనిజీవముల హరించినది. ఆతఁడు జీవించియుండినను నిపుడు తప్పక యాత్మహత్య గావించుకొనును.

శ్యామ—ఇది చాల ఘోరకార్యమే. కాని యామె పెక్కుసార్లు విక్రమునితో వ్యభిచరించినది. ఈ మాట యిరావంతుఁ డెఱుంగును. విక్రముఁడుగూడ నొప్పుకొనినాఁడు. పైగా నేను వివాహమపుడు ప్రేమచిహ్నముగ నామె కిచ్చిన చేతిరుమాలును, మంత్రపూతమై మిక్కిలి మాహాత్మ్యముఁ గలదానిని, జంకుగొంకులేక యాతని కిచ్చివేసినది. నేను దాని నాతనికడఁ జూచితిని.

దమ—హా, పరమేశ్వరా! ఇదెక్కడి యపవాదము!

ఇరా—ఇంక నోరు మూసికొనుము. లేకున్న మర్యాదదక్కదు.

దమ—నిజము బయటఁబడక మానదు. బయటఁ బడితీరును. నే నూరకుండఁ గలనా? అక్కటా! నాచేతఁగాదు. నేను భరింపఁజాలను. నావాగ్ఝరి నెవ్వరు వద్దుపెట్టరాదు. దేవతలు రాక్షసులు గూడ నేకమై యడ్డువచ్చినను నరే, మిన్ను

విరిగి పైఁబడినను సరే, నే నిపుడు మాటాడితీరెదను.
ఇరా—ఛీ, ఛీ. ఇంకనైనను దెలివిఁ దెచ్చుకొని యింటికిఁ బొమ్ము. నీ విటఁ దడయరాదు. పొమ్ము.
దమ—నేను పోను.

(ఇరావంతుఁడు కత్తి దూసి భార్యను నఱకఁబోవును.)

లక్ష్మి—ఛీ, అబలలపైనా నీ ఖడ్గప్రయోగము!
దమ—ఓరీ, ఘూర్ఖుఁడా, పరమమూర్ఖుఁడా, ఇటు వినుము. నీ విప్పుడు చెప్పినచేతిరుమాలు నాకదృష్టమున లభించినది. అదివఱకు దాని నెత్తుకొని రమ్మని నన్నెన్నియోసార్లు నా భర్త వేడుకొనియుండుటచే దాని నాతని కిచ్చితిని.
ఇరా—ఛీ, రాకాసీ! నోరు మూసికొని లేచిపొమ్ము.
దమ—ఏమీ, ఆమె విక్రమునికిచ్చినదా? ఎంతటి కల్పన! ఆమెయేడ! విక్రమున కిచ్చుటేడ!! ఎంత ఘోర కల్పన!!! అది నాకు దొరకినది. నేను నాభర్త కిచ్చితిని. ఇది యథార్థము.
ఇరా—ఛీ, కులటా, నీ వబద్ధమాడుచున్నావు.
దమ—మహాపురుషులారా, దైవసాక్షిగ నే నబద్ధమాడుట లేదు. ఓరీ హంతకా, లేకున్న నీ యట్టి యథమాథమున కంతటి సుగుణరాశి దక్కునా? (ఇరావంతుఁడు దమనికను గత్తితో నఱికి పరుగెత్తును. దమనిక క్రిందఁబడును.)
శ్యామ—ఏమి యీయింద్రజాలము! స్వర్గమునుండి బ్రహ్మాండమైన పిడుగు నాతలపైఁ బడుఁగాక.
లక్ష్మి—పాప మీ యతివ క్రిందఁబడిపోయినది. వాఁడు దీనినిజంపివేసినాఁడు.

దమ—అయ్యలారా, నన్ను మాయమ్మచెంతఁ బరుండఁబెట్టుఁడు
లక్ష్మ—వాఁడు పారిపోయినాఁడు. ఈమె గతించుచున్నది.
మలి—వాఁడు సుప్రసిద్ధమాయావి - (శ్యామలునిచేతి ఖడ్గమును లాగుకొనును.) తలుపుల బిగించి యాతనిఁ గాచి యుండుఁడు. నేనతని దఱుముకొనిపోయి పట్టితెచ్చెదను.

(వెడలిపోవును.)

శ్యామ—నా బాహుబలముగూడ నంతరించినది. అల్పుఁడొకఁడు నా చేతికృపాణముఁ గైకొనఁగలిగె. ఔను, మానము పోయినవెనుక దర్ప మెందులకు? ప్రాణ మెందులకు? అన్నియు నంతరించిపోయెడివే.
దమ—అమ్మా! నీపాటలో నున్న దంతయు నీకే జరిగెనే తల్లీ; అమ్మా, నామాట నీకు వినఁబడుచున్నదా? నీవు “ఊఁ!” కొట్టుచున్నావా? నేను గూడ నిన్ను స్మరించుచు జీవముల వీడి నీదరికిఁ జేరెదను ....... ఓరీ, క్రూరుఁడా! ఆమె పరమపవిత్రురాలు. నిన్ను హృదయపూర్వకముగఁ బ్రేమించి మోసపోయినది. నేను సత్యము చెప్పుచు మృతి నంది యామెను జేరఁబోవుచున్నాను. దైవము మాయాత్మలకు శాంతిఁగూర్చుఁగాక. [అని క్రిందఁబడి చచ్చిపోవును.]
శ్యామ—నాకీ గదిలో నింకొక పదనైన యాయుధముదొరకినది. మామా! లక్ష్మణసింహా, నే నింకఁ గడ తేఱవలయును.
లక్ష్మ—నీ వాప్రయత్నము చేసిన మర్యాద దక్కదు. జాగ్రత్త. ఏదీ ఆయుధము.
శ్యామ—ఇదిగో, ఇది మిగుల దుర్లభమైనది. ఈ హస్తమున నిదే ఖడ్గమును ధరించి మున్నొకమారు, ఈ దుర్గాధిపతి

కంటేఁ బదిరెట్లెక్కువబలముఁగలవారిఁ, బదుగుర నొక్క-
పరి నెదిరించితి. అక్కటా! అట్టి నాదర్పమెల్ల నేడు నిరర్థ
కమైనదిగదా! విధి నతిక్రమింప నేరితరమగును? మామా,
నాచేత ఖడ్గ మున్నదని భయపడకుము. ఇది నాజీవయాత్ర
కంతిమదశ. నీవు విభ్రాంతుఁడవై వెనుకకు మరలుదువా?
అక్కరలేదు. నన్ను ముట్టుకొనినఁ గ్రిందఁబడిపోవుదును.

ఛీ శ్యామలా, యింతలో నెంత పిఱికిది వైపోతివి. ఈ
ఘోరచర్యకు ని న్నేమనవచ్చును? హా తరుణీ, కుముద్వతీ!
లోకాంతరముననైన నిన్నుఁ జూడఁగలనా? అపుడు నీదరిఁ
జేరఁబోవ నన్ను యమభటు లడ్డువచ్చి నరకమునఁ గూలఁ
ద్రోయుదురు. అక్కటా నీ పాతివ్రత్యమువలెనే నీవును
నిశ్చలతఁ దాల్చితివి. ఓరీ ఇరావంతా, మానవాధమా!
నాచే నెంతపనిఁ జేయింతివిరా? పంచభూతములారా,
మీ రెల్ల రేకమై నన్నుఁ జావమోదుఁడు. వాయుదేవా,
న న్నెటకేనిఁ గొంపోయి కొండతాలపై విసరికొట్టుము.
రాజభటులారా, నన్ను గళకళ క్రాగు నూనెలో ముంచి
తేల్చుఁడు. హా కుముదా, నన్ను విడిపోయితివిగదా.

(అని మూర్ఛిల్లును.)

(ప్రవేశము:సవారిలో విక్రముఁడు,బంధితుఁడగు నిరావంతునితో మలిదేవుఁడు)

లక్ష్మ—ఏడీ, ఆకాలసర్పము! అతుచ్ఛుఁడు - ఇరావంతుఁడు.
వాని నిటకుఁ దెండు.

శ్యామ—నే నాతనియానల శిరసావహించియే యింతటి
చేటుఁ దెచ్చుకొంటిని. అదియెల్ల నిపుడు స్వప్నవార్త. ఓరీ,
పిశాచమా, ఇదే చచ్చితివి. (అని యొక పోటు పొడుచును.)

లక్ష్మి—ఆ ఖడ్గము నాతని చేతినుండి లాగుకొనుఁడు.
ఇరా—నాకు గాయము తగిలినదేగాని, నేను చావలేదు.
శ్యామ—చావకున్న నాకుఁ జింతలేదు. ఇంత తేలికగా నీవు చావఁగూడదు.
లక్ష్మి—ఓయీ, శ్యామలరాయా, ఈ నీచునిపాలఁబడి యెంతమంచివాఁడవెట్లైపోతివి? నిన్నిప్పుడేమనవలయును?
శ్యామ—ఏమి ? గౌరవార్హుఁడగు హంతకుఁ డనుము. ఏల యన నే నంతయు నాయాత్మగౌరవసంరక్షణము కొఱకే చేసితిని గాని దురుద్దేశ మేదియు నాకు లేదు.
మలి—ఈ నీచుఁడు తనదుర్మార్గమును కొంతవఱ కొప్పుకొన్నాఁడు. విక్రమునివధనుగూర్చి మీ రిరువురుఁ గలిసి యాలోచించిరఁట. నిజమేనా ?
శ్యామ—ఔను, నిజమే.
విక్రి—ప్రభువరా, నే నెన్నఁడును మీయెడ నే యపరాధముఁ జేసియుండనే.
శ్యామ—విక్రమా, నే నిదే క్షమాపణ వేడుకొనియెద. నాశరీరమును నాత్మనుగూడ హరించి యీరీతి నురులఁ ద్రోసిన యీరక్కసి నడుగుమామాట.
ఇరా—న న్నేమియు నడుగవలదు. మీకుఁ దెలిసిన దేమో తెలిసినది. ఇంక నొక్కమాట యైనఁ బలుకను.
లక్ష్మి—దైవప్రార్థనఁగూడ చేయవా ?
మలి—చావగొట్టి మాటాడించెదను.
శ్యామ—అది చాల మంచిపని.

మలి—మీా కింతకును యథార్థము తెలిసినట్లు లేదు. చచ్చిపోయిన రఘుపతి జేబులో నీ జాబు దొరకినది. దీనిలో విక్రమునివధ రఘుపతిచేత నిర్వర్తింపఁబడవలె నని యున్నది. ఇది మఱియొక జాబు-దీనిని బట్టి, ఆరఘుపతి, యీా యిరావంతునే చంప నుద్దేశింపగా వీఁడు వచ్చి వాని మనస్సు మార్చివేసి వానిని విక్రమవధకుఁ బురిగొల్పినట్లు స్పష్టమగుచున్నది.

శ్యామ—ఓరీ యెంత దుష్టుఁడవురా? కాని, విక్రమా, నా భార్యచేతిరుమాలు నీ కెట్లు లభించె?

విక్ర—అది నా గదియందుఁ బడియుండెను. ఏదో పనిమీాఁద దాని నచటఁ బడవేసితి నని వీఁ డొప్పుకొన్నాఁడు.

శ్యామ—ఔరా, ఔరా!

విక్ర—అదిగాక మొదట నిరావంతుఁడే నేను కావలియుండిన తొలిజేయి నాతోఁ బోరాడఁ దన్నుఁ బ్రేరేపించెననియు, మరల నాతఁడే నన్ను వధింప నాజ్ఞాపించినట్లును, దుదకు వీఁడే తన్ను నఱికినట్లును రఘుపతి చెప్పి చచ్చిపోయెను.

లక్ష్మ—శ్యామలా, నీ పదవినుండి తొలఁగింపఁబడితివి. ఇంక మీాఁదట విక్రముఁ డీ ద్వీపమున కధిపతి. నీవు వెంటనే యీా కోట వీడి నాతో రావలయు. నీ నేరము నాంధ్రపురి మంత్రివర్గమువారే విచారింతురు. అంతదనుక నీవు నా యొద్ద బందీగ నుండవలయును. ఈ దుర్మార్గునికిఁ దగిన శిక్ష విక్రముఁడే విధించును.

శ్యామ—అయ్యా, కొంచెె మాగుము. న న్నొక్క మాటఁ జెప్పుకొననిమ్ము. నేను మీ రాజ్యమున కించుక సేవఁ జేసి యుంటిని. మీ రీ ఘోరహత్యనుగుఱించి ప్రసంగించి నపుడు నన్నుఁగూర్చి యున్నదున్నట్లు పలుకుఁడు. అర్థోక్తి వలదు. అతిశయోక్తియు వలదు. నా ప్రేమ గాఢమైనది. కాని నేను లౌకికజ్ఞానశూన్యుఁడ నైతిని. ... దురుద్దేశము లేనివాఁడనయ్యు దుష్టుల ప్రోత్సాహము వలనఁ జెడితిని. వజ్రమును గాంచి గాజుపెంకని పారవేసి కొన్న యడవిగొంటు నైతిని. దుఃఖమన్న నెఱుంగనివాఁడ నయ్యు దుఃఖశోకమును జేతులారఁ దెచ్చిపెట్టుకొన్న దౌర్భాగ్యుఁడ నైతిని. మున్నొక యాటవికుఁ డొక రాజ పుత్రుని నిష్కారణముగఁ బట్టి బంధింపుచుండ నేను జూచి హఠాత్తుగ నచటికి దుమికి వానిమెడ పట్టుకొని యిట్టు లొక్క దెబ్బతోఁ గడ తేర్చితిని.

(అని కంఠము నులుముకొని క్రిందఁ బడిపోవును.)

లక్ష్మి—అబ్బబ్బ! ఇదెంత మర్దనము.

శ్యాను—ఓకుముదా, నిన్నుఁ జంపుటకు ముందు నే నిట్లు ముద్దుగొంటిని. ఇంక నాకు గత్యంతరము లేదు. ని న్నొక సారి ముద్దుగొని పిదప మరణించి నిన్నుఁగలియవచ్చెదను.

(అని కుముద్వతి సమీపమునకు దొర్లి చచ్చిపోవును.)

విక్రమ—ఇట్లు జరుగు నని నే ననుకొంటిని. ఏలయన నాతనిహృదయము మిగుల గంభీరమైనది. కాని చేత నాయుధము లేదు గదా యని యనుకొంటిని.

లక్ష్మి—(ఇరావంతునితో) ఓరీ, దేశద్రోహీ, ఈ ఘోరకృత్యముల నెల్ల నొకటివెంట నొకటిగఁ గండ్లారఁ జూచితివి. వీని కెల్ల మూలకారణము నీవేగదా! చూచినకొలఁది నేత్రములకు భ్రమగలుగుచున్నది. తెరదించివేయుఁడు.

(రంగస్థలమున వెనుకభాగమువఱకుఁ దెరపడును.)

విక్రమా, ఇంక నీవే యీ ద్వీపమున కధిపతివి. వీని కుచిత మగుదండన వెంటనే విధింపుము. నే నిదేపోయి యీ దుర్వార్త నాంధ్రపురమున నెఱింగించెద. పోయి వచ్చెదను. [నిష్క్రమించును.]

## భరతవాక్యము.

ధరణి సస్యసమృద్ధమై తనరునట్లు
ప్రజలు న్యాయంబు సుఖమును బడయునట్లు
ప్రభులు సత్పరిపాలనాపరులుగాఁగ
వరము లిడుఁగాత లోకైకపాలకుండు.

## మంగళము

---

## గద్య.

ఇది శ్రీ జగద్విఖ్యాతాంగ్ల నాటక రచనాకౌశాదక్ష
శ్రీ షేక్సుపియరు కవీంద్ర ప్రణీత
శ్రీ "ఒథెల్లో" నామ నాటకో త్తంసంబునకు
శ్రీ కర్లపాలెపు నరసింహరాయ తనూజాత
శ్రీ లక్ష్మీ నరసింహరాయకృత
శ్రీ ముగ్ధ ప్రణయనామాంకి తాంధ్రానువాదంబు
సర్వంబును సంపూర్ణము.

## ఈగ్రంధములు దొరకుచోట్లు

1 శ్రీముఖాశ్రియము, పూర్ణానందంపేట,

బెజవాడ.

2 స్వదేశీభాండారము, గుంటూరు.